# నెల్లూరు జిల్లా గ్రామనామాలు
# భాషా సామాజిక పరిశీలన

# A SOCIO-LINGUISTIC STUDY OF THE PLACE NAMES OF NELLORE DISTRICT

(Ph.D. Thesis)



డా॥ వి. చంద్రశేఖర్ రెడ్డి
లెక్చరర్
తెలుగు అధ్యయన శాఖ
యస్. వి. యూనివర్శిటీ
తిరుపతి






శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం

# నెల్లూరు జిల్లా గ్రామ నామాలు

# భాషా సామాజిక పరిశీలన

# A SOCIO - LINGUISTIC STUDY OF THE PLACE NAMES OF NELLORE DISTRICT

(Ph.D. Thesis)



డా॥ వి. చంద్రశేఖర్ రెడ్డి
లెక్చరర్
తెలుగు అధ్యయన శాఖ
యస్. వి. యూనివర్శిటీ
తిరుపతి






శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి
1989



ఈనాటి నా స్థితికి

కారకులైన నా తండ్రి

**క్రీ॥ శే॥ శ్రీ ఉగ్రాణం కళ్యాణరెడ్డి గారికి**

ప్రేమతో ఈ గ్రంథం అంకితం.

# కృతజ్ఞతలు

—:o:—

నేను ఎం.ఏ., విద్యార్థిగా ఉన్నప్పటినుంచీ వాత్సల్యంతో చదువులోనూ, జీవితంలోనూ మార్గదర్శకులుగా వుంటూ స్థలనామవిజ్ఞానంలో కృషి చేయాలనుకున్న నా కుతూహలాన్ని గమనించి పి హెచ్. డి., డిగ్రీకోసం పరిశోధన చేయటానికి అనుమతించి ప్రోత్సహించిన గురువర్యులు సహృదయులు ఆచార్య జి. యన్. రెడ్డి గారికి నా కృతజ్ఞతా సుమాంజలి.

మొదటినుంచీ సిద్ధాంత వ్యాసాన్ని శ్రద్ధతో పరిశీలిస్తూ అది బాగా రావాలనే ఉద్దేశ్యంతో సలహాలనూ, సూచనలను ఇచ్చి సిద్ధాంతవ్యాసం ఒక రూపు దిద్దుకోవడానికి తోడ్పడిన పర్యవేక్షకులు, ప్రియ గురువులు డా॥ కేతు విశ్వనాథ రెడ్డి గారికి కృతజ్ఞతాభివాదాలు.

సిద్ధాంత వ్యాసానికి సంబంధించిన కొన్ని సందేహాలను నివృత్తి చేసిన ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారికి, ఆచార్య పి. యస్. సుబ్రమణ్యం గారికి, డా॥ కుమారస్వామిరాజా గారికి, డా॥ పి. నరసింహారెడ్డిగార్లకు నా కృతజ్ఞతలు.

ఈ సిద్ధాంత వ్యాసానికి సంబంధించిన గెజిటీరు, మాన్యువల్ మొదలైన అపురూప గ్రంథాలను సూచనలను ఇచ్చి ఎంతో సహాయంచేసిన బంగోరే గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

నెల్లూరుజిల్లా గ్రామనామాల వ్యుత్పత్తికి సంబంధించిన వివిధ అంశాలను చర్చించి సూచనలిచ్చి తోడ్పడిన సరసులు. కళాప్రపూర్ణులు డా॥ మరుపూరు కోదండరామిరెడ్డి గారికి నా కృతజ్ఞతలు.

పరిశోధనా సామగ్రి మూలాధారాలను సమకూర్చుకోవడంలో తోడ్పడిన ఆయా తాలూకా కార్యాలయాల అధికారులకు, మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం అధికారులకు, విశ్వవిద్యాలయ భౌగోళికశాస్త్ర శాఖాచార్యులు ఆచార్య ఎన్.బి.కె. రెడ్డి గారికి నా కృతజ్ఞతలు. అవసరమైన నెల్లూరు జిల్లా

శాసనాలు మొదలైన రెఫరెన్సు పుస్తకాలు వెతికి ఇచ్చిన పి. ప్రభలు షణ్ముగం గారికి, సిద్ధాంత వ్యాస శుద్ధప్రతిని వ్రాసి యిచ్చిన డా॥ జి. చలపతి. కుమారి కె. శారద, కె. సిద్ధారెడ్డి గార్లకు నా కృతజ్ఞతలు.

పరిశోధకునికి ప్రత్యక్షంగా పరోక్షంగా సహాయం చేసిన వారు ఎందరో. వారిలో ముఖ్యులు టి.యస్.వి. ప్రసాద్, సి. పట్టాభిరెడ్డి, జి. శివరామప్రసాద్, ఎ. మధుసూదనరెడ్డి, వి. యస్. ఆర్. ప్రసాద్, డా॥ డి. కృష్ణమూర్తి, ఎం.బి.బి.ఎస్., హయత్, అంగర పురుషోత్తం · తెలుగు అధ్యయనశాఖ టైపిస్టు……………అందరికి నా ప్రేమాభివందనాలు.

ఈ సిద్ధాంత వ్యాసానికి పరీక్షకులుగా వ్యవహరించి అమూల్య సలహా లిచ్చిన ఆచార్యులకు కృతజ్ఞతలు.

ఈ సిద్ధాంతగ్రంథాన్ని ప్రచురించిన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి వారికి నా ధన్యవాదాలు.

ఈ సిద్ధాంత గ్రంథాన్ని అందముగా ముద్రించి ఇచ్చిన శారద ప్రింటర్సు యాజమాన్యమునకు, వారి సిబ్బందికి నా మనఃపూర్వక కృతజ్ఞతలు.

తి రు ప తి

మార్చి, 1989

ఉగ్గాణం చంద్రశేఖర్ రెడ్డి

# విషయసూచిక

>—<



* * *

# ప్రవేశిక

0. స్థల నామాలన్నప్పుడు కేవలం గ్రామ నామాలేకాదు - నాడులు, సముద్రాలు, నదులు, సరస్సులు, వంకలు, చెరువులు, కుంటలు, వాగులు, కొండలు, కోనలు, అడవులు మొదలైన భౌగోళిక స్థలాలకు ఆయా భాషల్లో అనాదిగా ఉన్న పేర్లుకూడా ఇవి స్థలనామ విజ్ఞానానికి ముడి పదార్థం అవుతాయి. ఈ పరిశోధక వ్యాసం నెల్లూరు జిల్లాలోని వేలాది ప్రకృతి స్థలనామాల పరిశీలనకు కాక నివాస స్థలనామలైన గ్రామనామాల పరిశీలనకు మాత్రమే పరిమితమైంది.

స్థలనామ పరిశోధనా ప్రాధాన్యాన్ని ఈనాడు భాషా శాస్త్రవేత్తలందరూ గుర్తించారు. భాషాశాస్త్రజ్ఞులే కాకుండా పురాతత్వ శాస్త్రవేత్తలు. చరిత్ర కారులు. భౌగోళిక చరిత్రకారులు. భూగర్భ, జంతు, వృక్ష, మానవ, జాతి శాస్త్రజ్ఞులుకూడా ఈ పరిశోధనా ప్రాధాన్యాన్ని తమ తమ మూల పరిశోధనలకు సహాయకారిగా గుర్తించినారు. స్థలనామాలు భాషకు సంబంధించిన రూపాలు కాబట్టి వాటి పరిశీలన అంటే ఒక సమాజం భాషా పరిశీలన ఆ భాషద్వారా తెలిసే నాగరికతా సంస్కృతుల పరిశీలన. ఈకారణం వల్లనే చరిత్ర గల్గిన ఏభాషా ప్రాంతంలోని స్థలనామాలైనా పూర్వ చరిత్రను తెలిపే శిలాజాలుగా వివిధ శాస్త్రజ్ఞులు గుర్తించడం జరిగింది.

0.1 స్థలనామనిర్మాణ వ్యుత్పత్తులను పరిశీలించడం ద్వారా భాషా చరిత్ర, సాంఘిక, రాజకీయ, మత వ్యవస్థాది స్థితిగతులు తెలుస్తాయి ఒక భాషా ప్రాంతం లోని స్థలనామాలలో మరోప్రాంతపు భాషా లక్షణాలు కన్పించడాన్ని బట్టి ఆయాభాషలు మాట్లాడే సమూహాల కదలికలు, వలసల తీరు తెన్నులు కొంత వరకు గ్రహించవచ్చు. బెంగాలు స్థలనామాలలోని ద్రావిడభాషా లక్షణాలను ఎస్.కె. చటర్జీ (The origin and Development of Bengali (క.ఊ.SI) Language 1926) గుర్తించిన తీరు ఇందుకు నిదర్శనం.

పురాతత్వశాస్త్రవేత్తలు నిర్వహించే త్రవ్వకాలకు ఒక్కొక్కసారి స్థల నామాలు కూడా తోడ్పడతాయి దానవులపాడు (కడప జిల్లా)లో, సాతానికోట (కర్నూలు జిల్లా) లో పురాతత్వశాఖ నిర్వహించిన త్రవ్వకాల వల్ల జైన, బౌద్ధమత చరిత్రలకు సంబంధించిన పెక్కు విశేషాలు వెలికి రావడాన్నిబట్టి ఈవిషయం స్పష్టపరుస్తుంది.

స్థలనామ ప్రథమావయవాల్లో కన్పించే వ్యక్తి, కుటుంబ, వంశనామాది చారిత్రక విషయాలు స్థానిక చరిత్ర నిర్మాణానికి తోడ్పడతాయి స్థలనామాల్లో కన్పించే ఘనత వహించిన వ్యక్తులు, వంశాల చరిత్ర కొంతవరకు అన్వేషింపవచ్చు వివిధ మతాల సంపర్కాన్ని, నాగరికతా క్రమాన్నీ తెలుసుకోవచ్చు దేశ చరిత్ర పాలకుల జీవితాలను బట్టి రచింప బడడమే ఆచారం. కానీ గ్రామనామాలను బట్టి చూస్తే పాలకులు కాకుండా జనులలో పేరు ప్రఖ్యాతులు గల మహనీయుల పేర్లతో గ్రామనామాలు ఏర్పడినాయని తెలుస్తుంది. చరిత్ర నిర్మాణంలో వాళ్లు కూడా భాగస్వాములే.

ఒక ప్రాంతం యొక్క నైసర్గిక స్వరూపం తెలుసుకోడానికి స్థలనామ పరిశోధన తోడ్పడుతుంది. సమతలమైదానాలు, గుట్టలు మిట్టలు, జలాధారాలు మున్నగువాటి వివరాలు, భూస్థితి తెలుసుకోడానికి ఈ పరిశీలన సహాయ పడుతుంది ఏయే ప్రాంతంలో ఏయే ఖనిజాలు, లోహాలు లభ్యమవుతాయో తెలుసుకోడానికి ఖనిజ సూచక గ్రామనామాలు చాలా ఉపయోగపడతాయి, వృక్ష, జంతు సూచక గ్రామనామాలద్వారా ఒక ప్రాంతంలో గల వృక్షాలు, జంతువులు తెలుసుకోడానికీ, వృక్ష, జంతు శాస్త్రజ్ఞులకు ఈ పరిశోధన ఎంతో ఉపయోగకారి.

## 0.2 స్థలనామ పరిశోధనా వికాసం :

ఈనాడు వివిధ దేశాలలో, వివిధ భాషలలో స్థలనామ పరిశోధన జరుగుతూ వుంది. స్థలనామసేకరణ, వర్గీకరణ, వివరణలు వైయక్తికంగా, సామూహికంగా ప్రత్యేక సంఘాలు, పత్రికల ద్వారా పెద్ద ఎత్తున సాగుతూవుంది. స్థలనామ నిఘంటువులు. వ్యాకరణాలు వెలువడుతున్నాయి.

19 వ శతాబ్దిలోనే స్థలనామ పరిశోధన వివిధ దేశాల్లో ప్రారంభమైనప్పటికీ 1920 ప్రాంతం నుండీ ప్రధానంగా ఇంగ్లండు, అమెరికాల్లో స్థలనామ పరిశోధన విస్తరింల్లింది. ఇపుడు స్థలనామ విజ్ఞానానికి ఒక శాస్త్ర ప్రతిపత్తి, అంతర్జాతీయ విఖ్యాతి లభించింది. 1921 లో ఆంగ్ల స్థలనామ పరిశోధన సంస్థ ఇంగ్లండులో స్థాపించబడింది ఈ సంస్థ ఇంత వరకు 44 స్థలనామ సంపుటాల్ని ప్రచురించింది.

అమెరికాలో 1920 తర్వాత మిన్నెసోటా, అయోవా, మిస్సోరి మొదలైన స్థలనామాలపైన అనేక వ్యాసాలు, సిద్ధాంత వ్యాసాలు వచ్చాయి. 1952 నుండి American Name Society ఆధ్వర్యంలో 'Names' అనే త్రైమాసిక పత్రిక ఏర్పడింది. 1963లో డెన్వర్ సమావేశంలో రాష్ట్రాలవారిగా స్థలనామాలను సేకరించాలనీ జాతీయ స్థలనామ కేంద్రం (National Place Name Centre) లో వాటిని ఉంచాలనీ నిర్ణయింపబడింది. యూరప్ అమెరికా పరిశోధకుల మధ్య స్థలనామ పరిశోధన విధానాల్లో కొంత భేదం ఉంది. యూరప్ స్థలనామ వేత్తలు ప్రధానంగా వ్యుత్పత్తి నిరూపకులు. నిరుక్త ప్రియులు. అమెరికా స్థలనామ వేత్తలు ప్రధానంగా ప్రణాళికా ప్రియులు. యూరప్ స్థలనామ పరిశోధకులకు ప్రాచీన చరిత్ర పునర్నిర్మాణం మీద దృష్టి. అమెరికా స్థలనామ పరిశోధకులకు నవీన చరిత్ర మీద దృష్టి.

భారతీయ స్థలనామ వేత్తలు పై ఇద్దరి అనుభవాల అధ్యయనం ద్వారా అత్యంత ప్రాచీన చరిత్రగలిగిన భారతీయ స్థలనామాల పరిశీలనకొక నిర్దిష్టమైన ప్రణాళికను రూపొందించే ప్రయత్నాలిపుడు జరుగుతున్నాయి.

## 0.3 స్థలనామ పరిశోధన - అంతర్జాతీయ సహకారం :

1938 పారిస్‌లో, 1849 బ్రస్సెల్స్ జరిగిన అంతర్జాతీయ నామ విజ్ఞాన సమావేశాల్లో 'అంతర్జాతీయ నామ సంస్థ' స్థాపనకు నిర్ణయం జరిగింది. 1950 నుండి Onoma, Bibliographical and information Bulletin అనే నామ విజ్ఞాన పత్రికను ఈ సంస్థ నడుపుతూ ఉంది.

0.4 భారత దేశంలో స్థలనామ పరిశోధన :

ప్రాచీన కాలంలో యాస్కుడు, కాత్యాయనుడు, పతంజలి మొదలగు భారతీయ నైఘంటికులు, వైయాకరణులు స్థలనామాల్ని పరిశీలించక పోలేదు. కానీ పాశ్చాత్య సామాజిక శాస్త్రాల పరిశీలన, అధ్యయనాల వల్లనే స్థలనామ పరిశోధన భారతదేశంలో ఒక ప్రత్యేక పరిశోధనగా ప్రారంభమైంది. 1960 కి ముందు భారతదేశంలో జరిగిన స్థలనామ పరిశోధన కేవలం ఔత్సాహిక ప్రయత్నం మాత్రమే.

విశ్వవిద్యాలయ స్థాయిలో స్థలనామాలకు సంబంధించిన సిద్ధాంత వ్యాస రచన ప్రప్రథమంగా చేసింది పురాతత్వశాఖలోని పరిశోధకులు. పూనా డక్కన్ కాలేజిలో ప్రఖ్యాత పురాతత్వ శాస్త్రవేత్త హెచ్. డి. సంకాలియా పర్యవేక్షణలో స్థలనామాలపైన కొన్ని సిద్ధాంత వ్యాసాలు వెలువడినాయి. సామాజిక భాషాశాస్త్ర దృక్పథంతో స్థలనామాలపై వెలువడిన ప్రప్రథమ సిద్ధాంత వ్యాసం ప్రకాశ్ కుర్ల్ రచించిన 'A Socio-Linguistic Study of Place Names of Saharanpur District' (1965) 1979లో 'భారతీయ స్థలనామ సంఘం' మైసూరు కేంద్రంగా ఏర్పడింది.

0.5 తెలుగులో స్థలనామ పరిశోధన :

ప్రాచీన తెలుగు భాషా స్వరూపాన్ని వివరించే సందర్భంలో భాషా శాస్త్రవేత్తలు స్థలనామ వివరణలో కొంత ఆసక్తిని చూపినారు. కొన్ని చెప్పుకోదగ్గ ప్రత్యేక వ్యాసాలు కూడా స్థలనామాలపై వచ్చినాయి. ప్రప్రథమంగా స్థలనామ పరిశోధనకు సంబంధించిన మొదటి సిద్ధాంత వ్యాసం 1970 తర్వాతనే వెలువడింది. అది ఆచార్య జి. ఎన్. రెడ్డిగారి పర్యవేక్షణలో వచ్చిన డా॥ కేతు. విశ్వనాథరెడ్డి గారి 'కడప ఊర్ల పేర్లు' (1975). పాశ్చాత్య భాషల్లో స్థలనామాలపైన ప్రచురితమైన విశ్వవిద్యాలయ స్థాయి మొదటి పరిశోధక గ్రంథం కూడా ఇదే. భారతీయ స్థలనామాల ప్రత్యేకతలు దృష్టిలో ఉంచుకొని స్థలనామ పరిశోధనకు అవసరమైన ఒక సమగ్ర ప్రణాళికను రూపొందించే ప్రయత్నం తొలిసారిగా ఈ సిద్ధాంత వ్యాసంలో కన్పిస్తుంది, శ్రీ యస్. యస్. రామచంద్రమూర్తి గారు 'ఆంధ్ర శాసనస్థ స్థలనామ పరిశీలన' అన్న అంశంపై సిద్ధాంత వ్యాసం సమర్పించి 1975 లో పిహెచ్. డి. డిగ్రీ పొందినారు. నాగార్జున విశ్వవిద్యాలయం నుండి

వై. బాలగంగాధరరావుగారు 'అనంతపూరు గ్రామనామాలు' అన్న అంశంపై ఆచార్య తూమాటి దొణప్పగారి పర్యవేక్షణలో పరిశోధించి 1981 లో పిహెచ్.డి. డిగ్రీ పొందినారు. కె. రాజేశ్వరి 'మద్రాసు పట్టణ స్థలనామాలు' అన్న అంశంపై పరిశోధకవ్యాసం మద్రాసు విశ్వవిద్యాలయానికి సమర్పించి ఎం.ఫిల్ డిగ్రీ (1981) పొందినారు. ఎస్. జయప్రకాశ్ 1981 జనవరిలో 'చెంగల్పట్టు జిల్లా గ్రామనామాలు' (5 తాలూకాలు మాత్రం) అన్న అంశంపై పిహెచ్.డి. పట్టంకోసం మద్రాసు విశ్వవిద్యాలయానికి సిద్ధాంత వ్యాసం సమర్పించారు. పై రెంటికి పర్యవేక్షకులు డా. ఎస్. అక్కిరెడ్డిగారు. ఆచార్య జి.ఎన్. రెడ్డిగారి పర్యవేక్షణలో అనంతపూర్, కర్నూలు జిల్లాల గ్రామనామాలపైన పిహెచ్.డి. పట్టానికి ఇద్దరు పరిశోధన చేస్తున్నారు. 'చిత్తూరు జిల్లా గ్రామనామాల భాషా సామాజిక పరిశీలన' అన్న అంశంపై పిహెచ్.డి. డిగ్రీకి సమర్పించ బోయే సిద్ధాంత వ్యాసానికి, ప్రస్తుత సిద్ధాంత వ్యాసానికి పర్యవేక్షకులు డా. కేతు విశ్వనాథరెడ్డిగారు.

0.6 తిరుపతిలో స్థలనామ పరిశోధన :

1978-79 లో యు.జి.సి. ఆర్థిక సహాయంతో తెలుగుశాఖలో 'కడప స్థలనామాల పైలెట్ సర్వే' జరిగింది. 1981 జూలై నుండి యు.జి.సి. ఆర్థిక సహాయంతోనే 'రాయలసీమ స్థలనామాల సర్వే' బృహత్పథకం ముగ్గురు పరిశోధకులతో ప్రారంభమైంది. ఈపథకానికి ప్రధాన పరిశోధకులు ఆచార్య జి.ఎన్. రెడ్డిగారు, పరిశోధకులు డా. కేతు విశ్వనాథరెడ్డి ఇప్పటికి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ తెలుగు అధ్యయన శాఖ రాయలసీమ జిల్లాల గ్రామనామ పరిశీలనకు పరిమితం చేసుకొన్న ఒక ప్రణాళికను చేపట్టింది. ఈ దిశలో సాగుతున్న ప్రయత్నాలు ఫలించి కార్యరూపం పొందినపుడు తెలుగు గ్రామ నామాల పరిశోధన త్వరిత గతి ముందుకు సాగగలదని ఆశించవచ్చు.

0.7 నెల్లూరు జిల్లాలో మార్పులు చేర్పులు :

నెల్లూరు జిల్లా ఆంధ్రప్రదేశ్ దక్షిణాది జిల్లాలలో ఒకటి. ఈ జిల్లా ఉత్తర అక్షాంశం 13° 30'-16° మధ్యగాను తూర్పు రేఖాంశం 70° 5'-80° 15' మధ్యగాను వ్యాపించి ఉంది. 1970 లో ఇప్పటి ప్రకాశం జిల్లాను ఏర్పాటు చేసిన తర్వాత ఈ జిల్లాకు ఉత్తరాన ప్రకాశం జిల్లా, తూర్పున బంగాళాఖాతం,

దక్షిణాన తమిళనాడు, చిత్తూరు జిల్లా; పడమట కర్నూలు, జిల్లా సరిహద్దులుగా ఉన్నాయి. జిల్లా విస్తీర్ణం 13,058 చ.కి. మీటర్లు. ఇది వైశాల్యం రీత్యా ఆంధ్రప్రదేశ్ జిల్లాలలో 11 వ స్థానం ఆక్రమించింది. 1971 జనాభా లెక్కల ప్రకారం 16,09,617 మంది జనాభాకల్గి రాష్ట్రంలో 11 వ స్థానంలో వుంది. జిల్లాలో 9 తాలూకాలున్నాయి. అవి : 1 ఉదయగిరి 2 కావలి 3 కోవూరు 4 ఆత్మకూరు 5 రాపూరు 6 నెల్లూరు 7 సూళ్లూరుపేట 8 గూడూరు 9 వెంకటగిరి. జిల్లాస్వరూపం: 1906 లో గుంటూరు జిల్లా ఏర్పడి నపుడు నెల్లూరు జిల్లా నుండి ఒంగోలు తాలూకాను విడదీసి గుంటూరు జిల్లాలో కలిపారు. 1910 లో నెల్లూరు తాలూకా నుండి కోవూరు తాలూకా పెన్నానది సరిహద్దుగా ఏర్పడింది. 1863 వ సంవత్సరంలో వెంకటగిరి తాలూకాకు చెందిన పోలూరు విభాగం, మద్రాసు జిల్లాకు చెందిన పొన్నేరి తాలూకాలోని 49 గ్రామాలు, 1911 వ సంవత్సరంలో చెంగల్పట్టు జిల్లా తిరువళ్లూరు తాలూకాలోని ఐదుగ్రామాలు, 1921, '28 లో గూడూరు తాలూకాకు చెందిన 18 గ్రామాలు సూళ్లూరుపేట తాలూకాకు చేర్చబడినాయి. 1941-61 సంవత్సరాల మధ్య అనేక చిన్న చిన్న మార్పులు జరిగినాయి. 1970 లో ప్రకాశం జిల్లా ఏర్పాటు చేయుటకు ఈ జిల్లా నుండి కనిగిరి, పొదిలి, దర్శి, కందుకూరు తాలూకాలను విడదీసి ప్రకాశం జిల్లాలో కలిపినారు. ప్రస్తుత పరిశోధనకు తీసుకొన్న జిల్లా పరిపాలనా ప్రమాణం (Administrative Unit) - 1978 వరకు జిల్లాలో ఉన్న పరిపాలనాభాగాల్ని ఈ పరిశోధనకు ప్రమాణంగా తీసుకోవడం జరిగింది. తాలూకాలు, రెవెన్యూ గ్రామాలు, వాటి మజరా గ్రామాల వివరాలు :

రెవెన్యూగ్రామాలు 1166 మజరా గ్రామాలు 1561

| తాలూకాలు | రెవెన్యూ గ్రామాలు | మజరా గ్రామాలు | మొత్తం గ్రామాలు |
|---|---|---|---|
| నెల్లూరు | 120 | 377 | 497 |
| గూడూరు | 152 | 161 | 313 |
| సూళ్లూరుపేట | 156 | 141 | 297 |
| వెంకటగిరి | 215 | 40 | 255 |
| రాపూరు | 114 | 110 | 224 |
| ఆత్మకూరు | 116 | 133 | 249 |

| తాలూకాలు | రెవెన్యూ గ్రామాలు | మజరా గ్రామాలు | మొత్తం గ్రామాలు |
|---|---|---|---|
| ఉదయగిరి | 120 | 159 | 279 |
| కావలి | 83 | 219 | 302 |
| కోవూరు | 90 | 221 | 311 |
| జిల్లాలో మొత్తం గ్రా॥ | 1166 | 1561 | 2727 |

1979-80 వ సంవత్సరంలో కొత్తగా ఏర్పడిన తాలూకాల కింద గల గ్రామాల పట్టిక, గ్రామ సంఖ్యా సంకేతాలు ప్రత్యేకంగా లేక పోవడం వల్ల 1978 కి ముందున్న తాలూకాలు, ఏ తాలూకాలో గల గ్రామాలు ఆ తాలూకా కిందనే తీసుకోవడం జరిగింది. పేరు రీత్యా ఒకటైనా పరిపాలనాప్రమాణం దృష్ట్యా రెండు ఊర్లు అయిన వాటిని రెండు ఊర్లుగా తీసుకోవడం జరిగింది. ఉదా : కనుపూరు (Bit I), కనుపూరు (Bit II)

తూర్పు గూడూరు, పడమర గూడూరు. రెండువేలకు పైగా ఉన్న హరిజనవాడలను, ఐదు వందలకు పైగా ఉన్న వీధుల పేర్లను ఈ పరిశీలనలోకి తీసుకోలేదు.

0.8 పరిమితి-మూలాధారాలు :

ఈ పరిశీలనలోని వివిధ మూలాధారాల (Sources) నుండి సేకరించిన ఊర్ల పేర్లను ప్రమాణీకరించి వాటిలోని ధ్వని, పదనిర్మాణ స్వరూపాలను వర్ణనాత్మక పద్ధతిలో వివరించడమైంది. సంపూర్ణంగా చారిత్రక రూపాలు లభ్యం కాక పోవడం వల్ల చారిత్రక పద్ధతిని అనుసరించలేదు. తులనాత్మక పద్ధతిలో పరిశీలించడాని కనువైన స్థలనామ సామగ్రి తెలుగులో ఇప్పటికీ మృగ్యమే. నెల్లూరు జిల్లాకు సంబంధించి A Collection of the Inscriptions on copper plates and stones in the Nellore District (Alan Butter Worth, Venu Gopal Chetty. 1903) అనే శాసనగ్రంథం ఉన్నా అందులో గ్రామనామ వివరాలు తెల్పేవి తక్కువ. ఉన్నంతలో నెల్లూరు జిల్లా గ్రామనామాలకు శాసనాధారాలు ఇవ్వబడినాయి. పరిపాలనా సంబంధమైన ఇబ్బందులవల్ల ఎపిగ్రఫి డిపార్టుమెంటు (మైసూరు) లో ఉన్న అముద్రిత శాసనాల్ని పరిశీలించే అవకాశం లభించక పోవడం వల్ల వర్ణనాత్మక పరిశీలనా పద్ధతే అనుసరించడమైంది. మెకంజీ కైఫియత్తులలోని నెల్లూరు జిల్లా

గ్రామనామాలకు సంబంధించిన స్థానిక చరిత్ర వివరాలను ఆమూలాగ్రం పరిశీలించి పదవ్యుత్పత్తి విచారణలో వినియోగించుకోవడమైంది. పదవ్యుత్పత్తి విచారణలో ప్రాచీనరూపాలు ఆధునికరూపాల వివరణకు తోడ్పడినాయి.

నెల్లూరు జిల్లా గ్రామనామాలకు సంబంధించిన నామాంతరాలు, భిన్నవర్ణ క్రమాలు (Spellings), పుట్టుపూర్వోత్తరాలు మొదలైనవాటిని సేకరించడానికి ఈక్రింది మూలాధారాలు ఉపయోగపడినాయి.

1. Alphabetical List of Villages in the Taluks and Districts of the Madras Presidency. (Madras, 1919, Reprints, 1926, 1936)
2. Firka-wise List of Villages in Nellore District General Administration, Election B Department, A.P. Hyderabad.
3. జమాబందీ ప్రోగ్రాం పట్టికలు (9)
4. నెల్లూరు జిల్లా వివిధ అసెంబ్లీ నియోజక వర్గాల ఏకీకృత ఓటర్ల జాబితాల అనుబంధాలు, ముఖపత్రాలు :

124 ఉదయగిరి అసెంబ్లీ నియోజకవర్గ ఏకీకృత ఓటర్ల జాబితా ముఖపత్రం, 1975.

125 కావలి అసెంబ్లీ నియోజకవర్గ ఏకీకృత ఓటర్ల జాబితా ముఖపత్రం, 1975.

126 అల్లూరు అసెంబ్లీ నియోజకవర్గ ఏకీకృత ఓటర్ల జాబితా ముఖపత్రం, 1975.

127 కోవూరు అసెంబ్లీ నియోజకవర్గ ఏకీకృత ఓటర్ల జాబితా ముఖపత్రం, 1975 (అల్లూరు, కోవూరు నియోజకవర్గాలు కోవూరు తాలూకాకు చెందినది)

128 ఆత్మకూరు అసెంబ్లీ నియోజకవర్గ ఏకీకృత ఓటర్ల జాబితా ముఖపత్రం, 1975.

129 రాపూరు అసెంబ్లీ నియోజకవర్గ ఏకీకృత ఓటర్ల జాబితా ముఖపత్రం, 1975.

130 నెల్లూరు అసెంబ్లీ నియోజకవర్గ ఏకీకృత ఓటర్ల జాబితా ముఖపత్రం, 1975.

131 సర్వేపల్లె అసెంబ్లీ నియోజకవర్గ ఏకీకృత ఓటర్ల జాబితా ముఖపత్రం, 1975. (నెల్లూరు, సర్వేపల్లె నియోజక వర్గాలు నెల్లూరు తాలూకాకు చెందినవి.)

132 గూడూరు అసెంబ్లీ నియోజకవర్గ ఏకీకృత ఓటర్ల జాబితా ముఖపత్రం, 1975.

133 సూళ్లూరుపేట అసెంబ్లీ నియోజకవర్గ ఏకీకృత ఓటర్లజాబితా ముఖపత్రం, 1975.

134 వెంకటగిరి అసెంబ్లీ నియోజకవర్గ ఏకీకృత ఓటర్ల జాబితా ముఖపత్రం, 1975

జిల్లాలో మొత్తం నియోజక వర్గాలు — 11

మా ్య పు లు :

(అ) తాలూకా సర్వేమ్యాపులు : 1'' = 1 మైలు

| | | | | |
|---|---|---|---|---|
| ఉదయగిరి | ఆగష్టు, 1954; | | కావలి | ఆగష్టు, 1954; |
| కోవూరు | ఆగష్టు, 1954; | | ఆత్మకూరు | ఆగష్టు 1954; |
| రాపూరు | ఆగష్టు, 1951; | | నెల్లూరు | ఆగష్టు 1954; |
| సూళూరుపేట | ఆగష్టు, 1962; | | వెంకటగిరి | ఆగష్టు 1957. |

(ఆ) జిల్లాకు సంబంధించిన టోపోషీట్లు :

| షీట్ల సంఖ్య | సర్వే సంవత్సరం | షీట్ల సంఖ్య | సర్వే సంవత్సరం |
|---|---|---|---|
| 57 M/4 | 1920 - 21 | 57 N/1 | 1917 - 18 |
| 57 N/2 | 1917 - 18 | 57 N/7 | 1916 - 18 |
| 57 N/8 | 1917 - 18 | 57 O/5 | 1915 - 16 |

(నెల్లూరు జిల్లాకు అన్ని టోపో షీట్లు లభ్యంకాలేదు)

శా స నా లు :

| | | |
|---|---|---|
| E. I. | IV | 1896 - 97 |
| E. I. | VIII | 1939 |
| E. I. | XXVIII | 1949 |
| E. I. | XXIX | 1951 - 52. |

Inscriptions of Andhradesa Vol. I & II (M. Rama Rao)
Indian Antiquary V 1976
SII IV, V, XII, XVI
JAHRS III, XI, XII

A Topographical List of the Inscriptions of the Madras presidency collected till 1915 with notes and references. (V. Ranga charya)

A Collection of the Inscriptions on copper plates and stones in the Nellore District. (Alan Butter worth & Venugopal Chetty, 1903)

మెకంజీ కైఫియతులు :

(అ) నెల్లూరు గ్రామనామ రూపాలు లభ్యమైన మెకంజీ కైఫియతులు :

| L.R. No. | మెకం | L.R. No. | మెకం |
|---|---|---|---|
| 9 | 317 | 42 | 350 |
| 12 | 320 | 46 | 351 |
| 16 | 324 | 48 | 356 |
| 17 | 325 | 50 | 358 |
| 36 | 344 | | |

(ఆ) నెల్లూరు గ్రామనామ స్థానిక చరిత్రలు లభ్యమైన మెకంజీ కైఫియత్తు :

L.R. No. 11 మెకం 349

ఇందులో నెల్లూరు జిల్లాలో చేరిన మహిమలూరి కైఫియత్తు
" " " రాపూరు కైఫియత్తు
" " " కోట కైఫియత్తు

(ఇ) వెంకటగిరి కైఫియత్తు :- 'వెలుగోటివారి వంశావళి' అను పేర 1891లో Foster Press లో ముద్రితమైనట్టి మెకంజీ సంచయంలోనిది.

District Manual and Gazetteers :

Mannual of the Nellore District in the Presidency of Madras. (John A:C. Boswell, 1873)
Gazetteer of the Nellore District, 1938.

Andhra Pradesh District Gazetteers 'Nellore District' 1977. District Census Hand Book, 1971.

Census of India Vol. II Part VII - B (7) A.P. (1961), -Fairs and Festivals of the Nellore District

Mannual of the Administraticn of the Madras Presidency Vol. III, Glossary (Madras, 1893)

సాహిత్య ఆధారాలు : జక్కన - విక్రమార్క చరిత్ర.

చలంభ్యాల వెంకట సుబ్రమణ్యశర్మ - మనపెన్నానది, (వి.మం.స.) ఎన్. వెంకటరమణయ్య - వెలుగోటివారి వంశావళి.

0.9. సేకరణ సమస్యలు : నెల్లూరు జిల్లా గ్రామనామాల్ని అన్ని మూలాధారాల నుండి సేకరించడానికీ, అకారాది క్రమాలలో సమగ్ర గ్రామనామ పట్టిక తయారు చేయడానికి మూడు సంవత్సరాలు పట్టింది. మొత్తం 2727 గ్రామ నామాలకు వ్యుత్పత్తి నిఘంటువు తయారు చేయడానికి ఒక సంవత్సరం పట్టింది.

పైన పేర్కొన్న మూలాధారాలనుండీ, క్షేత్ర పర్యటన నుండీ గ్రామ నామాలను సేకరించడంతోనూ, అకారాది క్రమంలో గ్రామనామ పట్టికను తయారు చెయ్యడంలోనూ అనేక సమస్యల్ని ఎదుర్కోవలసి వచ్చింది.

ఈ జిల్లాలకు సంబంధించి గ్రామనామాలు సమగ్రంగా ఉన్న పట్టిక ఒక్కటిగూడా లేదు. కొన్ని ఇంగ్లీషులో, కొన్ని తెలుగులో, మరికొన్ని తెలుగు ఇంగ్లీషుల్లో లభించినాయి. శిథిలావస్థలో ఉన్న పుస్తకాలలో చేతిరాతతో ఉన్న పేర్లను తెలుగులో రాసుకోవడంలో ఇబ్బందులు పడవలసి వచ్చింది. ఇటువంటి పరిస్థితిలో కొన్ని అర్థంగాక వదిలి వేయడం జరిగింది. తెలుగు, ఇంగ్లీషు పట్టికలలోని నామాలకు వర్ణక్రమం (Spelling) లో భేదం కన్పిస్తుంది. ఉదా: డక్కిలి, దక్కిలి ఒక 'Dakkili' అని ఇంగ్లీషులో ఉన్న ఒక్క రూపానికి రెండు రూపాంతరాలు కన్పిస్తాయి. ఇంగ్లీషులో హ్రస్వ దీర్ఘాది ఉచ్చారణ భేదాల్ని తెలిపే లేఖన చిహ్నాలు లేకపోవడం కూడా తెలుగులో రాసుకొనేటపుడు ఒకదానికి బదులు ఇంకొకటి రాసుకొనే ప్రమాదముంది. తాలూకా ఆఫీసుల్లో ఎన్నికల గుమాస్తా దగ్గర లభించే అసెంబ్లీ నియోజక వర్గాల ఏకీకృత ఓటర్ల జాబితాల అనుబంధాలు ముఖపత్రాలలో రెవెన్యూ గ్రామాలు,

మజరా గ్రామాలు అన్నీ తెలుగులో లభిస్తాయి. ఇవి ఎన్నికల నిమిత్తం ఆయా అధికారులు తొందరకొద్దీ, అవసరం కొద్దీ తయారు చేసినవి కావడంవల్ల లేఖన ప్రమాదాలు కొల్లలుగా కన్పిస్తాయి. ముద్రణా సమయంలో ప్రూఫులను దిద్దకుండా గాలికి వదిలినట్లు కన్పిస్తుంది. ఈ పట్టికలలో కనిపించే ఒక సుగుణం వ్యవహారానికి చాలా దగ్గరగా ఉన్న రూపాలు కనిపించడం. ఇక ఈ జిల్లాలోని తాలూకా ఆఫీసుల్లో 'A' రిజిష్టర్లు, గణాంక శాఖలో గ్రామనామ పట్టికలను ఒక పద్ధతిలో రూపొందించినట్లు కన్పించదు. అసలు కొన్ని తాలూకా కార్యాలయాల్లో పట్టికలే మృగ్యం. గ్రామనామ పట్టికలకు సంబంధించి అడిగితే వారు ఇచ్చేవి ముఖపత్రాలు లేదా Nellore District Census Hand Book, 1971. కాబట్టి రెవెన్యూ మజరా గ్రామాల్ని నిర్ణయించడంలో ఏకీకృత ఓటర్ల జాబితా ముఖపత్రాలు, జమాబందీ ప్రోగ్రాం పట్టికలు ప్రమాణంగా తీసుకోవడం జరిగింది. వీటిని ప్రమాణంగా తీసుకొని రెవెన్యూ మజరా గ్రామాలు గుర్తించడం ప్రయాసతో కూడిన పని. ఎందుకంటే ముఖపత్రాల్లోని మజరా గ్రామాల కింద ఉండే కొన్ని గ్రామాలు రెవెన్యూ గ్రామాలుగా ఉన్నాయి. అపుడు ప్రధాన మజరా గ్రామ సంకేతంలో ఇబ్బంది. అందుకే అనుబంధం I లో అన్ని రికార్డులలోనూ కనపడని కొన్ని గ్రామనామాలు (28) ఇవ్వడం జరిగింది. నెల్లూరు జిల్లాకు సంబంధించి తాలూకా A రిజిష్టర్లు, సమితి పట్టికలు సమగ్రంగా లభించినప్పుడు ఈ ఇబ్బంది తొలగుతుంది. తాలూకా ఆఫీసుల్లో గ్రామనామ పట్టికలకు సంబంధించిన వివరాలు చెప్పడంకంటె 'తెలీదు' అని చెప్పడం ఎక్కువ. మన నూతన పరిపాలనావసరాల కనుగుణంగా ఈ పట్టికలను సమగ్రంగా, శాస్త్రీయంగా, శ్రద్ధగా ఇప్పటికీ రూపొందించక పోవడం వల్లనే ఈ రకం జవాబులను ఎవరైనా ఎదుర్కోవలసి వస్తున్నది.

సమగ్ర గ్రామనామ పట్టికను తయారు చెయ్యడంలో ఎదురయ్యే సమస్యలు :

1906 వ సంవత్సర ప్రాంతంనుండి ఈ జిల్లాలోని కొన్ని కొన్ని తాలూకాలు విడదీసి వేరే జిల్లాలకు కలుపుతూ వచ్చారు. 1970 వ సంవత్సరం ప్రకాశం జిల్లా ఏర్పాటుకు ఈ జిల్లానుండి కనిగిరి, పొదిలి, దర్శి, కందుకూరు తాలూకాలను విడదీసినారు. అప్పుడు ఈ జిల్లాకు సంబంధించిన మిగతా తాలూకాలనుండి ఏమైనా గ్రామాలను విడదీశారా అన్న ప్రశ్నకు ఆధారాలు లభ్యంకాలేదు ప్రకాశం జిల్లా ఏర్పాటు చేసిన తర్వాత ఈ జిల్లాలోని తాలూకాలు తొమ్మిది మాత్రమే.

ఒక గ్రామానికి ఒక పట్టికలో ఒకపేరు, మరో పట్టికలో మరో పేరు కన్పించడం వల్ల ఈ రెండు పేర్లు రెండు ప్రత్యేక గ్రామాలకు పేర్లుగా గుర్తించే ప్రమాదముంది. ఉదా : పూర్ణపూర్ణ(రామసాగరం)మనకున్న ఆధారాలన్నీ బాగా పరిశీలించిన మీదట ఇవి ఒకదాని కొకటి మారుపేర్లు (ఉరఫ్) అని తెలియును. ఈ సమస్యల నివారణకు క్షేత్రపరిజ్ఞానం, జిల్లా భౌగోళిక స్వరూప స్వభావాల అధ్యయనం అవసరం. గ్రామనామాలను ప్రమాణీకరించడంలో అనేక సమస్యలు ఎదురైనాయి. గ్రాంధిక రూప వ్యవహారరూపాల్లో ఏది ప్రమాణంగా గ్రహించాలి అన్నప్రశ్న కలుగుతుంది. ప్రమాణ గ్రామనామ నిర్ణయంలో గ్రాంధిక చారిత్రక రూపానికి దగ్గరగా ఉన్న వ్యవహార రూపాన్ని ప్రధాన ఆరోపంగా తీసుకోవడమైంది. ఒక గ్రామనామానికి భిన్న వర్ణక్రమా లున్నపుడు ఎక్కువ ఆధారాలు ఏ క్రమంలో లభిస్తాయో దాన్నే ప్రధానరూపంగా, మిగతావి రూపాంతరాలుగా తీసుకోవడమైంది. ద్వితీయావయవాల్లో పర్యాయరూపాలను ప్రధానరూపంలాంటి రూపాల్ని మరికొన్నింటిని పరిశీలించి నిర్ణయించడమైంది.

## 0.10 నిఘంటునిర్మాణ సమస్యలు :

అకారాది నిఘంటు నిర్మాణానికి సంబంధించి రెండుమాటలు చెప్పాలి. ఇ, ఈ, ఎ, ఏ లతో మొదలైన రూపాలకు 'య' కారం, ఉ,ఊ ఒ,ఓ లతో మొదలైన రూపాలకు 'వ' కారం ఉచ్చారణలో ముందు కలియడం వల్ల అవే విధమైన లేఖనరూపాలు చాలావరకు తెలుగు రికార్డులలో కన్పిస్తున్నాయి. అయితే నిఘంటు నిర్మాణ సౌలభ్యంకోసం అజాది రూపాలను గ్రహించడం జరిగింది. ఉదా : యాతలూరు - ఏతలూరు వుద్దిమిట్ట - ఉద్దిమిట్ట వోగూరు - ఓగూరు. గ్రామనామ ప్రథమావయవాల్ని సామాన్యార్థం దృష్టిలో ఉంచుకొని సూచించాలా లేదా సాంస్కృతికార్థం దృష్టిలో ఉంచుకొని సూచించాలా అన్న సందేహం కలుగుతుంది. నెమళ్ళ.పూడి, నెమళ్ళ.దిన్నె; మర్రి. పల్లె. మర్రి. గుంట మొ॥ ఇటువంటి చోట్ల (నెమలి-లు-అ) అనే ప్రథమావయవం జంతు సూచకంగా, మర్రి - అనే ప్రథమావయవం వృక్షసూచకంగా యివ్వడమైంది. పురం, పల్లెపూడి,కంద్రిగ అనే గ్రామనామ ద్వితీయావయవాలు జనపదసూచకాలు, గుట్ట, మిట్ట, దిన్నె, బయలు, గడ్డ అనేవి నైసర్గికసూచకాలు. కాని ఈ నైసర్గిక, సూచకాలు జనపద సూచకాలు కూడాను, పల్లె అనేది మైదానాల్లోను, తీరప్రాంతా

గ్లోను ఉండే జనావాసమైతే, మిట్ట అనేది ఎత్తైన భూప్రదేశాన్ని సూచించే జనావాసం. ఈ సందర్భంలో క్షేత్రపర్యటనానుభవాన్ని వినియోగించుకోవడమైంది

ఒక గ్రామనామ రూపానికి ఆ నామంలోని పదాల విభజనను బట్టి వ్యుత్పత్తులు మారుతుంటాయి. ఈ పదవిభజన రెండు మూడు రకాలుగా ఉంటే రెండు మూడు రకాల అర్థాలురావచ్చు. నిర్మాణ వివరణను బట్టి గూడా వ్యుత్పత్తులు మారవచ్చు. ఉదా : ఎరుకల. రెడ్డిపాలెం, ఎరుక్ లరెడ్డి.పాలెం, పెద్ద, నాగంపల్లె, పెద్దనాగం, పల్లె మొ॥ భిన్నార్థాల్లో భిన్న భాషల్లో ఒకేపదం గ్రామనామాల్లో కనిపిస్తే ఆ రూపాన్ని ఏ భాషారూపంగా గుర్తించి వ్యుత్పత్తి ఇవ్వాలి అన్న సందేహం కలగవచ్చు. చారిత్రక శాసన రూపాలను ఆ గ్రామం యొక్క స్థానిక, నైసర్గిక స్థితి గతులను గమనించినపుడు ఈ సమస్యలను కొంత వరకు పరిష్కరించవచ్చు. ఇటువంటి చోట 'ఈ అర్థం సరైనది' అనుకున్నదాన్ని ముందు ఇచ్చి మిగిలిన అర్థాల్ని ? (సందేహార్థకం) గుర్తుపెట్టి ఇవ్వడమైంది. ప్రథమావయవ పదవ్యుత్పత్తికి పరిసర గ్రామాల స్వరూప స్వభావాలు, తెలుగు గ్రామనామ నిర్మాణమే గాకుండా ఎక్కువగా తమిళ గ్రామనామ నిర్మాణాలను గూడా దృష్టిలో ఉంచుకోవడం జరిగింది. ప్రథమావయవానికి సంబంధించిన అర్థ వర్గీకరణ, పద విభజన నిర్దిష్టమైనవి అవునో కావో అన్న సందేహం కలిగినపుడు ? గుర్తు ముందు వాడటం జరిగింది.

0.11 నిఘంటు నిర్మాణ విధానం :

నెల్లూరు జిల్లాలో ఉండే 2727 గ్రామనామాలకు అకారాది నిఘంటువు తయారుచేయడమైంది. ఈ గ్రామనామాల్లో కన్పించే 115 గ్రామనామ ద్వితీయావయవాలకు ప్రత్యేక నిఘంటువు తయారు చేయబడింది.

ప్రథమావయవ నిఘంటువు : ప్రామాణ గ్రామనామ రూపాలు ప్రధాన ఆరోపాలుగా ఇతరమైన వ్యవహార రూపాలను రూపాంతరాలుగా ఇవ్వడం జరిగింది. నామ రూపంలో ప్రథమా ద్వితీయావయవాల్ని వేరు చేయడానికి (.) గుర్తు వాడబడింది. ద్వితీయావయవం నామ బంధమైనపుడు ఇందులో ప్రథమావయవానికి వ్యుత్పత్తి చెప్పడం జరిగింది. ప్రథమా ద్వితీయావయవాలు నామబంధాలుగా ఉన్న గ్రామాలు నెల్లూరు జిల్లాలో తక్కువ.

జన వ్యవహారంలో సంబంధ, గౌరవ, సర్వనామ సూచకాలైన వాండ్ల ట వాళ్ల (వాడు-లు-అ లేదా వారు-లు-అ, వారి (వారు-ఇ) మొదలైన వాటికి, ఏకవచనరూపాలైన వాని (వాడు-ఇ), గాని (గాడు-ఇ) మొదలైన వాటికి బంధువాచకాలైన అక్క, అమ్మ, అన్న, అప్ప, అబ్బ, అయ్య, తాత మొదలైన వాటికి, దిగ్వాచకాలైన తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం, ఎగువ, దిగువ, నడిమి మొదలైన వాటికీ మరియు కొత్త, పాత మొదలైన పౌర్వాపర్య సూచకాలకు, పరిమాణసూచకాలైన చిన్న, పెద్ద రూపాలకు, నైసర్గిక సూచకాలైన కొండ, మిట్ట, పల్లం, కాలవ మొదలైన వాటికి, కులనామాను బంధాలైన రెడ్డి, నాయుడు, రావు, రాజు, శెట్టి మొదలైన వాటికి, కులనామాలైన కమ్మ, కాపు, గొల్ల, చాకలి, బలిజ, బ్రాహ్మణ మొదలైన వాటికి నిఘంటువులో వ్యుత్పత్తులు వివరించలేదు. ఉరఫ్ నామాలకు వ్యుత్పత్తులు చెప్పలేదు. వీటిని ఆరవ అధ్యాయంలో పునర్నామాల చర్చ కింద ఇవ్వడమైంది. వ్యవహారంలో లేని రూపాలకు, ప్రాచీన రూపాలకు వ్యుత్పత్తి తెలియని రూపాలకు, అర్థవిపరిణామం చెందిన రూపాలకు, అన్యభాషారూపాలకు మాత్రమే వ్యుత్పత్తులు ఇవ్వడమైంది.

గ్రామనామ ద్వితీయావయవ నిఘంటు నిర్మాణంలో కూడా ఈ పద్ధతే పాటింపబడింది. ద్వితీయావయవం యొక్క ఆవృత్తి ప్రధాన ఆరోపం పక్కనే ఇవ్వబడింది. రూపాంతరాలు వీటిలో గల గ్రామాల సంఖ్య ఉదాహరణలతో ఇవ్వడం జరిగింది.

స్థూలంగా 'కడప ఊర్ల పేర్లు' ప్రణాళికా పద్ధతినే నెల్లూరు జిల్లా గ్రామ నామ పరిశీలనలో ఉపయోగించుకోవడం జరిగింది.

0.12 సిద్ధాంత వ్యాస సార సంగ్రహం :

ఈ పరిశోధక సిద్ధాంత వ్యాసంలో ముఖ్యమైన విభాగాలు మూడు

మొదటి విభాగం : గ్రామనామాల భాషా పరిశీలన

రెండో విభాగం : గ్రామనామాలు - సామాజిక పరిశీలన

మూడవ విభాగం : గ్రామనామ వ్యుత్పత్తి నిఘంటువు గ్రామనామాలు - భాషా పరిశీలన :

భాషానిర్మాణ స్వరూపాన్ని తెలుసుకోవడానికి, ఆ భాషలోని సంజ్ఞానామాలకు సంబంధించిన వర్ణ సమామ్నాయ పరిశీలన ఉపయోగపడుతుంది. కాని నెల్లూరు జిల్లా గ్రామనామాల్లో వర్ణ సమామ్నాయ పరిశీలనకు సంబంధించిన విశేషాలు లేనందున ఆ పరిశీలనను వదిలివేయడమైంది. భాషా పరిశీలనకు సంబంధించిన ఈ విభాగంలో మూడు అధ్యాయాలున్నాయి,

అవి వరుసగా : 1. సంధిపరిశీలన 2. నిర్మాణపరిశీలన 3, అర్థపరిశీలన

1, సంధిపరిశీలన : ఇందులో నెల్లూరు గ్రామనామాలకు సంబంధించిన వివిధ సంధికార్యాలు వివరింపబడినాయి .ఈ సంధికార్యాలలో టుగాగమ, కుగాగ ములవల్ల కొంత విలక్షణత కన్పిస్తుంది. దీనికి గ్రామనామాల చారిత్రక స్థితి కారణం. సంధిలో ద్విత్వత, లోప దీర్ఘత, నాదత కూడా కన్పిస్తాయి.

2. నిర్మాణపరిశీలన : నిర్మాణ దృష్ట్యా నెల్లూరు గ్రామనామాలను వర్గీకరించి వాటిలోని వైవిధ్యాలను శాఖా చిత్రాల్లో ప్రదర్శించడమైంది. నెల్లూరు గ్రామనామ నామ బంధాల్లో కారకశ్లేష తక్కువ అని చెప్పవచ్చు.

3. అర్థపరిశీలన : గ్రామనామాలను అర్థదృష్ట్యా వర్గీకరించడం జరిగింది. ఆవృత్తిని పరిశీలించినపుడు వ్యక్తి, కుటుంబ, కులనామాలు సగానికి పైగా ఉన్నట్లు తేలింది. వర్ణనాత్మక నామాల కంటె సంబంధార్థకనామాలు ఎక్కువ. ఈ అధ్యాయంలో ప్రధానమైన మరొక అంశం గ్రామనామలోక నిరుక్తులు.
రెండవవిభాగం : గ్రామనామాలు - సామాజిక పరిశీలన :

ఈ విభాగంలో మూడు అధ్యాయాలున్నాయి. వరుసగా అవి నైసర్గిక, సాంస్కృతిక, చారిత్రక విశేషాలు.

4. నైసర్గిక విశేషాలు : నైసర్గిక విశేషాల పరిశీలన ద్వారా ఈ జిల్లా నైసర్గిక స్వరూపం తెలుస్తుంది. సమతల మైదానం ఎక్కువ. గుట్టలు, మిట్టలు తక్కువని తెలుస్తుంది. జలాధారాలు తక్కువని తెలుస్తుంది. అటవీ ప్రాంతం గూడా తక్కువని తెలుస్తుంది. గనుల ప్రాధాన్యమున్నట్లు గనులపేర్లతో ఏర్పడిన గ్రామనామాల ద్వారా తెలుస్తుంది. నైసర్గిక సూచకాలకు సంబంధించిన పట్టికలు ఇవ్వటం జరిగింది.

5. సాంస్కృతిక విశేషాలు : ఈ పరిశీలనవల్ల ప్రధాన కులాలైన రెడ్డి, కమ్మ, బ్రాహ్మణ, బలిజల కంటె గొల్ల, గమండ్ల, పట్టపు, పల్లి వారు ఎక్కువని తెలుస్తుంది. సముద్రతీరపు జిల్లా కాబట్టి మత్స్యకారులైన పల్లి, పట్టపువారు ఎక్కువని తెలుస్తుంది. ఇస్లాం, క్రైస్తవ మత ప్రభావం తక్కువని తెలుస్తుంది బౌద్ధ, జైన మత స్థావరాలుగల గ్రామాలు తక్కువ. వ్యక్తినామ సూచకాల్లో పురుషాధిక్యం ఎక్కువని తెలుస్తుంది, హిందూమత ప్రభావం గ్రామనామాల్లో కనిపిస్తుంది. కుల, గణ సూచక గ్రామనామాల పట్టికలు ఇవ్వడమైంది.

6. చారిత్రక విశేషాలు : ఈ పరిశీలన వల్ల వెంకటగిరి జమీందార్ల పేర్లతో ఏర్పడిన గ్రామనామాలు కొన్ని కన్పిస్తాయి. ప్రధాన రేవు పట్టణాల పేర్లతో నిలిచిన గ్రామనామాలు కొన్ని కన్పిస్తాయి. ఉంఛ్ పేర్లు ఈ అధ్యాయంలో ఇవ్వడం జరిగింది.

మూడవ విభాగం గ్రామనామ వ్యుత్పత్తి నిఘంటువు :

(అ) గ్రామనామ ప్రథమావయవ నిఘంటువు

(ఆ) గ్రామనామ ద్వితీయావయవ నిఘంటువు - ఆవృత్తి పట్టిక ఇవ్వడమైంది.

ఈ సిద్ధాంత వ్యాసంలో అస్పష్టాలైన గ్రామనామాలు 42. వీటిలో అవయవ విభజన సాధ్యం కానివి కొన్ని, ప్రథమా లేదా ద్వితీయావయవాల అర్థ నిర్ణయం క్లిష్టమైనవి కొన్ని. భాషా సామాజిక దృష్టితో తెలుగు స్థలనామ పరిశోధన సమగ్రంగా జరిగినపుడు బహుశా వ్యుత్పత్తిక్లేశం చాలా తగ్గవచ్చు.

సిద్ధాంత వ్యాసానికి చివర మూడు అనుబంధాలున్నాయి.

1. అన్ని రికార్డులలో లభ్యంకాని 28 గ్రామనామాలు
2. నెల్లూరు వ్యుత్పత్తికి సంబంధించిన ఒక జానపద గేయం
3. నిఘంటువులో వాడిన కోడ్ సంఖ్యలున్న నెల్లూరు జిల్లా తాలూకాల పట్యాపులు.

# 1

# గ్రామనామాలు - భాషాపరిశీలన

## 1 సంధి పరిశీలన
## (Morpho phonemics)

నెల్లూరు జిల్లా గ్రామనామాల్లో కన్పించే కొన్ని సంధికార్యాలు ఇతర సామాన్య పదాల్లో జరిగే సంధి కార్యాలతో పోల్చి చూచినపుడు కొన్ని సందర్భాల్లో కొంత విలక్షణంగా కన్పిస్తాయి. ఈ విలక్షణానికి కారణం ప్రధానంగా పూర్వ గ్రామనామరూపాలు నేటికీ వ్యవహారంలో ఉండటం. టుగాగమ, కుగాగమ, పుగాగమ రూపాలను ఇందుకు ఉదాహరణంగా తీసుకోవచ్చు. వీటిని వివరించటానికి, సూత్రీకరించటానికి ఆధారాలు మృగ్యం. గ్రామనామాల్లో జరిగే సంధి కార్యాలు చాలావరకు వైకల్పికం.

ఈ అధ్యాయంలో గ్రామనామాల్లోని సంధి స్వరూప నిరూపణకు ఉచ్చరిత రూపాలు కాకుండా ప్రామాణికాలైన ప్రధాన ఆరోపాలే గ్రహించడం జరిగింది. అస్పష్టనామబంధాల్లోని సంధిస్వరూపాన్ని వివరించలేదు. కారణం వాటి చారిత్రక రూపాలు చాలవరకు తెలియకపోవడం. తెలిసినా పదాంశ విభజన సందేహాస్పదం.

ఉదా॥ చాగణం, గువ్వాడి, తూమాయ, కొమరిక, దొంతాలి, మైలాంగం, జయంపు, కుందాం మొదలగు వాటిలో జరిగిన సంధి స్వరూపాన్ని వివరించడం కష్టం.

1.1 అచ్చుసంధి : కావ్య భాషలో లాగానే గ్రామనామాల్లో కూడ పరరూప సంధే కన్పిస్తుంది.

అ + అ > అ ఉదా: అక్కం (అక్క + అం) : అక్కంపేట
అయ్యన (అయ్య + అన) : అయ్యనపల్లె
ఎల్లయ (ఎల్ల + అయ) : ఎల్లయపాలెం
ఎర్రప (ఎర్ర + అప) : ఎర్రపగుంట

అ + అ > ఆ ఉదా: అక్కమాంబ (అక్కమ + అంబ) : అక్కమాంబాపురం
తిమ్మమాంబ (తిమ్మమ + అంబ) : తిమ్మమాంబాపురం
నాగమాంబ (నాగమ + అంబ) : నాగమాంబాపురం
వెంగమాంబ (వెంగమ + అంబ) : వెంగమాంబాపురం

అ + ఆ > ఆ ఉదా: మిట్ట + ఆత్మకూరు : మిట్టాత్మకూరు

అకారాంత పదాంశాలకు అమ్మ ~ అం; అన్న ~ అన; అయ్య ~ అయ; అప్ప ~ అప రూపాలు పరమైనపుడు పరరూప సంధి నిత్యం. అంబా పరమైనపుడు మాత్రం పరాచ్చుకు దీర్ఘం ఆదేశమవుతుంది.

అ + ఇ > ఇ ఉదా: పంబిలి (పంబ + ఇలి)
అ + ఊ > ఊ ఉదా: కొండూరు (కొండ + ఊరు)
తుమ్మూరు (తుమ్మ + ఊరు)
కానూరు (కాన + ఊరు)

అ + ఏ > ఏ ఉదా: కొమ్మనేటూరు (కొమ్మన + ఏటూరు)

ఇ + అ > ఎ ఉదా: ఆదెప్ప (ఆది + అప్ప) ఆదెప్పపాలెం [ఈ రూపాంలో సంధిగతంగా వచ్చిన ఎ ఉచ్చారణ కొంత వివృతం]

ఇ + ఆ > ఆ ఉదా: మద్దాలి (మద్ది + ఆలి)
ఇ + ఇ > ఇ ఉదా: పల్లిండ్లు (పల్లి + ఇండ్లు)
డక్కిలి (డక్కి + ఇలి)

ఇ + ఊ > ఊ ఉదా: ఏపూరు (ఏపి + ఊరు)
అల్లూరు (అల్లి + ఊరు)
కోవూరు (కోవి + ఊరు)

ఇ + ఏ > ఏ ఉదా : పాడేరు (పాడి + ఏరు)
పైడేరు (పైడి + ఏరు)
పూడేరు (పూడి + ఏరు)
వావిలేరు (వావిలి + ఏరు)

ఉ + ఊ > ఊ ఉదా : ఆరూరు (ఆరు + ఊరు)
ఏరూరు (ఏరు + ఊరు)

1.2 ఆగమాదేశాలు :

టుగాగమం : ఉదా: ఉప్పుటూరు, క్రాకుటూరు, నేలటూరు, నెల్లటూరు, ఉప్పుటేరు మొదలగునవి.

కుగాగమం : కొన్ని గ్రామనామాల్లో క్వాచిత్కంగా కుగాగమం వస్తుంది.

ఉదా: ఊటుకూరు, ఆత్మకూరు, ముత్తుకూరు, ఇందుకూరు మొదలగునవి.

'పు' ఆదేశం : ఈ క్రింది గ్రామనామాల్లో మువర్ణానికి 'పు' ఆదేశంగా కన్పిస్తుంది. ఉదా: అగ్రహారపుపల్లె (అగ్రహారము. పల్లె)
కనుపూరు (కనుము. ఊరు)

1.3 హల్సంధి : నెల్లూరు జిల్లా గ్రామనామాల్లో అన్యదేశ్యాలైన హలంత పదాంశాలు కొన్ని ఉన్నాయి. వాటికి అజాది పదాంశం పరమైనపుడు అవ్యవహితోచ్చారణ ఉంటుంది.

ఉదా: అక్బరాబాదు (అక్బర్ – ఆబాదు) మదరాబాదు (మదర్ – ఆబాదు)

అజంతాలైన తెలుగు పదాంశాలకు హలాది రూపాలు పరమైనపుడు పూర్వ పదాంశంలోని చివరి అచ్చులోపించి పూర్వరూపం హలంత మవుతుంది. కాబట్టి పూర్వరూపంలోని చివరి హల్లుకు పరరూపంలోని మొదటి హల్లుకు సంహిత ఏర్పడి హల్సంధి జరుగుతుంది.

డ + ల > డ్ల ఉదా: వెలిగండ్ల (గండి + లు)
తూర్పుపూండ్ల (పూండి + లు)
బండ్లపల్లె (బండి + లు)
గండ్లవేడు (గండి + లు)

డ + ల > ళ్ల ఉదా: తాళ్లపల్లె (తాడి + లు)
కోళ్లదిన్నె (కోడి + లు)
మామిళ్లవొర్వ (మామిడి + లు)
మారేళ్లపాడు (మారేడు + లు)

ప + ప > ప్ప ఉదా: తిక్కవరప్పాడు (తిక్కవరపు + పాడు)
చెన్నవరప్పాడు (చెన్నవరపు + పాడు)

ర + ల > ర్ల ఉదా: ఏగర్లపాలెం (ఏగరి + లు)
ఇస్కదామెర్ల (దామెర + లు)

ర + ల > ళ్ల ఉదా: గోళ్లవారిపాలెం (గోరు + లు)

ల + ల > ళ్ల ఉదా: నెమళ్లపూడి (నెమలి + లు)
నెమళ్లదిన్నె (నెమలి + లు)
తేళ్లకుర్రకండ్రిగ (తేలు + లు)

ట్ట + ల > ట్ల ఉదా: భట్లదిన్నె (భట్టు + దిన్నె)
తాటిచెట్లపాలెం (తాటిచెట్టు + లు)

డ్డ + ల > డ్ల ఉదా: దొడ్లకట్టువ (దొడ్డి + లు)
రెడ్లదిన్నె (రెడ్డి + లు)

ర్ర + ల > ర్ల ఉదా: మర్లపల్లె (మర్రి + లు)

ండ + ర > ండ్ర ఉదా: కొండ్రాజుపల్లె (కొండ + రాజు)
కొండ్రాయగారిపాలెం (కొండ + రాయ)

ండ + ల > ండ్ల ఉదా: వాండ్ల (వాండు + లు) ఒరుగువాండ్లపల్లె, పిడూరు
వాండ్లమైన్, గోరువాండ్లపల్లె
గుండ్ల సముద్రం (గుండు + లు)

1.4 లోపదీర్ఘత (Compensatory lengthening) : ఈ లోపదీర్ఘత — అయ్య అనె పదాంశానికే పరిమితం. అయ్య పరమైనపుడు తత్పూర్వాక్షరంలో హ్రస్వాచ్చు ఉంటే ద్విత్వలోపం. పూర్వాచ్చుకు దీర్ఘతా వైకల్పికం.

ఉదా: నీలాయపాలెం (నీల + అయ్య + పాలెం)
తిమ్మాయగుంట (తిమ్మ + అయ్య + గుంట)
కొండాయగుంట (కొండ + అయ్య + గుంట)
కొండాయపాలెం (కొండ + అయ్య + పాలెం)

ఈ రూపాల్లో చాలావాటికి తిమ్మయ్యగుంట, కొండయ్యగుంట, కొండయ్య పాలెం అనే రూపాంతరాలు వ్యవహారంలో వున్నాయి.

పరాక్షరంలో దీర్ఘాచ్చు ఉన్నపుడు అద్విరుక్తత వైకల్పికం. ఈ క్రింది రూపంలో పదగతమైన ద్విత్వ ఉకారలోపం తత్పూర్వాచ్చుకు దీర్ఘతా కల్గుతుంది. ఉదా: పూలతోట (పువ్వుల+తోట)

1.5 ద్విత్వలోపం (Loss of geminination) : - అక్క; - అన్న; - అప్ప; - అమ్మ పదాంశాలు గల గ్రామనామాల్లో ద్విత్వలోపం వైకల్పికం. - అమ్మ ఉన్న రూపాల్లో ద్విత్వలోపం, అజ్లోపం జరుగుతాయి.

ఉదా: - అక్క : లక్ష్మక కంద్రిగ (లక్ష్మి+అక) లక్ష్మక్క కంద్రిగ
- అన్న : అయ్యనపల్లె తిమ్మనగుంట
చినన్నపేట (చిన+అన్న)
- అప్ప : సూరప అగ్రహారం (సూర+అప్ప)
చెన్నప్పగారి పాలెం
- అమ్మ : అక్కంపేట (అక్క+అం) అన్నంపల్లె అన్నంబాక

1.6 పదమధ్యాజ్లోపం : కాల్వ < కాలవ. ఉయ్యాలకాల్వ
దొర్వు < దొరువు. వావిళ్లదొర్వు మామిళ్లదొర్వు

1.7 అక్షర లోపం (Loss of Syllable) : ఈ క్రింది గ్రామ నామాల్లో పరరూపంలోని ప్రథమాక్షరానికి లోపం కన్పిస్తుంది.

చేమర్తి (చేమ+పర్తి) బోగోలు (బోగ+వోలు)

1.8 ద్విత్వసిద్ధి : కొన్ని అన్యదేశ్యాల పదాదిలో హ్రస్వాక్షరం ఉండి పరాక్షరాల్లో దీర్ఘమున్నపుడు రెండవ అక్షరంలోని హల్లుకు ద్విత్వం వస్తుంది.

ఉదా: ఉమ్మాయపల్లె < సం. ఉమా
హుస్సేన్ నగరం < హిం. హుస్సేన్

1.9 నాదత (Voicing) : పదమధ్యంలో పదాంశావధిపరంగా ఉన్న శ్వాస హల్లులకు నాదత వైకల్పికం.

ఉదా: నల్లగొండ (నల్ల+కొండ) వరిగొండ (వరి+కొండ)
చాకలకొండ (చాకల+కొండ) పల్లకొండ (పల్ల+కొండ)
పెనుబల్లె (పెను+పల్లె) నిడుగుర్తి (నిడు+కుర్తి)
ఆనేగొట్టం (ఆనే+కొట్టం)

1.10 వర్ణవ్యత్యయం (Metathesis) :

ఉదా: మేనకూరు (మేకనూరు) పదమటిపాలెం (పడమటిపాలెం)

1.11 వర్ణ సమీకరణం (Assimilation) :

(అ) అజ్వర్ణ సమీకరణం :

ఉదా: ఎనుములపాలెం (ఎనపుల)
నరసుగుంట (నరస) సూరపు అగ్రహారం (సూరప)

(ఆ) హల్వర్ణ సమీకరణం :

ఉదా: త+ప > ప్ప : కొప్పోలువారిపాలెం (కొత్త+ప్రోలు
ర+గ > గ్గ : దుగ్గుంట (దుర్గ+గుంట)
ల+న > ల్ల : రావులకొల్లు (రావుల+కొలను)
వీరనకొల్లు (వీరన+కొలను)

## 2 నిర్మాణ పరిశీలన (Syntax)

2.0 నెల్లూరుజిల్లా అకారాది గ్రామనామ నిఘంటువులో ఇచ్చిన 2727 గ్రామనామాలను నిర్మాణ దృష్ట్యా కొన్ని ముఖ్య రకాలుగా విభజించవచ్చు. ఈ అధ్యాయంలో గ్రామనామాల్లోని వివిధావయవాల (constituents) విశ్లేషణ, వాటి పరస్పర సంబంధాన్ని చర్చిస్తూ గ్రామనామ నిర్మాణాన్ని కొన్ని శాఖా చిత్రాల (Tree diagrams) ద్వారా ప్రదర్శించడమైంది.

2.1 నిర్మాణ దృష్ట్యా నెల్లూరు గ్రామనామాలు ప్రధానంగా రెండు రకాలు. అవి 1. అసమస్తాలు (Simplexes)
2. సమస్తాలు లేక నామబంధాలు (Noun phrases)

2.2 అసమస్తాలు : అసమస్తాలైన గ్రామనామాలు ఏకైక స్వతంత్ర పదాంశ రూపాలు (Free forms)

ఉదా: (అ) కుప్పం, పాలెం, పూడి, కట్టుబడి ఇవి కొన్ని సమస్తాలైన గ్రామనామాల్లో ద్వితీయావయవాలు (Second elements) గా కన్పిస్తాయి.

కొత్త. కుప్పం, గమండ్ల. పాలెం. ఇప్ప. పూడి, అభ్వానపు నారాయణ. కట్టుబడి

| (ఆ) | ఇరకం | గూండ్లు | పేట |
|---|---|---|---|
| | ఓజిలి | చుట్టి | బూదనం |
| | కండ్రిగ (5ఆరో) | చెముడ్తి | బ్రహ్మేశ్వరం |
| | కందలి | జయంపు | మెట్టు |
| | కాండ్ర | టెక్కె | మొరం |
| | కావలి (2ఆరో) | తడ | మోమిడి |
| | కుందాం | తోపు | రేబాల |
| | కుదిరి | దుండిగం | వాక్యం |
| | కొట్టాల (4ఆరో) | పంజాం | వాగర్తి |
| | కొమ్మి | పండ్రంగం (2ఆరో) | సంగం |
| | కొరడి | పండ్రంగి | సుబ్రమణ్యం |

ఇవి (42) కేవల సంజ్ఞావాచకాలు. ఇరకం- కులసూచి; ఓజిలి- కుటుంబ నామసూచి; కందలి - వృక్షసూచి; కాండ్ర - వృక్షసూచి; బ్రహ్మేశ్వరం, సుబ్రమణ్యం-దేవతాసూచి.

ద్వితీయాది విభక్త్యంగ (oblique forms) రూపాలను కూడా అసమస్తా ల్లోనే చేర్చవచ్చు. ఇవి సంబంధార్థక బోధకాలు.

ఉదా: వావిళ్ల, గూండ్లు, చుట్టి

2.3 నామబంధాలు : ఇవి రెండు లేదా రెంటికి మించిన పదాంశాలతో కూడిన సమస్త రూపాలైన గ్రామనామాలు. వీటిని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. 1. అస్పష్ట నామబంధాలు 2. స్పష్టనామబంధాలు

2.4 అస్పష్టనామబంధాలు : వ్యుత్పత్తి నిర్ణయానికి లొంగని గ్రామ నామాలను అస్పష్టనామబంధాలుగా పేర్కొనవచ్చు. ఈ గ్రామనామాల్లోని ప్రథమావయవానికి కానీ, ద్వితీయావయవానికి కానీ, రెంటికి కానీ వ్యుత్పత్తి నిర్ణయించడం సంక్లిష్టం.

ఉదా: అండ. గుండాల; చే. జర్ల; మద్దాలి (మద్ది. అలి) ఈద. గాలి; బూదనం, తూపూయ, వెల్లంటి మొదలగునవి.

ఇవి నిర్మాణ సంబంధమైన అస్పష్ట నామబంధాలు కావు. వ్యుత్పత్తి సంబంధమైనవి. నెల్లూరు గ్రామనామాల్లో ఈ రకం 42 వరకు ఉన్నాయి.

| | | |
|---|---|---|
| తోకంచి | మద్దాలి | డక్కిలి |
| పామంజి | పొంతాలి | తూపిలి |
| చామదల | దనయాలి | పంబలి |
| పెనుమదల | కొమరిక | వాసిలి |
| పొక్రిందల | పురిణి | చౌట పుత్తేడు |
| పీపినాపి | పరణి | పెద్ద పుత్తేడు |
| పేపినాపి | కోగిలి | చిట్టేడు |
| ఈదగాలి | పెందోడు | తోచాం |
| బురదగాలి | చింతోడు | మల్లాం |
| పల్లగిరిగల | చిరమన | మైలాంగం |
| పారిజాత | పెరమన | గువ్వాడి |
| అరిమిలి | ఎల్లశిరి | వెల్లంటి |
| మజరాముత్త | చాగణం | వాగ్రు |
| పెందోడు | పిగిలాం | తూపాయ |

(వీటి వివరాలకు చూడు అకారాది నిఘంటువు)

2.5 స్పష్టనామబంధాలు : ఇవి సమస్తాలు. నామబంధాల్లోని అవయవ సంబంధం, అవయవాల అర్థ నిర్ణయం స్పష్టంగా చెప్పగల్గినవి. ప్రథమావయవానికీ, ద్వితీయావయవానికీ ఉండే సంబంధాన్ని బట్టి ఈ స్పష్టనామ బంధాలను మూడు రకాలుగా వర్గీకరించవచ్చు. 1. సంబంధార్థక నామబంధాలు 2. స్థలాత్మక నామబంధాలు 3. విశేషణసూచక నామబంధాలు.

2.6 సంబంధార్థక నామబంధాలు : ప్రథమావయవం (First element) లో కన్పించే సామాన్యనామ, వృక్ష, జంతు, దేవతా, వ్యక్తినామ, కుటుంబనామ, కుల, భాషావర్గ, మత, గ్రామనామ, స్థలనామ, సంపుటనాత్మక సూచక నామాలను దీనికి ఉదాహరణంగా తీసుకోవచ్చు.

| | | |
|---|---|---|
| సామాన్యనామసూచి | : | గుడి. నరవ, బందెల. దొడ్డి, గుడ్ల. దొన |
| వృక్షసూచి | : | జువ్వి. నట్టు, పాలి. చెర్ల, రావుల. కొల్లు |
| జంతుసూచి | : | ఎద్దులరేవు, డేగ. పూడి |
| దేవతాసూచి | : | దేవుని. కండ్రిగ, అక్కం. పేట, దుర్గ. వరం |

| | | |
|---|---|---|
| వ్యక్తినామసూచి | : | అనంత. పురం, గంగ. పట్నం, అక్కమాంబా. పురం |
| కుటుంబనామసూచి | : | ఉడతావారి. పాలెం, వేదంవారి. అగ్రహారం |
| కులసూచి | : | కాపు. పాలెం, గమండ్ల. పాలెం, ఒడ్డె. పల్లె యానాది. కాల్వ |
| భాషావర్గసూచి | : | అరవ. పాలెం, మరాటి. పాలెం, తురక. పాలెం |
| మతసూచి | : | జొన్న. వాడ, బూడి. వాడ, తమ్మిన. పట్నం |
| గ్రామనామసూచి | : | పుదూరు. అగ్రహారం, పూడి. పర్తి |
| స్థలనామసూచి | : | నాయుడుచెర్వు. కండ్రిగ, సూరగుంట. తాగేలు |
| సంఘటనాత్మక సూచి | : | ఆకలి. వలస, నాటకాల. దిబ్బ |

ప్రథమావయవంలోని వ్యక్తినామాలకు గౌరవార్థకమైన -గారు కొన్ని గ్రామ నామాల్లో చేరుతుంది. మరికొన్ని గ్రామనామాల్లో చేరదు.

ఉదా: రామన్నగారి. పల్లె, మాదన్నగారి. పల్లె
రామన్న. పాలెం,. రాఘవరెడ్డి. పాలెం

గౌరవార్థకమైన -గారు మాత్రమే కాకుండా ప్రథమ పుం, స్త్రీ, బహువచనరూపం సమూహసూచి అయిన -వారు, వాండ్లు (వాళ్ల) కుటుంబ, కులనామాలకు చేరతాయి. నిమ్నార్థకమైన -వాడు, -గాడు కూడా వ్యక్తినామాలకు చేరతాయి. గౌరవార్థక, నిమ్నార్థక రూపాలమీద సంబంధార్థక ప్రత్యయం అ, ఇ చేరడం నిత్యం.

కుటుంబనామాలు : గంధంవారి. పాలెం; కోళ్ళవారి. పాలెం
ఒరుగువాండ్ల. పల్లె; గోరువాండ్ల. పల్లె

కులనామాలు : జెట్టివారి. పల్లె; బోయళ్లవారి. పాలెం; జంగంవాళ్ల. దిబ్బ

నిమ్నార్థక కులసూచకాలు : ఎరగాటి. పల్లె, పిట్టవాని. పల్లె, బల్లెవాని. పట్టెడ

నామబంధాల్లో కొన్ని ద్వితీయాది విభక్త్యంగ రూపాలు కన్పిస్తాయి.

ఆల్తుర్తి (ఆలు. తుర్తి), వెలి. గండ్ల, అప్పిశెట్టి. తాళ్ళు, అచ్చు. కట్ల, చలం. చెర్ల మొదలగునవి.

సంబంధార్థక నిర్మాణ పద్ధతులు (శాఖాచిత్రాల్లో) :
















నామబంధాల్లో కారకశ్లేష (Syntactic ambiguity)

(అ)






(ఆ)


1. నామబంధం
సమస్తనామం
నామం
నామం
నామం
వేముల
గుంట
పాలెం


2. నామబంధం
సమస్తనామం
నామం
నామం
నామం
వేముల
గుంట
పాలెం

(ఇ)


1. నామబంధం
సమస్తనామం
నామం
నామం
నామం
ఎరుకల
రెడ్డి
పాలెం


2. నామబంధం
సమస్తనామం
నామం
నామం
నామం
ఎరుకల
రెడ్డి
పాలెం

(ఈ)


1. నామబంధం
సమస్తనామం
నామం
నామం
నామం
గంగులవారి
చెరువు
పల్లె


2. నామబంధం
సమస్తనామం
నామం
నామం
నామం
గంగులవారి
చెరువు
పల్లె

(ఉ)


1. నామబంధం
సమస్తనామం
సమస్తనామం
నామం
నామం
నామం
నామం
దరఖాస్తు
తలపాటి
వెంకటస్వామి
కండ్రిగ




2.7 స్థలార్థక నామబంధాలు : స్థలార్థక నామబంధాల్లో -కింద, -మీద, -లో అనే పరస్థరూపాలు (Post Positions) గ్రామనామాల్లో కన్పిస్తున్నాయి.

ఉదా : కట్టకింద. పల్లె, పాటిమీద. పూండ్ల, తోపులో. పాలెం
కట్టకింద. కంౘ్రిగ, కొండమీద. కొండూరు, చెర్లో. పల్లె

పరస్థరూపాలు లోపించిన రూపాలు కూడా కన్పిస్తాయి.

ఉదా : గట్టు. పల్లె, మిట్ట. పల్లె, దిన్నె. అనంతవరం.

స్థలార్థక నామబంధాల్లో గ్రామ ద్వితీయావయవం సామాన్య నామాంగా కానీ, గ్రామనామంగా కానీ ఉంటుంది.

ఉదా : పాటిమీద. పూండ్ల, పాటిమీద. తోటలు
పాటిమీద. జాకువల్లె, కొండమీది. కొండూరు

స్థలార్థక నామబంధాల నిర్మాణరీతులు (శాఖాచిత్రాల్లో)



(అ)




2.8 విశేషణసూచక నామబంధాలు : విశేషణ నామబంధాల్లో వర్ణ, సంఖ్యా, దిక్, పౌర్వాపర్య, పరిమాణ, సూచక విశేషణాలు గ్రామనామ ప్రథమావయవంలో కన్పిస్తాయి.

| | | |
|---|---|---|
| వర్ణసూచి | : | వెలి. గండ్ల, ఎర్ర. బల్లె |
| సంఖ్యానామసూచి | : | ఇను. కుర్తి, ఓరు. పల్లె |
| దిక్సూచి | : | తూర్పు. పూండ్ల, పడమటి. పాలెం |
| పౌర్వాపర్యసూచి | : | కొత్త. పల్లె, ముది. వర్తి |
| పరిమాణసూచి | : | నిడు. జువ్వి, పెద్ద. కుప్పం |

దిక్, పౌర్వాపర్య, పరిమాణసూచక విశేషణాలు గ్రామనామ ప్రథమావయవంగా ఏర్పడి వ్యక్తి, కుటుంబ, కుల నామాల్లోని ఏదో ఒకనామం గ్రామనామ ద్వితీయావయవంగా కన్పిస్తుంది.

| | (అ) | (ఆ) | (ఇ) |
|---|---|---|---|
| ఉదా : | ఎగువ. రాజుపాలెం | పాత. నక్కావారిపాలెం | చిన్న. అబ్బీపురం |
| | దిగువ. రాజుపాలెం | కొత్త. నక్కావారిపాలెం | పెద్ద. అబ్బీపురం |

విశేషణసూచక నామబంధాలు (శాఖాచిత్రాల్లో)






## 2.9 గ్రామనామ నిర్మాణం



## 3 అర్థ పరిశీలన (Semantics)

3.0 నెల్లూరు గ్రామనామాలను వాటి అర్థాన్ని బట్టి వివిధ రకాలుగా వర్గీకరించవచ్చు. ఈ వర్గీకరణవల్ల గ్రామనామాలు ఏర్పడడానికి కారణమైన నెల్లూరుజిల్లా భౌగోళిక, సాంస్కృతిక విశేషాలు, మత, సాంఘిక, చారిత్రక వివరాలు, ప్రజల నాగరికత కొంతవరకు తెలుస్తాయి.

3.1 నెల్లూరు గ్రామనామాలను రెండు ప్రధాన వర్గాలుగా విభజించవచ్చు. 1 సామాన్యనామ సూచక గ్రామాలు 2 సంజ్ఞానామ సూచక గ్రామాలు

3.2 సామాన్య నామసూచక గ్రామాలు : ప్రథమావయవంలోని సామాన్య నామాల వైవిధ్యాన్ని బట్టి వీటిని మరలా రెండు ముఖ్యమైన రకాలుగా విభజించవచ్చు.

1. వర్ణనాత్మక నామాలు (Descriptive names)
2. సంఘటన నామాలు (Incident names)

వర్ణనాత్మకనామాలు : ప్రథమావయవంలో వర్ణనాత్మక విశేష్యం కానీ, విశేషణం కానీ ఉన్నగ్రామనామాలు. వీటిని మళ్లీ మూడు రకాలుగా విభజించవచ్చు.

1. నైసర్గిక నామాలు 2. సాంస్కృతిక సూచక నామాలు
3. విశేషణ సూచక నామాలు

నైసర్గిక నామాలు : విశేషణ స్థానంలో లేదా ప్రథమావయవ స్థానంలో ఉండే నైసర్గిక నామాల్ని అర్థాన్నిబట్టి 8 రకాలుగా విభజించవచ్చు. ఇవి

(అ) జలసూచకాలు.

ఉదా : ఏరు. కొల్లు, కోడూరు (కోడు. ఊరు), కొల్లు. మిట్ట.కుంట్ల, మిట్ట, మడుగు. మిట్ట మొదలగునవి.

(ఆ) శిలాసూచకాలు

ఉదా : కల్లూరు (కల్లు. ఊరు), కలు.వాయ, గుండ్ల. దిబ్బ, కప్పరాళ్ల. తిప్ప మొదలగునవి.

(ఇ) పర్వత సూచకాలు

ఉదా : గంపి. పాలెం, గండ్ల. వేడు, కొండూరు (కొండ. ఊరు) కొండ. లేడు మొదలగునవి.

(ఈ) ఉన్నత భూసూచకాలు :

ఉదా : తెన్నెల. పూడి, దిన్నె. అనంతవరం, మొదలగునవి.

(ఉ) అటవీ సూచకాలు :

ఉదా : అడవి. రాజుపాలెం, కానూరు (కాన. ఊరు) కారూరు (కారు. ఊరు) మొదలగునవి,

(ఊ) భూ సూచకాలు : గ్రామాలు వెలసిన ప్రదేశపునేల తీరుతెన్నులు తెల్పేవి.

ఉదా : ఇసుక. పల్లె, ఉప్పల. మర్తి, ఉప్పు. చేడు, రొంపి. దొడ్ల, బురద. మడుగు, సుద్ద. మళ్ల మొదలగునవి.

(ఎ) వృక్ష సూచకాలు : వృక్ష, సస్య సూచకాలున్న గ్రామనామాలన్నీ ఈ వర్గంలో చేరతాయి.

ఉదా : అత్తి. వరం, గొట్టి. కాడు, చిల్లమాని. చేను, తాటి. పర్తి, నెల్లి. పూడి, ఆముదాల. దిన్నె, జువ్వి. నట్టు, మొదలగునవి.

(ఏ) జంతు సూచకాలు : పశుపక్ష్యాదుల, సర్పాల పేర్లున్న గ్రామనామాలన్నీ ఈ వర్గంలో చేరతాయి,

ఉదా : ఆనే. గొట్టం, అల్తుర్తి (అలు. తుర్తి), గద్ద. గుంట, దేగ. పూడి, పాముల. తేరి, ఏనుగ. వాడ మొదలగునవి.

సాంస్కృతిక సూచకనామాలు : విశేషణ స్థానంలోగల దేవత, మంగళ, వాస్తు, సాంస్కృతిక, సాదృశ్య బోధకాది గ్రామనామా లీ వర్గంలోకి వస్తాయి. ఈ గ్రామనామాలు ప్రజల సంస్కృతి, నాగరికతలు తెల్పుతాయి. ఇవి ఎనిమిదిరకాలు.

(అ) దేవతా సూచకాలు : వీటిని రెండురకాలుగా విభజించవచ్చు.

1. పురుషదేవతా సూచకాలు 2. స్త్రీదేవతా సూచకాలు

పురుషదేవతా సూచకాలు :

ఉదా : అనుమ. కొండ, వెంకటా. చలం, ముని కుప్పం, రామ. తీర్థం, కోటి. తీర్థం, శంభోశంకర. పురం.

స్త్రీదేవతా సూచకాలు :

ఉదా : అక్కం. పేట, అంబా. పురం, అమ్మ. పాలెం.

(ఆ) మంగళసూచకాలు : మంగళప్రదమైన గ్రామనామాలు వీటికింద చేరతాయి

ఉదా : తిరువీధి. పాడు, తిరు. మూరు, శ్రీ. పురం, శ్రీ. కొలను

(ఇ) వాస్తు సూచకాలు :

ఉదా : కోట, కోట. పాడు, కొట్టాల, కొట్టాల. పల్లె

(ఈ) వృత్తి సూచకాలు : ఉదా : అటకాని. తిప్ప

(ఉ) బిరుద సూచకాలు :

ఉదా : బిరద. వాడ, బిరద. వోలు, తెలుగురాయ. పురం

(ఊ) పరిపాలనా సూచకాలు :

ఉదా : అమ్చు కట్ల, అమాని. చిరువెళ్ల, కట్టుబడి. పాలెం, కిస్తీ. పురం, ముజరా. ముత్త, హిస్సా. వావిలేటిపాడు

(ఎ) సాంస్కృతిక సూచకాలు : ఉదా : అక్కర. పాక, సంకురాత్రి. పల్లె

(ఏ) సాదృశ్యబోధక సూచకాలు : ఉదా : ఉదయ. గిరి, భద్రా. చలం బోగోలు (బోగ. వోలు), హాస్త. కావేరి

విశేషణసూచకనామాలు : వీటిని ఐదు రకాలుగా వర్గీకరించవచ్చు.

(అ) వర్ణసూచకాలు :

ఉదా : నల్ల. గొండ, వెలి. చెర్ల, ఎర్ర. కట్ట, వెలి. గండ్ల మొదలగునవి.

(ఆ) సంఖ్యానామ సూచకాలు :

ఉదా : ఇన. మడుగు, ఇను. కుర్తి, ఓరు. పల్లె మొదలగునవి

(ఇ) దిక్సూచకాలు : కేవల దిగ్వాచక విశేషణసూచక గ్రామాలు, స్థలార్థక సూచక గ్రామాలు ఇందులో చేరతాయి.

1. కేవలదిగ్వాచకాలు : దిక్కులను సూచించే తూర్పు, పడమర మాత్రమేగాక ఎగువ, దిగువ, ఉన్నత భూసూచి అయిన మిట్టకూడా ఈ వర్గంలో చేర్చుకోబడింది.

ఉదా : తూర్పు. రొంపిదొండ్ల, పడమటి. పొలం, ఉత్తర. పాలెం, దక్షిణ. పాలెం, ఎగువ. పాడు, దిగువ. పల్లె, నడిం. పల్లె, మిట్ట. కండ్రిగ, మిట్ట. పాలెం మొదలగునవి.

2. స్థలార్థక సూచక నామాలు : గ్రామం ఏ స్థలంలో వుందో తెల్పేవి.

ఉదా : కొట్టాలవద్ద. ఇండ్లు, కొండమీద. కొండూరు, తోపులో. పాలెం, పాటిమీద. కాకుపల్లె, మిట్టమీద. ఒడ్డెపాలెం మొదలగునవి.

(ఈ) పౌర్వాపర్య సూచకాలు : కాలగతికి సంబంధించిన విశేషాలను, పాత కొత్తలను తెల్పేవి.

ఉదా : కొత్త. కుప్పం, కొత్త. పట్నం, పాత. సత్రం, పాత. పాడు, ముది. వర్తి, ముది. గేడు మొదలగునవి.

(ఉ) పరిమాణ సూచకాలు :

ఉదా : పెద్ద. కుప్పం, చిన్న. అన్నలూరు, చిన్న. అబ్బీపురం, కురు. గొండ, నిడి. గల్లు, పెరియ. వట్టు మొదలగునవి.

సంఘటన నామాలు : ఒక సంఘటన ఆధారంగా చేసుకొని ఏర్పడిన గ్రామనామాలివి.

ఉదా : ఆకలి. వలస, నాటకాల. దిబ్బ మొదలగునవి.

3.3 సంజ్ఞానామ సూచక గ్రామాలు ; వీటినే సంబంధార్థకక నామాలనవచ్చు. వీటిని ఏడురకాలుగా విభజింపవచ్చును. అవి.

(అ) వ్యక్తి నామాసూచకాలు, (ఆ) కుటుంబనామ సూచకాలు, (ఇ) కులసూచకాలు, (ఈ) మతసూచకాలు, (ఉ) భాషావర్గ సూచకాలు, (ఊ) గ్రామపనామ సూచకాలు, (ఎ) స్థలనామ సూచకాలు.

పై వర్గాల సంబంధంతో ఏర్పడిన గ్రామ నామాలివి. ఈ సంబంధం క్రమమైనది కావచ్చు, కాకపోవచ్చు. వ్యక్తి, కుటుంబ నామాలున్న గ్రామాలు వ్యక్తి ప్రాధాన్యాన్నిబట్టి గానీ, కుటుంబ ప్రాధాన్యాన్నిబట్టి గానీ, ఏర్పడి ఉండవచ్చు. కుల, మత సంబంధవాచకాలైన గ్రామనామాలు వాటి ప్రాధాన్యాన్ని బట్టి ఏర్పడి ఉండవచ్చు.

(అ) వ్యక్తినామసూచకాలు ; ఇవి రెండు రకాలు

(1) పురుషనామ సూచకాలు, (2) స్త్రీ నామసూచకాలు.

పురుషనామసూచకాలు :

ఉదా : అక్బరాబాదు (అక్బర్. ఆబాదు), క్రిష్ణా. పట్నం, అనంత. పురం, తిమ్మ. సముద్రం, సూరప. అగ్రహారం మొదలగునవి.

కులసూచకానుబంధాలున్న పురుష నామాలుకూడా ఈ వర్గంలో చేరతాయి.

ఉదా : అంకిరెడ్డి. పల్లె, దేవశెట్టి. పల్లె, మందాళ్లనాయుడు. పల్లె, లింగరాజు. అగ్రహారం, ఖాన్. చెరువు మొదలగునవి.

స్త్రీనామ సూచకాలు :

ఉదా : ఈశ్వరమ్మ. మఠం, నాగమాంబా. పురం, లచ్చి. పాలెం, లక్ష్మి. పురం, నారం. పేట మొదలగునవి.

(ఆ) కుటుంబనామసూచకాలు : వంశపురుషుల పేర్లవల్ల కలిగినవి లేదా ఇతర సాంస్కృతిక సూచకాలైన ఇంటిపేర్లవల్ల కలిగినవి ఈ వర్గంలో చేరతాయి.

ఉదా : ధూర్జటివారి. కండ్రిగ, మధ్వపతివారి. అగ్రహారం, ధర్మచాట్లవారి. కండ్రిగ, సురభివారి. కండ్రిగ, ఒరుగువాండ్ల. పల్లె, కేతు. గుంట, అడపా. మూడి మొదలగునవి.

(ఇ) కులసూచకాలు : ఇందులో గణసూచకాలు (Tribe denoting names) కూడా చేర్చడమైంది.

ఉదా : కమ్మ. కండ్రిగ, కాపు. పాలెం, కుమ్మర. పల్లె, గమండ్ల. పాలెం, వెలం. పల్లె, భట్టు. పాడు, ఒడ్డె. పల్లె, యానాది. పాలెం మొ॥

(ఈ) మత సూచకాలు :

ఉదా : బూద. వాడ, జొన్న. వాడ, శంఖ. వరం, తిమ్మిన. పట్నం, పీర్ల. గుడిపాడు మొదలగునవి.

(ఉ) భాషావర్గ సూచకాలు :

ఉదా : అరవ. పెరిమిడి, అర. వేడు, తురక. పాలెం, మరాటి. పాలెం. మొదలగునవి.

(ఊ) గ్రామనామ సూచకాలు : గ్రామనామం ప్రథమావయవంగా ఏర్పడినవి లేదా జనపదాన్ని సూచించేవి.

ఉదా : క్రిష్ణాపురం. అగ్రహారం, కావలి. మిట్ట, చిగురుపాడు. అగ్రహారం; పూడి. పర్తి, సూళ్ళూరు. పేట, ఇందుకూరు. పేట, ఎలమంచి. పాడు మొదలగునవి.

(ఎ) స్థలనామ సూచకాలు :

ఒక పరిసరంలో గుర్తింపదగిన స్థలంపేరుతో ఏర్పడిన గ్రామనామాలు.

ఉదా : తోపుగుంట. అగ్రహారం, నెమలిమిట్ట, అగ్రహారం, నాయుడు చెరువు, పాలెం, ఉదయగిరి. దుర్గం, నడిమిగడ్డ, అగ్రహారం, వెడిచెర్ల. మిట్ట, మొదలగునవి.

3.4 అర్థదృష్ట్యా చేసిన పై వర్గీకరణను ఈ క్రిందివిధంగా పటంలో చూపవచ్చు. (పటము ప్రక్క పేజీలో నున్నది గమనించవలయును)

3.5 లోకనిరుక్తి (Folk Etymology)

గ్రామనామ పరిశీలనలో అర్థదృష్ట్యా ఆసక్తికరమైన పరిశీలన లోక నిరుక్తి. సాధారణంగా ఏ భాషలోనైనా స్థలనామాలకు లోకనిరుక్తులు కన్పిస్తాయి. ఉదాహరణకు బ్రూటస్ పేరుతో బ్రిటన్ ఏర్పడిందనడం. రోములస్ పేరుతో రోమ్ పేరు వచ్చిందని చెప్పడం. తమిళ స్థలనామాలైన ఐయిర్‌మలైకి పంచపాండవులతో సంబంధాన్ని కల్పించి ఐవర్‌మలై (అయిదుగురి కొండ) గా మార్చి లోక నిరుక్తి చెప్పడం. తమిళ గ్రామనామం

3.4


నెల్లూరు గ్రామనామాలు : అర్థవర్గాలు
సామాన్య నామ సూచకాలు
సంజ్ఞా నామ సూచకాలు
వర్ణనాత్మక
సంఘటనాత్మక
వ్యక్తి
కుటుంబ
కుల
మత
భాషావర్గ
గ్రామ
స్థల
పురుష
స్త్రీ
నైసర్గిక
సాంస్కృతిక
విశేషణ
వర్ణ
సంఖ్యా
దిక్
పౌర్వాపర్య
పరిమాణ
దేవత
మంగళ
వాస్తు
వృత్తి
బిరుద
పరిపాలన
సాంస్కృతిక
సాదృశ్య
కేవలదిక్
స్థలార్థక
పురుష
స్త్రీ
జల
శిలా
పర్వత
ఉన్నత భూ
అటవీ
భూ
వృక్ష
జంతు

తిరుచ్చిరాపల్లికి త్రిశిరునితో (లంకలో ఒక రాక్షసుడు) సంబంధాన్ని ముడిపెట్టి తిరిసిరాపల్లి అని లోకనిరుక్తి ఇవ్వడం ఇటీవల ఆంధ్రభూమిలో ధారావాహికంగా 'ఊరూ-పేరూ' శీర్షిక కింద వెలువడిన గ్రామనామోత్పత్తులు చాలవరకు లోక నిరుక్తులు. అదే విధంగా 'ఈనాడు' పత్రికలో ఇవ్వబడిన స్థల నామోత్పత్తులు స్థలప్రాశస్త్యం తెలిపే లోకనిరుక్తులు.

నెల్లూరు గ్రామనామాల్లో గ్రంధస్థమైన లోక నిరుక్తులు యాభైవరకు ఉన్నాయి. మెకంజీ కైఫియత్తులనుండి, ఇతర గ్రంథాలనుండి, పర్యటనలోను సేకరించిన లోక నిరుక్తులు నిఘంటువులో ఆయా గ్రామాల వ్యుత్పత్తి పరిశీలనలో ఒక భాగంగా వివరించడమైంది. ఈ లోకనిరుక్తులను రెండు రకాలుగా విభజించ వచ్చు. 1. సామాన్య ప్రజాలోకనిరుక్తులు 2. పండిత లోక నిరుక్తులు.

సామాన్య ప్రజాలోక నిరుక్తులు : సామాన్య ప్రజల కృతక ప్రామాణిక రూపాలనుంచి ఏర్పడినవి, శాబ్దిక రూపాన్ని మార్చకుండా నిరుక్తి చెప్పినవి ఈ వర్గంలో చేరతాయి.

(అ) కృతక ప్రామాణికాల లోకనిరుక్తి :

ఉదా : తుమ్మూరు, రాపూరు, వాకాడు

తుమ్మూరు : స్వర్ణముఖి నది ఒడ్డునున్న ఈ ఊరికి ఒకసారి నారద, తుంబురులు రావడం జరిగింది. నారదుడు వరదరాజ గరుడోత్సవాన్ని చూడా లనే కోరికతో కంచికి వెళతాడు. కాని తుంబురుడు ఈ ఊర్లో ఆగి ఇసుకతో వరదరాజ ప్రతిమను చేసి పూజిస్తాడు. అందువల్ల దీనికి తుంబూరు అనే పేరు వచ్చి కాల క్రమేణా తుమ్మూరు అయినట్లు ఐతిహ్యం (FF. ST. 41) రాపూరు, వాకాడు (వివరాలకు చూడు. అకారాది నిఘంటువు)

(ఆ) శాబ్దిక రూపాన్ని మార్చకుండా చెప్పిన లోక నిరుక్తులు ;

ఉదా : కోట, కలిగిరి, కొండూరు, అక్కసముద్రం, మహిమలూరు, దగ. దర్తి (వివరాలకు చూడు. అకారాది నిఘంటువు)

దగదర్తి : ఈ ప్రాంతంలో మొదటి నివాసులు దగ, దర్తి అనే ఇద్దరు యానాది కులస్థులు. వారి పేర్లతో ఈ ఊరికి దగదర్తి అనే పేరు వచ్చింది. (FF. CO. 159)

ఈ విధమైన సామాన్య ప్రజాలోక నిరుక్తులలో స్థానికమైన ఒక ఐతిహ్యం (Local legendry) ప్రాధాన్యం వహించినట్లు తెలుస్తుంది.

పండితలోక నిరుక్తులు : పురాణాలకు సంబంధించిన కథల్ని, గ్రామనామాలకు ధృవపరచే ఉద్దేశంతో పండితులైన కొందరు గ్రామనామ స్వరూపాన్ని మార్చి కానీ, మార్చకుండాకానీ కల్పించిన లోక నిరుక్తులివి.

(అ) శాబ్దికరూపం మార్చిచెప్పిన లోక నిరుక్తులు :

వెంకటగిరి : వెంకటాద్రి పర్వతానికి, శేషాచల పర్వతానికి దగ్గరలో నున్న ఈ గ్రామానికి విష్ణుపరమైన నామం ఏర్పరచినారని ఉంది. (వివరాలకు చూడు. అకారాది నిఘంటువు)

సంగం : ఇచ్చట బొగ్గేరు, బీరపేరు నదులు పెన్నానదిలో కలవటం వల్ల దీన్ని త్రివేణీ సంగమం అంటారు. క్రమేణా ఇది సంగం అనే పేరుతో వ్యవహరింప బడింది.

(ఆ) శాబ్దికరూపం మార్చకుండా చెప్పిన లోకనిరుక్తులు :

అనంతసాగరం : ఈ గ్రామనామం కృష్ణదేవరాయల తమ్ముడు అనంత దేవరాయల పేరిట ఏర్పడినట్లు చెప్తారు. ఈ కథ ఎంతవరకు సత్యమో విచారణీయం. (వివరాలకు చూడు. అకారాది నిఘంటువు)

పండ్రంగం : ఈ గ్రామనామం గుణగవిజయాదిత్యుని సేనాని పండరంగడు పేరిట ఏర్పడినట్లు చెప్తారు. (వివరాలకు చూడు. అకారాది నిఘంటువు)

ముసులపూడి : ఈ గ్రామనామం మునులీ ప్రాంతాన ఉండటంచేత ఏర్పడినట్లు చెప్తారు. (వివరాలకు చూడు. అకారాది నిఘంటువు)

నెల్లూరు గ్రామనామాల్లోని లోక నిరుక్తులు ప్రత్యేక పరిశీలనార్హాలని కూడా పేర్కొనవచ్చు. ఈ లోక నిరుక్తులవల్ల ప్రజల, పండితుల విశ్వాసాలు, కల్పనాశక్తి, జానపదుల చరిత్ర తెలుస్తాయి. అయితే శాసనాధారాలు లభింపని చోట్ల వ్యుత్పత్తిరీత్యా క్లిష్టమైన నామబంధాలున్న సందర్భంలో ఈ లోక నిరుక్తులే సిసలైన నిరుక్తులని భ్రమపడే ప్రమాదముంది. కాబట్టి నామ విజ్ఞానంలో లోక నిరుక్తుల్ని యథాతథంగా గ్రహించడం ప్రమాదకరం. టీవా పరిశీలనలో విచక్షణ, వివేకం అవసరం.

# 2

# గ్రామనామాలు - సామాజిక పరిశీలన

## 4 నైసర్గిక విశేషాలు

4.0 గ్రామనామ పరిశీలనవల్ల భాషా విశేషాలేకాక భాషేతరమైన సామాజిక విశేషాలు – నైసర్గిక, సాంస్కృతిక, చారిత్రకాది విశేషాలు వ్యక్త మవుతాయి. నెల్లూరు జిల్లా గ్రామనామాల్లో కన్పించే నైసర్గిక విశేషాలను ఈ అధ్యాయంలో చర్చించడమైంది.

4.1 నెల్లూరు జిల్లాను సహజ వనరులనుబట్టి మూడు భాగాలుగా విభజించవచ్చు. అవి కొండప్రాంతాలు, సారవంతమైన సమతలభాగం, తీర ప్రాంతాల్లోగల ఇసుక పర్రలు. తూర్పుకనుమల్లో భాగమైన వెలికొండలు నెల్లూరు జిల్లాకు పశ్చిమ సరిహద్దుగా ఉన్నాయి. ఈ కొండలు వెంకటగిరి తాలూకా నైరుతి దిశనుండి ఉత్తరంవైపుగా ప్రకాశం జిల్లాలో ప్రవేశిస్తాయి. ఇవి నెల్లూరు జిల్లాను కడప, కర్నూలు జిల్లాలనుండి వేరు చేస్తున్నాయి. వీనిలో ఎక్కువ ఎత్తైన ప్రదేశం పెంచల కొండ. ఇది సముద్రతీరం కంటె 3900 అడుగుల ఎత్తున ఉన్నది. ఈ ప్రాంతమంతా రాళ్లతో, గుట్టలతో నిండివుంది. ఈ గుట్టలలో ఉదయగిరికొండ కూడా ఎత్తైనది. దీని ఎత్తు 3079 అడుగులు. దీనిపై దుర్భేద్యమైన కోట వుంది. నెల్లూరు తాలూకాలో సారవంతమైన సమతల భూభాగం ఉంది. ఈ జిల్లాకు సుదీర్ఘమైన సముద్రతీరం ఉంది. కావలి, కోవూరు, గూడూరు, సూళ్ళూరుపేట తాలూకాలు సముద్ర తీరానకు ఉత్తరాన

వ్యాపించి ఉన్నాయి. ఈ ప్రాంతమంతా ఇసుక పర్రలతోను, తిన్నెలతోను కూడి ఉంది. ఈ జిల్లాకు ఆగ్నేయ దిశగా శ్రీహరికోట దీవి కలదు. సముద్రపు పోటువలన ఏర్పడిన ఉప్పు సరస్సులు తీరం వెంబడి ఉన్నాయి, వీటిలో పులికాట్ సరస్సు ముఖ్యమైంది.

4.2 ఈ జిల్లాలో ముఖ్యమైన నదులు పెన్న, స్వర్ణముఖి పెన్నా నది కర్ణాటక రాష్ట్రంలోని నందిదుర్గ కొండల్లో పుట్టి వెలి కొండల లోయగుండా నెల్లూరు జిల్లాలో ప్రవేశిస్తుంది. ఇది తూర్పు దిశగా ఆత్మకూరు, నెల్లూరు, కోవూరు తాలూకాల సరిహద్దుగా 112 కి.మీ. ప్రవహించి ఊటుకూరు వద్ద బంగాళాఖాతంలో కలుస్తుంది. స్వర్ణముఖినది చిత్తూరుజిల్లాగుండా ఈ జిల్లాలో ప్రవేశించి వెంకటగిరి, సూళ్ళూరుపేట, గూడూరు తాలూకాల్లో ప్రవహించి నిద్దవరం వద్ద బంగాళాఖాతంలో కలుస్తుంది. బొగ్గేరు, బీరపేరు, కండ్లేరు, కేతామన్నేరు, ఉప్పుటేరు మొదలగునవి ఈ జిల్లాలో ఇతర నదులు, మరెన్నో వంకలు, కాల్వలు, తటాకాలు నెల్లూరు జిల్లాలో ఉన్నాయి.

4.3 గ్రామనామ పరిశీలనవల్ల నైసర్గిక స్థితి కొంత వరకు వ్యక్తమవుతుంది. నైసర్గిక సూచకాలు రెండు విధాలు.

1. నైసర్గికసూచక గ్రామనామ ద్వితీయావయవాలైన భూ, జల, వృక్ష, జంతు మొదలగు వాటితో ఏర్పడిన గ్రామాలు.

2. నైసర్గిక నామాలపైన ఊరు, పల్లె, కండ్రిగ, పురం వంటి జనపద సూచకాలు చేరి ఏర్పడిన గ్రామాలు.

నైసర్గిక విశ్లేషణకు పై రెండు రకాల గ్రామనామాలను అయిదు రకాలుగా విభజించవచ్చు. (అ) భూవర్గసూచకాలు (ఆ) జలసూచకాలు (ఇ) వృక్షసూచకాలు (ఈ) జంతుసూచకాలు (ఉ) ఖనిజ సూచకాలు.

4.4 భూవర్గ సూచకాలు : ఈ భాగంలోకి జలసూచకాలు, వృక్షాలు, జంతువులు తప్ప అన్ని నైసర్గిక సూచకాలు వస్తాయి. దీన్ని మరలా ఐదు రకాలుగా విభజించవచ్చు. 1. అటవీ సూచకాలు 2. పర్వత సూచకాలు 3. ఉన్నత భూ సూచకాలు 4. శిలాసూచకాలు 5. భూ స్థితి సూచకాలు.

అటవీ సూచకాలు : నెల్లూరు జిల్లా వైశాల్యంలో అరణ్యప్రాంతం 20 శాతం ఆక్రమిస్తుంది. అరణ్యప్రాంతాన్ని తెల్పే గ్రామనామ ద్వితీయావయవాలు, గ్రామనామాలు ఇందులో వస్తాయి. ఈ అటవీసూచక ద్వితీయావయవాలు గల గ్రామాలు చాలావరకు అడవి దగ్గరగా, అడవిలో ఉంటాయి. అటవీ సూచక గ్రామనామ ద్వితీయావయవాలు(4)అవి -అడవి; -కాడు; -కుర్ర; -పెంట;

అటవీసూచక గ్రామాలు : అడవి. రాజు పాలెం, కానూరు (కాన. ఊరు), కారూరు (కారు. ఊరు) పెంట. పాలెం మొదలగునవి.

మొత్తం భూవర్గ సూచక గ్రామాల్లో (210) అటవీ సూచక గ్రామనామ ద్వితీయావయవాల అనుబంధ గ్రామాల (16) శాతం7.61%; ఇందులో -కాడు అనుబంధంగాగల గ్రామాలెక్కువ. దీనిశాతం 43.75%; మొత్తం గ్రామనామాల్లో (2727) అటవీ గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాల శాతం 0.58% (చూడు. పట్టిక)

పర్వతసూచకాలు : వెలి గొండలు ఈ జిల్లా లో వ్యాపించి ఉండటం వల్ల గ్రామనామాల్లో కొండలు, గుట్టలు చోటు చేసుకొన్నాయి. మిగతా జిల్లాల కంటె ఈ జిల్లాలో కొండలు తక్కువ, పర్వత సూచక గ్రామనామ ద్వితీయా వయవాలు, గ్రామనామాలు దీని కింద వస్తాయి.

పర్వత సూచక గ్రామనామ ద్వితీయావయవాలు, గ్రామనామాలు దీని కింద వస్తాయి.

పర్వత సూచక గ్రామనామ ద్వితీయావయవాలు (7); అవి -అచలం, -కొండ, -గండ్ల, -గిరి, -దిన్నె, -మాల, -మిట్ట. పర్వత సూచక గ్రామాలు. కొండ. లేడు, కొండూరు (కొండ. ఊరు), గండ్ల. వేడు, మిట్ట. పాలెం మొదలగునవి.

మొత్తం భూవర్గ సూచక గ్రామాల్లో (210) పర్వత సూచక గ్రామ నామ ద్వితీయావయవ అనుబంధగ్రామాల (88) శాతం 41,90% ఇందులో -మిట్ట అనుబంధంగా గల గ్రామాలెక్కువ, దీనిశాతం 50%; మొత్తం గ్రామ నామాల్లో పర్వత సూచక గ్రామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాల శాతం 3.19% (చూడు. పట్టిక)

ఉన్నత భూసూచకాలు; ఉన్నత భూస్థితిని తెల్పే గ్రామనామ ద్వితీయావయవాలు, గ్రామనామాలు ఇందులో కన్పిస్తాయి. ఉన్నత భూసూచక గ్రామనామ ద్వితీయావయవాలు (5); అవి -కట్ట ~ కట్టువ, -గట్టు, -తిప్ప, -దిబ్బ, -మేడు,

ఉన్నత భూసూచక గ్రామాలు : గట్టు. పల్లె, కట్టువ. పల్లె, తిన్నెల. పూడి, దిన్నె. అనంతవరం, దిబ్బమీద. గమండ్లపాలెం మొదలగునవి

మొత్తం భూవర్గసూచక గ్రామాల్లో (210) ఉన్నత భూసూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాల (53) శాతం 25.23%; ఇందులో -దిబ్బ అనుబంధ గ్రామాలెక్కువ. దీనిశాతం 35.84%; మొత్తం గ్రామనామాల్లో ఉన్నత భూసూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాల శాతం 1.92% (చూడు. పట్టిక)

శిలాసూచకాలు : శిలాస్థితిని తెల్పే గ్రామనామ ద్వితీయావయవాలు, గ్రామాలు ఇందులో కన్పిస్తాయి.

శిలాసూచక గ్రామనామ ద్వితీయావయవయవాలు (3) అవి. -కల్లు; -బండ, -శిల.

శిలాసూచక గ్రామాలు : కలు. వాయ, కల. ంవాగు, గుండ్ల సముద్రం, కల్లూరు (కల్లు. ఊరు) మొదలగునవి.

మొత్తం భూవర్గసూచక గ్రామాల్లో శిలాసూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాల (10) శాతం 4. 76%; ఇందులో -కల్లు అనుబంధంగల గ్రామాలెక్కువ. దీనిశాతం 80%. మొత్తం గ్రామనామాల్లో శిలాసూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాల శాతం 0.36% (చూడు. పట్టిక)

భూస్థితి సూచకాలు : భూ స్థితిని తెల్పే గ్రామనామ ద్వితీయావయవాలు, గ్రామనామాలు ఇందులోకి వస్తాయి.

భూస్థితిసూచక గ్రామనామ ద్వితీయావయవాలు (13) అవి, -గడ్డ, -చెలిక, -చేను, -చేను, -నట్టు, -పడవ, -పడియ. -పర్తి. -పొలం, -పోడు, -బయలు, -మళ్ల, -ములుం, -రేగడ.

భూస్థితి సూచక గ్రామాలు : ఉప్పు, చేడు, ఉప్పల. పాడు, చౌట. పుత్తేడు, చౌట. పల్లె, రేగడి. చెలిక, సుద్ద. పళ్ల మొదలగునవి.

మొత్తం భూవర్గ సూచక గ్రామాల్లో (210) భూస్థితి సూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధగ్రామాల (43) శాతం 20.47%; ఇందులో -పర్తి అనుబంధంగా గల గ్రామాలెక్కువ. దీనిశాతం 23.25% మొత్తం గ్రామ నామాల్లో భూస్థితి సూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాల శాతం 1.56% (చూడు. పట్టిక)

పై పరిశీలనవల్ల భూవర్గ సూచకాల్లో పర్వత సూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామలెక్కువని తెలుస్తుంది. దీని తరువాత భూ స్థితి సూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాలెక్కువని తెలుస్తుంది. మొత్తం గ్రామనామ ద్వితీయావయవాల్లో (115) భూవర్గ సూచక గ్రామనామ ద్వితీయావయవాల (32) శాతం 27.35% మొత్తం గ్రామనామాల్లో భూవర్గ సూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాల (210) శాతం 7.62%

4.5 జలసూచకాలు : జలసూచక గ్రామనామ ద్వితీయావయవాలు, గ్రామాలు నెల్లూరు మండలంలోని జలాధారాలను వ్యక్తపరుస్తాయి. జలసూచక గ్రామనామ ద్వితీయావయవాలు (20) అవి- -ఏరి, -ఏరు, -కాలువ, కొలను ෆ కొల్లు, -కోడు, -కుంట ෆ గుంట, -గుండం, -చెరువు ෆ చెర్ల -తీర్థం, -తుర్తి ෆ మర్తి, -దొరువు, -దొన, -నూతల, -మడుగు, -రేవు. -వాగు, -వాయ ෆ వాయి, -సముద్రం, -సాగరం.

జలసూచక గ్రామాలు : ఏరు. కొల్లు, ఏటూరు, ఏరూరు (ఏరు. ఊరు), కోడూరు (కోడు. ఊరు), కొల్లు. మిట్ట, ఊటు.కూరు, కాలువ. గట్టు మొ॥

మొత్తం గ్రామనామాల్లో జలసూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధగ్రామాల (218) శాతం 7.91%. మొత్తం గ్రామనామద్వితీయావయవాల్లో జలసూచక గ్రామనామ ద్వితీయావయవాల శాతం 17.09%; జలసూచక గ్రామ నామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాల్లో (218) -కుంట అనుబంధంగా గల గ్రామనామాలు (97) ఎక్కువ. దీని శాతం 44.49% (చూడు. పట్టిక)

జలసూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాలకు సంబంధించిన పట్టిక పరిశీలించిన -గుంటతో 97, -సముద్రంతో 26, చెరువుతో 20 అనుబంధ గ్రామాలు ఉన్నట్లు తెలుస్తుంది. గుంట అనుబంధ గ్రామాలెక్కువ. ప్రకృతి సిద్ధాలైనా ఏరు, వంక, మడుగు అనుబంధ గ్రామాలకన్నా మానవ నిర్మితాలైన గుంటలు, చెరువులతో ఏర్పడిన గ్రామాలెక్కువని తెలుస్తుంది. సముద్రం అనుబంధంగా ఉన్న అనేక గ్రామాలు సముద్రానకెంతో దూరంగా ఉన్నాయి. కాబట్టి గ్రామనామాల్లో ద్వితీయావయవంగా కన్పించే -సముద్రం చెరువును సంకేతించే పదం. సముద్రం అనుబంధ గ్రామాలు వెంకటగిరి తాలూకాలో ఎక్కువ. (చూడు. పట్టిక)

4.6 వృక్షసూచకాలు : వృక్ష, సస్య సూచకాలైన గ్రామనామాలు, గ్రామనామ ద్వితీయావయవాలు ఇందులో కన్పిస్తాయి. వృక్ష, సస్య సూచకాలైన 205 గ్రామనామాలనుబట్టి కింది 85 చెట్లు చేమలు నెల్లూరు మండలంలో ఉన్నట్లు తెలుస్తుంది. అవి

| | |
|---|---|
| అత్తి (4) | అత్తివరం, అత్తితోట. అగ్రహారం, అత్తల. పాలెం, అత్తిమాను. మైన్; అరి (1) అరి. గుండం |
| అల్లం (2) | అల్లం. పాడు (2 ఆరోపాలు) |
| అల్లి (2) | అల్లి. మడుగు, అల్లూరు (అల్లు. ఊరు) |
| ఆకు (1) | ఆకు. తోట |
| ఆముదం (4) | ఆముదాలగుంట. కండ్రిగ, ఆముదాల. దిన్నె, ఆముదాల. పాడు (2 ఆరోపాలు) |
| ఆరిమాను (1) | ఆరిమాని. పాడు; ఆర్ల (1) ఆర్ల. పడియ |
| ఇప్ప (1) | ఇప్ప. పూడి |
| ఈదు ~ ఇందు (8) | ఇందుకూరు. పేట (2 ఆరోపాలు), ఇందు. పూరు, ఈద. గాలి, ఈదుల. పల్లె, ఈమల. కండ్రిగ, ఈదూరు (2 ఆరోపాలు) |
| ఉద్ది (3) | ఉద్ది. గుంట, ఉద్ది. మిట్ట (2 ఆరోపాలు) |
| ఉలవ (3) | ఉలవ. పల్లె (2 ఆరోపాలు), ఉలవ. పాడు |
| ఊచ (2) | ఊచ. పల్లె, ఊచగుంట. పాలెం |

ఊడి (1) — ఊడి. పూడి

ఏపి (3) — ఏపి. నాపి, ఏపిల. గుంట, ఏపూరు

కంద (1) — కంద. మూరు

కనుము (4) — కను. పర్తి (కనుము. పర్తి), కనుపర్తి. పాడు
కను. పూరు (2 ఆరోపాలు)

కలవ (2) — కలవ. కొండ, కలవల. పూడి

కలి (4) — కలి. గిరి, కలిగిరి. కొండూరు, కలి. చేడు. కల్లి. పేడు

కాకర (1) — కాకర. మాల

కాకి (2) — కాకి. వాయ, కాకి. తలుపూరు, (కాకి. కాకిపెదురు)

కారి (2) — కారి. కాడు, కారి. జాత

కారుగోగులు (1) — కారుగోగుల. పాడు

కోవి (2) — కోవూరు (కోవి. ఊరు), కోవూరు. పల్లె,

గన్నంగి (1) — గన్నంగి. దిబ్బ

గానుగ లే కానుగ (2) — గానుగ. పెంట, గానిగ. చేను

గిలక (1) — గిలక. పాడు    గుమ్మడి (1) గుమ్మడి. తాగేలు

గొట్టి (3) — గొట్టి. కాడు, గొట్టి. గుంపాల. గొట్టి. ప్రోలు,
గొట్టు. పాలెం, గొట్ల. గుంట,
గొట్ల. పాలెం (3 ఆరోపాలు)

గోగుల (4) — గోగుల. పల్లె, (2 ఆరోపాలు)

చందన (1) — చందన. మూడి

చంద్ర లే చండ్ర (1) — చంద్ర. పడియ

చింత (9) — చింత. గుంట (3 ఆరోపాలు), చింత. చెలిక, చింత.తోపు
(3 ఆరోపాలు), చింత. వరం, చింతల. దేవి

చిరువెళ్ల (1) — చిరువెళ్ల. కండ్రిగ

చిల్ల (2) — చిల్లపూని. చేను, చిల్ల.కూరు

చీక (2) — చీక. వోలు, చీకళ్ల. దిబ్బ

చీకిరేని (2) — చీకిరేని. గుంట, చీకిరేని. పల్లె

చెముడు లే జెముడు (1) — చెముడు. గుంట

చెరుకు (1) — చెరుకు. మూడి;    చౌక (1) చౌక. చెర్ల

| | |
|---|---|
| జమ్మి (1) | జమ్మి. పాలెం |
| జమ్ము (3) | జమ్ముల. దిన్నె, జమ్ముల. పాలెం, జమ్మ. వరం |
| జువ్వి (6) | జువ్వి. నట్టు, జువ్విమాని. కండ్రిగ, జువ్వల. దిన్నె, జువ్వలగుంట. పల్లె, జువ్వలగుంట. పాలెం (2 ఆరోపాలు) |
| టెంకాయ (2) | టెంకాయచెట్ల. పాలెం, టెంకాయ. తోపు |
| తంగేడు (1) | తంగేడు. మిట్ట; తక్కాలి (1) తక్కెళ్ల. పాడు |
| తమిదె (1) | తమిదె. పాడు తరుణ (1) తరుణ. వాయ |
| తాటి (11) | తాటిచెట్ల. పాలెం, తాటి. పర్తి, తాటి. పల్లె, తాటి పాకుల. దిన్నె, తాడి. మేడు. తాళ్ల. పల్లె, తాళ్ల.పాడు, తాళ్ల. పాలెం, తాళ్ల. పూడి, తాళ్లూరు (2 ఆరోపాలు) |
| తుమ్మ (3) | తుమ్మల. దొరువు, తుమ్మల. పెంట, తుమ్మూరు (తుమ్మ. ఊరు) |
| తూకుమాను (1) | తూకుమాను. మిట్ట; తెగ (1) తెగ. చెర్ల |
| దామర (3) | దామర. మడుగు, దామరాయ (దామర. వాయ) దామరాయ. కండ్రిగ |
| దేవదారు (1) | దేవదారుగుంట. కట్ట; నవలాకులు (1) నవలాకుల. తోట |
| నువ్వు (1) | నువ్వూరు. పాడు |
| నెల్లి (4) | నెల్లి. మిట్ట, నెల్లి. పూడి, (2 ఆరోపాలు) నెల్లూరు (నెల్లి. ఊరు) |
| నేరేడు (1) | నేరేడు. పల్లె; పమిడి (1) పమిడి. పాడు |
| పాల (3) | పాలి. చెర్ల, పాలిచెర్ల. పాడు, పాలూరు |
| పుచ్చల (1) | పుచ్చల. పల్లె; పెళ్ల (1) పెళ్లకూరు |
| పొన్న (3) | పొన్న. పాడు, పొన్న పూడి, పొన్న. వోలు |
| పొట్ల (1) | పొట్ల. పూడి |
| బూరగ (1) | బూరుగుల. మైన్ |
| బొటికర (3) | బొటికరమాను. మైన్, బొటికర్ల. పాడు (2 ఆరోపాలు) |
| బిల్లు (1) | బిల్లు. పాడు |
| మద్ది (2) | మద్ది. పాలెం, మద్దాలి (మద్ది. అలి) |

| | |
|---|---|
| మర్రి (7) | మర్రి. గుంట, మర్రి. పల్లె, మర్రి. పాడు (2 ఆరోపాలు) |
| | మర్ల. పల్లె, మర్ల. పూడి, మర్ల. మిట్ట |
| మల్లె (3) | మల్లె. ముల మలి. చేడు. మలి. మిట్ట |
| మామిడి (6) | మామిడి. పూడి, మామిళ్ల. దొర్వు, మాం. బట్టు, |
| | మాముడూరు, మామిళ్ల. పాడు, మోమిడి |
| మారేడు (1) | మారేళ్ల. పాడు |
| మునగ లు మొలగ(2) | మునగ. పాడు, మొలగ. నూరు |
| మొగిలి (4) | మొగళ్ల. గుంట, మొగళ్లూరు (2 ఆరోపాలు) |
| మొలకలు (3) | మొలకల. పూండ్ల, మొలకల. పూడి (2 ఆరోపాలు) |
| మొల్ల (1) | మొల్లూరు (మొల్ల. ఊరు) |
| మోదుగ (1) | మోదుగల. పాలెం |
| రావి (8) | రావి. పాడు (2 ఆరోపాలు), రావిమాను. దిన్నె, రావుల. |
| | కొల్లు (2 ఆరోపాలు), రావూల. గుంట (2 ఆరోపాలు) |
| రేణి (1) | రేణి. మాల రావూరు |
| వావిలి (4) | వావి. లేరు, (వావిలి. ఏరు), వావిళ్ల, వావిళ్ల. దొరువు, |
| | వావిళ్ల. పాలెం |
| వావింట (1) | వావింట. పర్తి |
| వెదురు (2) | వెదురు. గుంట, వైదురు. పట్టు |
| వెలగ (3) | వెలగ. పాడు, వెలగల. వాగు, వెలగల. పన్నూరు |
| వేము (4) | వేముల.పాడు, వేముల.చేడు, వేం.పాడు, వేముల.పాలెం |

వృక్షసూచక గ్రామనామ ద్వితీయావయవాలు (8) అవి -ఆపి < ?ఏపి. -గంధ, -గొట్ల, -చిరువెళ్ల, -తాళ్లు, -దామెర్ల, -మర్రి లు మెర్ల, -మునిలి < మునిడి; వీటి అనుబంధ గ్రామాలు 14 తోట, తోపు అనుబంధంగా గల గ్రామాలు పూల. తోట, పొగ. తోట, చింత. తోపు, టెంకాయ. తోపు మొదలగునవి వన సంపదను వ్యక్తం చేస్తాయి.

పై పరిశీలన వల్ల మొత్తం గ్రామనామాల్లో వృక్షసూచక గ్రామాల(205) శాతం 7.44%; వృక్షసూచక గ్రామాల్లో తాటి చెట్లు అనుబంధంగా గల గ్రామా లెక్కువ. దీని శాతం 5.36% (చూడు. పట్టిక) ఈ జిల్లాలో ఇసుకప్రాంతం ఎక్కువ గాబట్టి తాటి చెట్ల వృద్ధి కనిపిస్తుంది.

4 7 జంతుసూచకాలు : నెల్లూరుజిల్లాలో అటవీప్రాంతం తక్కువ. అతివృష్టి. అనావృష్టి వల్ల అటవీ సంపద క్షీణించింది. నెల్లూరు రామాయణ కాలం నాటి దండకారణ్యంలో ఒక భాగమని చెబుతారు. నెల్లూరుకు సమీపంలో ఉండే అడవుల్లో సింహాలెక్కువగా ఉండటంచేత దీనికి సింహపురి నామం కలిగినదని అంటారు. వెలిగొండలలో పెద్దపులులు, Panthers అనుజాతి చిరుత పులులు ఉండినవట, జింకలు, అడవి పందులు కూడా ఈ జిల్లాలో ఒకప్పుడు ఎక్కువగా ఉండేవట. 'జోర్డాన్' రకం గుర్రాలు కొన్ని దశాబ్దాలకు ముందు ఈ ప్రాంతంలో ఉండేవని చెప్పబడింది (లేక) తెలుస్తుంది. (APDGN-12)

జంతు సూచకాల్లో జంతువులు, పక్షులు, సర్పాలు, మత్స్య సూచకాలు వస్తాయి. జంతుసూచక గ్రామనామాల్లో (50) కన్పించే జంతువులు (22) అవి

| | |
|---|---|
| ఆనె (3) | ఆనెపూడి, ఆనె. మడుగు, ఆనే. గొట్టం, |
| ఆవు (2) | ఆబాక (ఆవు. పాక), ఆల్తుర్తి (ఆలు. తుర్తి) |
| ఎద్దు (3) | ఎద్దుల. రేవు (2 ఆరోపాలు) ఎడ్లదిన్నె. మిట్ట, |
| ఎనుము (1) | ఎనుముల. పాలెం |
| ఏనుగ (1) | ఏనుగ. వాడ |
| కరటం (2) | కరటం. పాడు, కరటా. మూడి |
| కుక్క (1) | కుక్కల. గుంట |
| కొక్కు (2) | కొక్కు. పాడు, కొక్కు. పాలెం |
| కోడి (1) | కోడి. వాక |
| కోతి (2) | కోతి. మిట్ట, కోతుల. గుంట |
| గుర్రం (3) | గుర్రం, కొండ, గుర్రాల. మిట్ట, గుర్రాల. దిన్నె |
| గువ్వ (2) | గువ్వల. గుంట, గువ్వల. పాలెం |
| చిలక (2) | చిలక. పాడు, చిలకల. పుర్రి |
| చీమ (3) | చీమల. పాడు (2 ఆరోపాలు) చీమల. కుర్తి |
| డేగ (2) | డేగ. పూడి, డేగల. పాలెం |
| నక్క (4) | నక్కల. మిట్ట (2 ఆరోపాలు) నక్కలగుంట. దిబ్బ, నక్కలకాల్వ. కండ్రిగ |
| నెమలి (3) | నెమలిమిట్ట. అగ్రహారం, నెమళ్ల. దిన్నె, నెమళ్ల. పూడి |

| | |
|---|---|
| పంది (3) | పంది. పాడు, పందుల. గుంట, పందుల. మిట్ట |
| పక్కి (1) | పక్కిల. గుంట |
| పాము (4) | పాముల. తేరి, పామి. సేలి, పాముల. మిట్ట, పామూరు. పల్లె |
| పులి (3) | పులి. కొల్లు, పులి. కొర్రు, పులి. వేంద్ర |
| మేక (2) | మేక. నూరు, మేకల. పాడెం |

నెల్లూరు ప్రాంతంలో గల వివిధ జంతువులు పై గ్రామనామాల వల్ల తెలుస్తున్నాయి. మొత్తం గ్రామనామాల్లో (2727) జంతుసూచక గ్రామాల (50) శాతం 1.81%

4 8 ఖనిజ సూచకాలు : ఇందులో ఖనిజ సూచకాలైన గ్రామనామాలు వస్తాయి. నెల్లూరుజిల్లా అభ్రకపుగనులకు ప్రసిద్ధి. ప్రపంచ పటంలో నెల్లూరు జిల్లాకు స్థానం కల్పించింది మైకా (అభ్రకం) పరిశ్రమ. గూడూరు రాపూరు తాలూకాల్లో, కావలి తాలూకాలో దుండిగం, గుడ్లదొన గ్రామాల్లో మైకాగను లెక్కువ. ప్రపంచం మొత్తం మైకా ఉత్పత్తిలో నూటికి ఎనభై శాతం వరకు ఇండియా ఉత్పత్తి చేస్తుంది. ఇండియా ఉత్పత్తిలో బీహారు ప్రథమస్థానం. రెండవది మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి చెందిన నెల్లూరు జిల్లాయే. బీహారు ప్రథమస్థానంలో ఉన్నా విదేశమారక ద్రవ్య విషయంలో మొదటి నుండీ నెల్లూరు మైకా విలువైంది. 1940-50 సంవత్సరాల మధ్య ఈ ప్రాంతంలో 250 మైకా గనులు పనిచేయగా ప్రస్తుతం 25-30 మైకాగనులు పనిచేస్తున్నట్లు తెలుస్తుంది. దీన్నిబట్టి నెల్లూరుజిల్లాలో ప్రస్తుత మైకా పరిశ్రమ స్థితి తెలుస్తుంది. [వివరాలకు చూడు వి.మం.స. పుట. 893-902; ఆంధ్రప్రదేశ్ దర్శిని, 1976, పుట 1057]

గ్రామనామాల్లో Mines ఒక భాగంగా తీసుకుంటే లభ్యమైన ఆధారాలను బట్టి మైకాగనులతో (మైన్/మైకామైన్) ఏర్పడ్డ గ్రామనామాలు రాపూరు, ఆత్మకూరు తాలూకాల్లో ఎక్కువగా ఉన్నట్లు తెలుస్తుంది. -మైన్/-మైకామైన్ ద్వితీయావయవాలుగా గల గ్రామాలు 63. అవి-

రాపూరు తాలూకా : ఈ తాలూకాకు చెందిన తురిమెర్ల ఉరఫ్ ఓరుపల్లె మజరా

ఆనంద మస్తాన్. మైన్
కొలిమిగుంట. మైన్
బషీర్, మైకామైన్
రాజా. మైకామైన్
లక్ష్మీవిలాస. మైకామైన్
శ్రీవెంకటేశ్వర. మైకామైన్
సీతారామ. మైకామైన్
సుబ్బానాయుడు. మైన్
కుమార. మైకామైన్
ఖాదర్ వలి. మైకామైన్
మాదిగయినాం. మైకామైన్
రాజు. చెరువు. మైకామైన్
శ్రీక్రిష్ణా. మైకామైన్
శ్రీహరనాథ. మైన్
సుదర్శనం, జానికీరాం. మైకామైన్

ఈ తాలూకాకు చెందిన ఊటుకూరు మజరాలు :

కగకదార. మైన్
జిజోడియా. మైన్
నారసింహ. మైన్
ప్రభాకర. మైన్
బాలశంకర. మైన్
మీనాక్షిసుందర. మైన్
రమణవిలాస. మైన్
రాజ్యలక్ష్మి. మైన్
లక్ష్మీవిలాస. మైన్
వీరాంజనేయ. మైన్
సాయిబాబా. మైన్
కాశీవిశ్వనాథ. మైన్
తెల్లబోడు. మైన్
పిడూరువాండ్ల. మైన్
ప్రసన్న సిద్ధేశ్వర. మైన్
మారుతీరాం. మైన్
మునీరియా. మైన్
రహమత్. మైన్
రూబాలాండ్స్. మైన్
వినాయక. మైన్
సీతారామ. మైన్

ఈ తాలూకాకు చెందిన పొక్కుందల మజరాలు :

అత్తిమాను. మైన్
బొటికరమాను. మైన్
దాసరి. మైన్
సిద్దేశ్వర. మైన్

ఈతాలూకాకు చెందిన తూర్పుపూండ్ల ఉరఫ్ రామసాగరం మజరాలు :

కరుపన్. మైన్
పందలగుంట. మైకామైన్
సిద్దేశ్వర. మైన్
దశరధరామా. మైకామైన్
వెంకటరమణగారి. మైకామైన్

ఈ తాలూకాకు చెందిన మొలకలపూండ్ల మజరాలు :

దేవరతిప్ప. మైన్
పల్లిమిట్ట. మైన్
షా. మైన్
సీతాలక్ష్మి. మైకామైన్

ఈ తాలుకాకు చెందిన జోగిపల్లె మజరాలు :

కోటేశ్వర. మైకామైన్
చుక్కా. మైకా మైన్
గజలక్ష్మి. మైన్
నటరాజ. మైన్
పాండురంగా. మైన్
బూరుగుల. మైన్
రాఘవ. మైన్
రామవిలాస. మైన్
విశ్వేశ్వర. మైన్
సర్వోదయ. మైన్
స్వయంప్రభ. మైన్

పట్టాభిరామా. మైన్. ఇది ఈ తాలూకాలోని బండేపల్లె మజరా,

ఆత్మకూరు తాలూకా :

బలరామరెడ్డిగని (మైన్) - తాటిపర్తి మజరా.
వెంకటేశ్వర. మైకామైన్ - నేదూరుపల్లె మజరా.

వీటి అనుబంధావృత్తి పరిశీలించిన పురుషనామసూచకాలు 26, స్త్రీనామ సూచకాలు 9, దేవతాసూచకాలు 11, వృక్షసూచకాలు 2, కుటుంబనామసూచి 1, స్థలనామసూచకాలు 6, కులసూచి 1, పరిపాలనాసూచి 1, సామాన్యనామ సూచకాలు 5, ఉన్నాయి. ఇవి ఎక్కువగా పురుషనామ సూచకాలతోను, దేవతా సూచకాలతోను ఏర్పడినట్లు తెలుస్తున్నాయి.

పట్టికలు :

1. అటవీ సూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాలు.
2. పర్వత సూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాలు.
3. ఉన్నత భూసూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాలు.
4. శిలాసూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాలు.
5. భూస్థితి సూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాలు.
6. జలసూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాలు.
7. వృక్షసూచక గ్రామ + గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాలు.
8. జంతు సూచక గ్రామ నామాలు.

అటవీ సూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాల పట్టిక :

| | గ్రామనామ ద్వితీయావయవ | ఉదయగిరి | కావలి | కోవూరు | ఆత్మకూరు | నెల్లూరు | గూడూరు | రాపూరు | సూళ్ళూరు | వెంకటగిరి | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 1 | అడవి | | 1 | | | | | | | | 1 |
| 2 | కాడు | | | | | | | 3 | 3 | 1 | 7 |
| 3 | కుర్రు | | | 2 | | 1 | | 2 | | | 5 |
| 4 | పెంట | 1 | 1 | | | 1 | | | | | 3 |
| | | | | | | | | | | మొత్తం | 16 |

పర్వత సూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామాల పట్టిక

| | | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | అచలం | | | 1 | | | 1 | | | | 2 |
| 2 | కొండ | 2 | 1 | | | 2 | 1 | 2 | | 1 | 9 |
| 3 | గండ్ల | | 1 | | 1 | | | | | | 2 |
| 4 | గిరి | 1 | 1 | | | | | | | 1 | 3 |
| 5 | దిన్నె | 4 | 6 | 2 | | | 2 | | | | 14 |
| 6 | మాల | | 1 | | | | 1 | 7 | 4 | 1 | 14 |
| 7 | మిట్ట | 1 | | 2 | 2 | 1 | 21 | 3 | 13 | 1 | 44 |
| | | | | | | | | | | మొత్తం | 88 |

ఉన్నత భూ సూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామ పట్టిక

| | | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | కట్ట | | 1 | | 5 | | 2 | 2 | 5 | | 15 |
| 2 | గట్టు | | | | | | 2 | | | 1 | 3 |
| 3 | తిప్ప | | 1 | 1 | | | | 1 | 1 | | 4 |
| 4 | దిబ్బ | | | 2 | | | 10 | 5 | 7 | | 24 |
| 5 | మేడు | | | 1 | | | | 4 | 4 | 3 | 12 |
| | | | | | | | | | | మొత్తం | 58 |

శిలాసూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామ పట్టిక

| | | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | కల్లు | | | 5 | 1 | | | | | 2 | 8 |
| 2 | బండ | 1 | | | | | | | | | 1 |
| 3 | శిల | | | | 1 | | | | | | 1 |
| | | | | | | | | | | మొత్తం | 10 |

## భూ స్థితి సూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామ పట్టిక

| | | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | గడ్డ | 1 | | | | | | | | | 1 |
| 2 | చెలిక | | | 2 | | | | | | | 2 |
| 3 | చేడు | | | 1 | | 4 | 1 | | | | 6 |
| 4 | చేను | | | | | | 2 | | | 1 | 3 |
| 5 | నట్టు | | | | | | | 3 | | | 3 |
| 6 | పడవ | | | | | | | 1 | 1 | | 2 |
| 7 | పడియ | 1 | | | 1 | | | 1 | | | 3 |
| 8 | పర్తి | | | 1 | 1 | 4 | 3 | | 1 | | 10 |
| 9 | పొలం | | | 1 | | | 1 | 1 | | 1 | 4 |
| 10 | పోడు | | | 1 | | | | | | | 1 |
| 11 | బయలు | | | 1 | | | 3 | | | | 4 |
| 12 | ముఖాం | | | | | | | 1 | 1 | | 2 |
| 13 | వేగడ | 1 | | | | | 1 | | | | 2 |
| | | | | | | | | | | మొత్తం | 43 |

## జలసూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధ గ్రామ పట్టిక

| | | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ఏరి | | | | | | | | 1 | 2 | 3 |
| 2 | ఏరు | | | 2 | 2 | 2 | 1 | | 1 | | 8 |
| 3 | కాలువ | | 1 | | | | 8 | | | | 9 |
| 4 | కొలను | 1 | 2 | 2 | 2 | 1 | | | 1 | | 9 |
| 5 | కోడు | | | | 1 | | | | | 1 | 2 |
| 6 | గుంట | 5 | 12 | 24 | 6 | 2 | 10 | 8 | 2 | 26 | 95 |
| 7 | గుండం | 1 | | | | | | | 2 | | 3 |
| 8 | చెరువు | 3 | 1 | 3 | 1 | 3 | | 5 | | 4 | 20 |
| 9 | తీర్థం | | | 1 | 1 | | | | | | 2 |
| 10 | తుర్తి | | | 1 | | 1 | | | | | 2 |
| 11 | దొరువు | | 1 | | 1 | | 12 | | | | 14 |

| | | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 12 | దొన | | 1 | | | | | | | | 1 |
| 13 | నూతల | | 1 | | | | | | | | 1 |
| 14 | మడుగు | 2 | 2 | | 2 | 1 | | | 2 | 1 | 10 |
| 15 | మళ్ల | | | | | 1 | | | | | 1 |
| 16 | రేవు | | | | | | 2 | | | | 2 |
| 17 | వాగు | | | | | | | 1 | 1 | | 2 |
| 18 | వాయ | | | 1 | 2 | 1 | | | | 1 | 5 |
| 19 | సముద్రం | 3 | 3 | | 2 | 3 | | 1 | 1 | 13 | 26 |
| 20 | సాగరం | | | | | 1 | | | | | 1 |
| | | | | | | | | | | మొత్తం | 218 |

వృక్ష సస్య సూచక ప్రథమావయవ గ్రామనామాల పట్టిక

| | | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | అత్తి | | | | | 1 | 1 | | 1 | 1 | 4 |
| 2 | అది | | | | | | | | 1 | | 1 |
| 3 | అరిగె | | | | | | | | | 1 | 1 |
| 4 | అల్లం | 1 | | | | | | 1 | | | 2 |
| 5 | అల్లి | | 1 | 1 | | | | | | | 2 |
| 6 | ఆకు | | | | | | | 1 | | | 1 |
| 7 | ఆముదం | | 1 | | | | 2 | 1 | | | 4 |
| 8 | ఆరిమాను | | | | | | | | | 1 | 1 |
| 9 | ఆర్ల | 1 | | | | | | | | | 1 |
| 10 | ఈదు | | | 1 | | 1 | 5 | 1 | | | 8 |
| 11 | ఇప్ప | | | | | | | 1 | | | 1 |
| 12 | ఉద్ది | | | 1 | | | 2 | | | | 3 |
| 13 | ఉలవ | | | 1 | 2 | | | | | | 3 |
| 14 | ఊచ | | | 1 | | 1 | | | | | 2 |
| 15 | ఊడి | | | | | | | | 1 | | 1 |
| 16 | ఏపి | 1 | 1 | | | 1 | | | | | 3 |
| 17 | కంద | | | | | | 1 | | | | 1 |
| 18 | కనుము | | | | | 1 | 3 | | | | 4 |
| 19 | కలవ | | | | | | | 1 | 1 | | 2 |
| 20 | కలి | | 1 | 1 | 1 | 1 | | | | | 4 |

| | | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 21 | కాకర | | | | | | | | 1 | | 1 |
| 22 | కాకి | | | | 1 | | 1 | | | | 2 |
| 23 | కారి | | | | | | | | 2 | | 2 |
| 24 | కారుగోగులు | | | | 1 | | | | | | 1 |
| 25 | కోవి | | 1 | 1 | | | | | | | 2 |
| 26 | గన్నంగి | | | | | | 1 | | | | 1 |
| 27 | గానుగ ఌ కానుక | 1 | | | | | | | | | 1 |
| 28 | గిలక | | | | | 1 | | | | | 1 |
| 29 | గుమ్మడి | | | | | | | | 1 | | 1 |
| 30 | గొట్టి | 1 | | 1 | | | | 2 | 1 | 3 | 8 |
| 31 | గోగులు | | | 1 | 1 | 1 | | | 1 | | 4 |
| 32 | చందనం | | | | | | | | | 1 | 1 |
| 33 | చంద్ర | | | | 1 | | | | | | 1 |
| 34 | చింత | 1 | 1 | 3 | | | 2 | 1 | | 1 | 9 |
| 35 | చిరువెళ్ళ | | | | 1 | | | | | | 1 |
| 36 | చిల్ల | | | | | | | 1 | | 1 | 2 |
| 37 | చీక | | | | | 1 | | 1 | | | 2 |
| 38 | చీకిరేని | | | 1 | | | | | | 1 | 2 |
| 39 | చెముడు ఌ జెముడు | | | | | | 1 | | | | 1 |
| 40 | చెఱుకు | | | | | | 1 | | | | 1 |
| 41 | చౌక | | | 1 | | | | | | | 1 |
| 42 | జమ్మి | | | 1 | | | | | | | 1 |
| 43 | జమ్ము | 1 | 1 | | 1 | | | | | | 3 |
| 44 | జువ్వి | 1 | 2 | | 1 | | | 1 | | 1 | 6 |
| 45 | టెంకాయ | | 1 | | | | 1 | | | | 2 |
| 46 | తంగేడు | | | | | 1 | | | | | 1 |
| 47 | తక్కాలి | 1 | | | | | | | | | 1 |
| 48 | తమిదె | 1 | | | | | | | | | 1 |
| 49 | తరుణ | | | 1 | | | | | | | 1 |
| 50 | తాటి | | 3 | 1 | 1 | 1 | 3 | | | 2 | 11 |

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 51 తుమ్మ | | 1 | | | | 1 | | | 1 | 3 |
| 52 తూకుమాను | | | | | | 1 | | | | 1 |
| 53 తెగ | | | | | 1 | | | | | 1 |
| 54 దామర | | | 1 | | | | | | 2 | 3 |
| 55 దేవదారు | | | | | | | | | 1 | 1 |
| 56 నవలాకులు | | | | | | 1 | | | | 1 |
| 57 నువ్వు | | | | 1 | | | | | | 1 |
| 58 నెల్లి | | | | | | 1 | 2 | | | 3 |
| 59 నేరేడు | 1 | | | | | | | | | 1 |
| 60 పమిడి | | | | 1 | | | | | | 1 |
| 61 పాల | | | | | 2 | | 1 | | | 3 |
| 62 పుచ్చల | | | | | | | 1 | | | 1 |
| 63 పెళ్ల | | | | | | | 1 | | | 1 |
| 64 పొన్న | | | 1 | | | | 1 | | 1 | 3 |
| 65 పొట్ల | | | | | | 1 | | | | 1 |
| 66 బూరుగ | | | | | 1 | | | | | 1 |
| 67 బొటికర | 1 | | | 1 | 1 | | | | | 3 |
| 68 బిల్లు | | | | 1 | | | | | | 1 |
| 69 మద్ది | | | 1 | | | | 1 | | | 2 |
| 70 మర్రి | 1 | 1 | 1 | 1 | 1 | | 1 | 1 | | 7 |
| 71 మల్లె | | | | | 1 | 1 | | | 1 | 3 |
| 72 మామిడి | | 1 | | 1 | | 1 | 1 | 2 | | 6 |
| 73 మారేడు | 1 | | | | | | | | | 1 |
| 74 మునగ | | | | | 1 | | 1 | | | 2 |
| 75 మొగిలి | | | | | 1 | 1 | 1 | | 1 | 4 |
| 76 మొలకలు | | | | | 1 | 1 | | 1 | | 3 |
| 77 మొల్ల | | | | | | 1 | | | | 1 |
| 78 మోదుగ | | | | | | | | 2 | | 2 |
| 79 రావి | 2 | 1 | | 1 | | 2 | | | 2 | 8 |
| 80 రేణి | | 1 | | | | | | | | 1 |
| 81 వావిలి | | | 1 | | 1 | | 2 | | | 4 |
| 82 నావింట | | | | | 1 | | | | | 1 |

| | | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 83 | వెదురు | | | | | | | | 1 | 1 | 2 |
| 84 | వెలగ | | | | 1 | | | | 2 | | 3 |
| 85 | వేము | 1 | 1 | | | 1 | | 1 | | | 4 |
| | | | | | | | | | | మొత్తం | 205 |

వృక్షసస్య సూచక గ్రామనామ ద్వితీయావయవ అనుబంధగ్రామ పట్టిక

| | | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ఆపి < ?ఏపి | | 1 | | | 1 | | | | | 2 |
| 2 | గంధ | | | | | | | | | 1 | 1 |
| 3 | గొట్ల | | | | 1 | 1 | | | | | 2 |
| 4 | చిరుపెళ్ల | | | | 2 | | | | | | 2 |
| 5 | తాళ్ల | | | | | | | 1 | | | 1 |
| 6 | దామెర్ల | 1 | | | | | | | | | 1 |
| 7 | మర్రి | | | 1 | 1 | 1 | | 1 | | | 4 |
| 8 | ముసిలి | | | | | | 1 | | | | 1 |
| | | | | | | | | | | మొత్తం | 14 |

జంతుసూచక ప్రథమావయవ గ్రామనామాల పట్టిక

| | | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ఆనె | | 1 | | | | | | 2 | | 3 |
| 2 | ఆవు | | | | | 1 | | | 1 | | 2 |
| 3 | ఎద్దు | | | | 1 | | 2 | | | | 3 |
| 4 | ఎనుము | | | | | | 1 | | | | 1 |
| 5 | ఏనుగ | | | | | | | | | 1 | 1 |
| 6 | కరటం | | | | 1 | | | | 1 | | 2 |
| 7 | కుక్క | | | | | | 1 | | | | 1 |
| 8 | కొక్కు | | | | | | | 1 | 1 | | 2 |
| 9 | కోడి | | | | | | | 1 | | | 1 |
| 10 | కోతి | | | | | | 1 | 1 | | | 2 |
| 11 | గుర్రం | | | 1 | | | | | 1 | 1 | 3 |
| 12 | గువ్వ | | | 2 | | | | | | | 2 |
| 13 | చిలక | 1 | | | 1 | | | | | | 2 |
| 14 | చీమ | | | 1 | | | | 2 | | | 3 |
| 15 | డేగ | | | | | 1 | | | 1 | | 2 |

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 16 నెమలి | 1 | | | | | | | 1 | 1 | 3 |
| 17 నక్క | | | | | | 3 | 1 | | | 4 |
| 18 పంది | | | | 1 | | 1 | | 1 | | 3 |
| 19 పక్కి | | | | 1 | | | | | | 1 |
| 20 పాము | 1 | | | | | | 1 | 2 | | 4 |
| 21 పులి | | | | | 1 | | 1 | 1 | | 3 |
| 22 మేక | | | | | | 1 | 1 | | | 2 |
| | | | | | | | | మొత్తం | | 50 |

## 5 సాంస్కృతిక విశేషాలు

5.0 నెల్లూరుజిల్లాలో గల కులమత సూచకాలైన గ్రామనామాలు భారతదేశ సామాజిక చరిత్రలో సర్వత్రా కన్పించే ఆయావ్యవస్థల స్వరూపాన్ని తెలియజేస్తాయి.

5.1 కులవ్యవస్థ : నెల్లూరుజిల్లాలో చాలా కులాలు కన్పిస్తాయి.

In Nellore the most numerous communities (taking them in the order of their strength) are the Kapus who are mostly land owners (18 per cent) the Malas who are out caste labourers (16 per cent) the Gollas or Shepherds (9 per cent) the Kammas who are closely connected with the Kapus and resemble them in their social customs (9 per cent) the Madigas who are leather workers and out castes (7.5 per cent) the Balijas who are the traders, land owners and shop keepers (7 per cent) the Yanadis (7 per cent) and the Telugu Brahmins (3.7 per cent) all these castes will be described shortly and a brief account will also be given of the few communities like tne Velamas who from an influential section the Komatis and Vysias, the Besthas. Boyas and other fishermen, the Taskalas, Kamsalas and Kummaras who belong to the artisan classes the weavers like the Salis, Devangas and the Togatas and criminal castes like the Yanadi, Yerukalas, Dommaras and Kathiras.

A brief account of the following principal castes like Brahmins, Kapus, Kammas. Velamas Balijas, Aryavysias, occupational castes like Kamsalas, Gamallas, Kummaras, Mangalas, Devangas, Salis, Togatas, Gollas, Fishermen, castes like Pattapus, Besthas, Boyas, Muthraches, Sembadavan, Malas, Madigas, Yanadis, Yerukalas, Donga Yerukalas, Kathiras, Dommaras ...... ... Oddars .. ... Kshatriyas and Rajus ..... are there (Gazetteer of the Nellore District (100-120), APDGN (50-51).

జిల్లా గెజిటీర్లో చెప్పబడిన అంశాలను గ్రామనామాలు సైతం వ్యక్తం చేస్తాయి. కాని ఇందులో గ్రామనామపరంగా మాల, మాదిగ కులాలవారు నివసించే వాడలను చేర్చలేము గ్రామనామపరంగా వాటికి స్వతంత్ర ప్రతిపత్తి లేదు. గ్రామనామ నిఘంటువు గణాల్ని కులంగానే తీసుకోవడం జరిగింది. గణవ్యవస్థను వ్యక్తంచేసే ఎరుకల, కురవ, యానాది గణాల (Tribes) లో ఏర్పడిన గ్రామనామాలు 101 ఉన్నాయి.

నెల్లూరు గ్రామనామాల్లో కులసూచక అనుబంధ గ్రామాలు 341. మొత్తం గ్రామనామాల్లో (2727) వీటిశాతం 12.37% వీటిలో కన్పించే కులాలపేర్లు 54. అవి

ఆచారి (1)  ఆచారి. పార్లపల్లె

ఈడిగ (2)  ఈడిగ. పాలెం, ఈడిగ. మిట్ట

ఉప్పర (4)  ఉప్పర. పల్లె (2 ఆరోపాలు), ఉప్పర. పాలెం (2 ఆరోపాలు)

ఏకరి లే ఏగరి (1)  ఏగర్ల. పాలెం

ఏత లే యాత (1)  ఏతలూరు

ఒడ్డె (41)  ఒడ్డె. కండ్రిగ (3 ఆరోపాలు), ఒడ్డె గుంట, కండ్రిగ, ఒడ్డె. పల్లె (3 ఆరోపాలు) ఒడ్డె. పాలెం (31 ఆరోపాలు)

కంచర (1)  కంచర. పాలెం; కంసల (1) కంసాలి. పాలెం

కబాడి లే కపాడి (1)  కబాడి. పాలెం

కమ్మ (19)  కమ్మ. కండ్రిగ, కమ్మ. పల్లె (2 ఆరోపాలు) కమ్మ. పాలెం (5 ఆరోపాలు), కమ్మవారి. పల్లె (2 ఆరోపాలు), కమ్మవారి. పాలెం (9 ఆరోపాలు)

| | |
|---|---|
| పర్యా. నాయుళ్లు<br>చౌదరి } (19) | నాయుడు చెర్వు. కట్ట, నాయుడు చెర్వు. పాలెం<br>నాయుడు. పేట, నాయుడు. పాలెం (4 ఆరోపాలు),<br>నాయుని. పల్లె, చౌదరి. పాలెం |
| కాపు (2) | కాపు. పాలెం, కాపు. లూరు |
| పర్యా. రెడ్లు (7) | రెడ్డిగారి. కండ్రిగ, రెడ్డి. గుంట (2 ఆరోపాలు) రెడ్డి. పాలెం (3 ఆరోపాలు), రెడ్ల. దిన్నె |
| కుమ్మర (9) | కుమ్మర. గుంట (3 ఆరోపాలు), కుమ్మర. కొండూరు. కుమ్మర. పాలెం (3 ఆరోపాలు) కుమ్మర. పేట, కుమ్మరూరు |
| కూచి (3) | కూచి. పూడి, కూచి. వాడ, కూచివాడ. పాలెం |
| కైకాల (1) | కైకాల. పాలెం |
| కోమటి (3) | కోమటి. గుంట (2 ఆరోపాలు). కోమటి. పేట |
| పర్యా. శెట్టి (2) | శెట్టి. పాలెం, శెట్టి. సముద్రం |
| గమండ్ల (31) | గమండ్ల. పాలెం (30 ఆరోపాలు), గమళ్ల. దిబ్బ |
| గాజుల (2) | గాజుల. పల్లె (2 ఆరోపాలు) |
| గొల్ల (32) | గొల్ల. అగ్రహారం, గొల్ల. కండ్రిగ. గొల్ల. కందుకూరు, గొల్ల. గుంట, గొల్ల. పల్లె (6 ఆరోపాలు). గొల్ల. పేట, గొల్లల. ములుం, గొల్లవాని. గుంట, గొల్లవాని. మిట్ట, గొల్లవారి. తోట, గొల్ల. పాలెం (16 ఆరోపాలు) గోకుల. బృందావనం |
| పర్యా. ద్రేడు (2) | రే. పల్లె, రే. వూరు (చూడు అకారాది నిఘంటువు) |
| చాకల (6) | చాకల. కొండ, చాకల. గుంట, చాకల. పల్లె (2 ఆరోపాలు), చాకల. పాలెం, చాకల, పేట |
| చెంచు (1) | చెంచు. సత్రం; చెంబడి (5) చెంబడి. పాలెం |
| జంగం (10) | జంగం. పల్లె (2 ఆరోపాలు), జంగాల. కండ్రిగ (2 ఆరోపాలు), జంగాల. దొరువు, జంగాల. పల్లె (5 ఆరోపాలు) |
| జక్కుల (1) | జక్కులవాని. పల్లె |
| జాండ్ర (3) | జాండ్ర. పాలెం (2 ఆరోపాలు), జాండ్ర. పేట |

| | |
|---|---|
| జెట్టి (1) | జెట్టి. పాలెం; జోగి (1) జోగి. పల్లె |
| డక్కలి (2) | డక్కలివారి. పాలెం, డక్కలి |
| తంబళ్ల (1) | తంబళ్ల. గుంట |
| తొగట లేక తొగర (1) | తొగరా. మూడి |
| దాసరి (5) | దాసరి. అగ్రహారం, దాసరి. పల్లె (2 ఆరోపాలు) దాసరి. పాలెం, దాసరి. పేట |
| దూదేకుల (1) | దూదేకులవారి. పాలెం |
| దొమ్మర (1) | దొమ్మర. పాలెం |
| నాట్టరు లేక నాడార్ (1) | నాట్టరు. పాలెం |
| నేమురు లేక మేదర (1) | నేమురు. పల్లె |
| పంబలి (1) | పంబలి (పంబ. ఇలి) |
| పట్టపు (11) | పట్టపు. పాలెం (11 ఆరోపాలు) |
| పట్ర (1) | పట్ర. పల్లె |
| పల్లి (35) | పల్లి. ఇండ్లు, పల్లి. పాడు (4 ఆరోపాలు) పల్లిపాటి. దిన్నె, పల్లి. పాలెం (25 ఆరోపాలు). పల్లిపాలెం. కాలువ. పల్లివాండ్ల. చెరువు, పల్లివాళ్ల. దిబ్బ |
| పాదర్తి (2) | పాదర్తి. పాలెం, పాదర్తివారి. కండ్రిగ |
| పెరిక (1) | పెరిక. పాలెం |
| బలిజ (11) | బలిజ పాలెం (10 ఆరోపాలు), బలిజ. పాడు |
| బెస్త (4) | బెస్త. పాలెం (4 ఆరోపాలు) |
| బేరి (2) | బేరి. పేట (2 ఆరోపాలు) |
| బోయ (3) | బోయ. పాలెం, బోయిళ్ల. చిరువెళ్ల, బోయిళ్లవారి. పాలెం |
| బ్రాహ్మణ (5) | బ్రాహ్మణ క్రాక, బ్రాహ్మణ. పల్లి (4 ఆరోపాలు) |
| పర్యా. అయ్యవార్లు (4) | అయ్యవారి. పల్లె, అయ్యవారి. పాలెం, అయ్యవార్ల. కండ్రిగ (2 ఆరోపాలు) |
| భట్రాజులు (5) | భట్టే. పాడు, భట్ల. కనుపూరు, భట్ల. దిన్నె, భట్ల. పాలెం, భట్ర. కాగొల్లు |
| మంగల (5) | మంగల. కండ్రిగ, మంగల. గుంట, మంగల. చెరువు, మంగలవారి. పల్లె, మంగలవారి. పాలెం |

| | |
|---|---|
| ముత్తరాచ (2) | ముత్తరాచ. పల్లె, ముత్తరాచ. పాలెం |
| రాచ (20)<br>వర్మ్యా, రాజ గుక్షత్రియ | రాచ. పాలెం (4 ఆరోపాలు), రాచవారి. పల్లె, రాచర్ల. పాడు, రాజు. పాలెం (12 ఆరోపాలు) రాజుపాలెం. డొంక, రాజుల. పాడు |
| వడ్ల (4) | వడ్ల. పూడి, వడ్లమూడి. పల్లె, వడ్లవాని. పల్లె, వడ్లవారి. పల్లె |
| వెలం (4) | వెలం. పల్లె (3 ఆరోపాలు), వెలం. పాలెం, వెలమవారి. దిన్నె |
| వేటగిరి (1) | వేటగిరి. పాలెం |
| సాతాని (2) | సాతాని. పల్లె, సాతానివారి. పాలెం |
| సాలె (2) | సాలె. పేట, సాలె. పాలెం |

వీటి పరిశీలన వల్ల ఈ జిల్లాలో ఒడ్డె, పల్లి, గొల్ల, గమండ్ల, కమ్మ, రాచ, పట్టపు, బలిజ, జంగం, కాపు కులాలు అనుబంధంగా గల గ్రామనామాలెక్కువ. (చూడు. పట్టిక) ఒడ్డె, ఉప్పర, బోయ కులాలు చెరువులు, మట్టిపని చేసేవాళ్లగా కన్పిస్తారు. ఒడ్డెకుల వ్యక్తి నామానుబంధం బోయడు. ఈడిగ, ఏత, గమండ్ల కులాలు కల్లు గీచే వృత్తిగలవారుగా కన్పిస్తారు. ఇంక ఈ జిల్లాలో కంచర, కబాడి, కూచి, కైకాల, శెట్టి, దక్కల, నాడార్, పట్ర, వడ్ల, వెలం కులాలున్నట్లు గ్రామనామాలవల్ల తెలుస్తుంది. ఈ జిల్లాలో ప్రధాన కులాలు కాపు, కమ్మ, బలిజ, వెలమలకంటె ఇతర కులాలెక్కువ. కాపు కంటె కమ్మ అనుబంధంగా గల గ్రామాలెక్కువ. కాబట్టి ఈ జిల్లాను ఎన్నికల్లో రిజర్వుడు స్థానంగా చేసి యున్నారు.

మొత్తం కులసూచక గ్రామాల్లో (341) కొన్ని కులాల శాతం

| | | | |
|---|---|---|---|
| ఒడ్డె (41): | 12.02% | రాచ (20): | 5.86% |
| పల్లి (34): | 9.97% | పట్టపు (11): | 3.22% |
| గొల్ల (32): | 9.38% | బలిజ (11): | 3.22% |
| గమండ్ల (31): | 9.09% | జంగం (10): | 2. 93% |
| కమ్మ (28): | 8.21% | కాపు (9): | 2.63% |

గణసూచక గ్రామాలు :

| | |
|---|---|
| ఎరుకల (3) | ఎరుకల. కాల్వ, ఎరుకల. పాలెం (2 ఆరోపాలు) |
| కురవ (1) | కురవవాని. పల్లె |
| యానాది (97) | యానాది. ఇండ్లు (18 ఆరోపాలు) యానాది. కాలనీ (3ఆరోపాలు) యానాది. కాల్వ, యానాది. గుడిశెలు (5 ఆరోపాలు), యానాది. దిబ్బ, యానాది. పల్లె (5 ఆరోపాలు) యానాది. పాలెం (50 ఆరోపాలు) యానాది సంఘం (13 ఆరోపాలు) యానాది, సెంటర్ |

ఇందులో ఎరుకల, కురవ తమిళ మాండలిక పర్వత గణాలు (Hill tribes). ఈ జిల్లాయందు యానాదుల ప్రాబల్యం ఎక్కువని తెలుస్తుంది. ఒక్క ఉదయగిరి తాలూకాలో తప్ప అన్ని తాలూకాల్లో యానాదుల ఉనికి కన్పిస్తుంది. (చూడు. పట్టిక. 2) యానాదులు రెండు రకాలు. తెలుగు యానాదులు, తమిళ యానాదులు. వీరి నివాసస్థానం శ్రీహరికోట. యానాది అనుబంధంగా గల గ్రామాలు నెల్లూరు, కావలి తాలూకాల్లో ఎక్కువ (చూడు. పట్టిక. 2) జిల్లా జనాభాలో గిరి జనులు 8.1% ఉన్నారు. రాష్ట్రంలో గిరిజన జనాభా ఎక్కువ కల్గిన జిల్లాలలో నెల్లూరు ఐదవది. ఈ జిల్లాలో 14 తెగలలో 1,30,277 మంది గిరిజనులున్నారు. ఇందు ప్రధాన తెగలు యానాది (1,18,601), ఎరుకలు (10,121). మిగిలిన తెగల జనాభా చాలా తక్కువగా ఉంది. దీన్నిబట్టి గ్రామనామాల్లోలాగే ఈ జిల్లా గిరిజన జనాభాలో యానాదులు సంఖ్య ఎక్కువ. వీరు ఎక్కువ భాగం వ్యవసాయ కూలీలుగా మట్టిపని చేసేవారుగా జీవిస్తున్నారు. మిగిలిన తెగలవారు పందులు పెంచేవారుగా, తట్టలు బుట్టలు అల్లేవారుగా, పొలాల కాపలావార్లుగా జీవిస్తున్నారు. యానాదులు కాలనీలుగా ఇండ్లుకట్టుకొని ఉంటారు. మిగిలిన తెగల వారు గుడిసెలలో అక్కడక్కడ నివసిస్తున్నారు. [APDGN (51-52)]

మొత్తం గ్రామనామాల్లో (2727) గణసూచక
గ్రామాల శాతం : 3.66%
గణసూచక గ్రామాల్లో (101) యానాది
గ్రామాల శాతం : 96.03%

కులాలపేర్లున్న నామబంధాలుండే గ్రామనామ ద్వితీయావయవాలపై విశేషణ సూచకాలు చేరిన మరికొన్ని గ్రామనామాలను ఇందులో చేర్చలేదు. అవి కొత్త. గమండ్లపాలెం, కొత్త.గొల్లపాలెం, దిగువ.రాజుపాలెం, పెద్ద.పట్టపు పాలెం మొదలైనవి. నెల్లూరు గ్రామనామాల ప్రథమావయవాల్లో కన్పించే హిందూ వ్యక్తి నామాల కులసూచకానుబంధాలు (caste markers) కొన్ని ఉన్నాయి. అవి -ఆచారి, -చౌదరి, -నాయుడు ౧ సేని, భట్టు, -రాజు, -రావు, -రెడ్డి, -శాస్త్రి, -శెట్టి, -సోమయాజి మొదలగునవి. వీటిని బట్టి కూడా కులాల వ్యాప్తి కొంత తెలుస్తుంది.

కులసూచకానుబంధాలు గల వ్యక్తి నామాలతో ఏర్పడ్డ గ్రామాలు :

-రెడ్డి, (63), -రాజు (14), -నాయుడు (22), రావు (9), -భట్టు (6). -శెట్టి (3), -ఆచారి (2), -చౌదరి (1), -శాస్త్రి(1)

5.2 కుటుంబ నామాలు : నెల్లూరు గ్రామనామాల్లో కన్పించే కుటుంబ నామాలు (270). మొత్తం గ్రామనామాల్లో వీటిశాతం 9.8% గ్రామనామ ప్రథమావయవాల్లో కన్పించే కుటుంబనామాలను అర్థదృష్ట్యా కొన్ని వర్గాలుగా విభజించవచ్చు. అవి-

(అ) వ్యక్తి నామ సూచకాలు ;

ఉదా : మాచిరెడ్డివారి. తోపు, ధూర్జటివారి. కండ్రిక, అనంతబొట్లవారి. కండ్రిగ మొదలగునవి.

(ఆ) గ్రామనామ సూచకాలు :

ఉదా : మాచెర్లవారి. పాలెం, మద్దూరు. పాడు, మన్నేరి అగ్రహారం, కోవూరివారి. దిబ్బ మొదలగునవి.

(ఇ) స్థలనామ సూచకాలు : ఉదా : వరికొండవారి.

(ఈ) నైసర్గిక సూచకాలు :

ఉదా : మన్నెంవారి. పల్లె, మన్నే. గుంట మొదలగునవి.

(ఉ) జంతు సూచకాలు :

ఉదా : ఉడతావారి. పార్లపల్లె, ఉడతావారి. పాలెం కోడి. వాక, ఆవులవారి. పల్లె మొదలగునవి.

(ఊ) వృక్ష సూచకాలు :

ఉదా : కంభులవారి. పల్లె, మామిడి. పూడి, మామిళ్ల. వొర్వు మొ॥

(ఎ) ఆహార సూచకాలు :

ఉదా : చల్లావారి. పల్లె, చల్ల. గిరిగల మొదలగునవి

(ఏ) పరిపాలనా సూచకాలు :

ఉదా : దొరవారి. సత్రం, దొరవారి. పాలెం మొదలగునవి

5 3 మతం : నెల్లూరుజిల్లాలో ప్రధానమైన మతాలు హిందూమతం, ఇస్లాంమతం, క్రైస్తవమతం. హిందూమతం భారతదేశంలో ప్రధానమైన మతం. విదేశపరిపాలకుల వల్ల వచ్చిన మతాలు ఇస్లాం, క్రైస్తవ లేక క్రిష్టియన్ మతాలు. హిందూమతంలోని తిరుగుబాటు వర్గం వల్ల బౌద్ధ, జైనమతాలు పుట్టుకొచ్చాయి. పాడు అనుబంధంగా గల గ్రామాలు జైనమత సూచకాలని ఒక వాదం ఉంది. జైనమతంతో పోల్చితే బౌద్ధమత వ్యాప్తి దక్షిణభారతదేశ గ్రామనామాలపైన చాలతక్కువ. ఈ రెండుమతాల్ని అధిగమించి హిందూమతం వ్యాప్తిచెందింది.

16 వ. శ. నుండి ఇస్లాంమత ప్రభావం దక్షిణానికి వ్యాప్తి చెందింది. విజయనగర సామ్రాజ్య పతనానంతరం ఈ జిల్లా గోల్కొండ నవాబుల వశమైంది. గోల్కొండ రాజ్య పతనానంతరం 1753 లో ఈ జిల్లా ఆర్కాటు నవాబుల పరిపాలన కిందికి వచ్చింది. నవాబులు అధికారంలోకి రాగానే వీరిఅధికారం, మతం ప్రాబల్యంలోకి వచ్చాయి. గ్రామనామాలను బట్టి చూస్తే ఇస్లాంమత ప్రభావం ఎంత వరకు ఉందో తెలుస్తుంది. కడప జిల్లాతో పోలిస్తే నెల్లూరుజిల్లాలో ముస్లింలు తక్కువ.

18 వ శతాబ్దంలో క్రైస్తవమతం నెల్లూరుజిల్లాలో ప్రవేశ పెట్టబడింది. గూడూరు ప్రాంతంలో జర్మన్‌లూథరన్‌వారు, నెల్లూరులో అమెరికన్ బాప్టిస్టు వారు కేంద్రాలు నెలకొల్పి మతప్రచారం గావించారు. మతవిషయాలను ప్రజలకు తెలపడానికి వీళ్లు విద్యాసంస్థలు నెలకొల్పారు. అందువల్లనే నెల్లూరుజిల్లాలో మిషనరీలచే స్థాపించబడిన పాఠశాలలెక్కువ. నెల్లూరు క్రైస్తవ సంఘాల్లో ముఖ్యమైనవి బాప్టిస్టు, లూథరన్, కాథలిక్ సంఘాలు మొత్తంమీద నెల్లూరు జిల్లాలో ప్రతిగ్రామంలో ఏదోఒక క్రైస్తవ సంఘం ఉంది. నెల్లూరుజిల్లాలో

గూడూరు, సూళ్లూరుపేట తాలూకాలలో తప్ప అన్ని తాలూకాల్లో బాప్టిస్టు సంఘాలున్నాయి. నెల్లూరు పట్టణంలోని సుబేదారుపేటలో 1844లో బాప్టిస్టు సంఘం స్థాపించ బడింది. ఈ జిల్లా గెజిటీరు ప్రకారం హిందూవులు 17,78,057 మంది, మహమ్మదీయులు 1,54,003 మంది, క్రైస్తవులు 1,01, 417 మంది. జైనులు 186 మంది. బౌద్ధులు 2 మంది (APDGN 238)

నెల్లూరుజిల్లా గ్రామనామాలను మతానికి సంబంధించి ఈ కింది రకాలుగా వర్గీకరించవచ్చు.

(అ) హిందూమత సూచక గ్రామనామాలు

(ఆ) జైనమత సూచక గ్రామనామాలు

(ఇ) బౌద్ధమత సూచక గ్రామనామాలు

(ఈ) ఇస్లాంమత సూచక గ్రామనామాలు

(ఉ) క్రైస్తవ మత సూచక గ్రామనామాలు

హిందూ మతసూచక గ్రామనామాలు : ఈ జిల్లాలో హిందువుల సంఖ్య నూటికి తొంభై శాతం అని తెలుస్తుంది. అందువల్లనే వ్యక్తి నామసూచకాలు, గ్రామనామాలు ఎక్కువగా హిందూ దేవతల పేర్లమీదనే కన్పిస్తాయి. ద్రావిడ దేవతల పేర్లతో ఏర్పడిన గ్రామాలు కూడా కొన్ని కన్పిస్తాయి.

ఉదా : ఈశ్వరమ్మ. మఠం, వెంకటరెడ్డి. పల్లె, లక్ష్మక్క. కండ్రిగ, అంకిరెడ్డి. పల్లె, వెంకట. గిరి, లక్ష్మి. పురం, అక్క సముద్రం, అంబా. పురం, అక్కం. పేట

10, 11, 12 శతాబ్దాల్లో శైవ వైష్ణవ మతాధిక్యతవల్ల గ్రామనామాల్లో హిందూమత శాఖల ప్రభావం వ్యక్తమవుతుంది.

(అ) శైవమత సూచకాలు : జంగాల. పల్లె, తంబళ్ల. గుంట, తమ్మిన. పట్నం, వీర్ల. గునుపాడు, విరు. వూరు మొదలగునవి.

(ఆ) వైష్ణవ మత సూచకాలు : వెంకట. గిరి, శంఖ. వరం, రంగ నాయకుల. పేట మొదలగునవి.

జైనమతసూచక గ్రామనామాలు : నెల్లూరుజిల్లాలో జైనమత ప్రభావం ఉందన డానికి కొన్ని గ్రామనామాలు ఆధారం. జైనమత ప్రభావం తెల్పే కొన్ని గ్రామనామాలు కన్పిస్తాయి.

ఉదా : జొన్న వాడ, పురిణి, ఉచ్చలపాటి. దిబ్బ మొ॥

జొన్నవాడ : నెల్లూరుకు 15 మైళ్ళ దూరంలో జొన్నవాడ గ్రామముంది. ఇక్కడ కామాక్షీదేవి ఆలయముంది. పూర్వమిచ్చట జైనమతం వెలసినట్లు తరువాత ఇది వీరశైవ మత ప్రాభవానికి లోనైనట్లు హేతువులు కలవు. (సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం, సం. 5. పు-327)

పురిణి : ఒకప్పుడు ఈ పల్లెకు దక్షిణాన పురిణమ్మ అనే గ్రామదేవత దుష్ట శక్తులనుండి కాపాడినందున పురిణి అని పేరు వచ్చినదట. ఈ ప్రాంతంలో జైనప్రతిమలు బయల్పడటం వల్ల ఈ ప్రాంతం జైనుల కేంద్రంగా ఉండేదని స్థానిక చరిత్ర (Co FF. 163) పురిణమ్మ జైనమత దేవత ఏమో !

బౌద్ధమత సూచకాలు : ఈ జిల్లాలో బౌద్ధమత ప్రభావం తెలిపే కొన్ని గ్రామ నామాలు కన్పిస్తాయి.

ఉదా : బూద. వాడ, బూదనం, బొజ్జన. పల్లె మొ॥

క్రమంగా బౌద్ధ. జైనమతాలు క్షీణించి హిందూ మతమే ఉచ్ఛస్థితిలోకి వచ్చింది. హరిహరాద్వైతాన్ని ప్రతిపాదించిన కవిబ్రహ్మ తిక్కన ఈ జిల్లా వాడే. శైవ, వైష్ణవ మతాలకు ప్రతీకగా ఇప్పటికీ నెల్లూరులో రంగనాయకుల స్వామి దేవాలయం, మూలస్థానేశ్వరాలయం ఉన్నాయి.

ఇస్లాం మత సూచకాలు : నెల్లూరు మండలం గోల్కొండ నవాబుల అధికారం కింద 17వ శతాబ్దిలో ఉన్నట్లు ఆధారాలున్నాయి. The invasion that had any impact on this district was that of the Sultan of Golkonda Abdullah Qutb Shah (A.D. 1626 – 72) under-taken in A D. 1642. (APDGN. 34) అప్పటి నుండి ఇస్లాం మత వ్యాప్తి, జాతివ్యాప్తి, భాషావ్యాప్తి జరిగినట్లు తెలుస్తుంది. మహమ్మదీయుల ప్రభావం ఈ కింది గ్రామనామాలు, వ్యక్తినామాలు వ్యక్తపరుస్తాయి. నెల్లూరు జిల్లాలో ఇస్లాం మత సూచక గ్రామాలు 16. అవి తురక.పాలెం (14 ఆరోపాలు) మహమ్మదీయ.పాలెం (2 ఆరోపాలు).

గ్రామనామాల్లో కన్పించే మహమ్మదీయ వ్యక్తి నామాలు :

అక్బర్- ఆక్బరాబాదు (అక్బర్. ఆబాదు)
అబ్బాసాహెబ్- అబ్బాసాహెబ్. పేట, అబ్బిసాహెబ్. పేట,
అల్లీ- అల్లీ. పురం
ఖాదర్ నవాజ్ ఖాన్- ఖాదర్ నవాజ్ ఖాన్. పేట; ఖాదర్- ఖాదర్. పూర్
ఖాన్ సాహెబ్- ఖాన్ సాహెబ్. పేట
ఖాసింఖాన్- ఖాసింఖాన్. కండ్రిగ
జాఫర్ సాహెబ్- జాఫర్ సాహెబ్. కాలువగట్టు
నబీ- నబీ. నగరం; సేకునాం- సేకునాం. పేట
పత్తేఖాన్- పత్తేఖాన్. పేట
పాదుషా ౧ బాదుషా- బాదుషా. పేట; బురాన్- బురాన్. పూరు
మస్తాన్- మస్తా. పురం; మహమ్మద్- మహమ్మదా.పురం
ముస్తా (ముస్తఫా)- ముస్తా. పురం; మొహిద్దీన్ ఖాన్- మొహిద్దీన్ ఖాన్ పేట
లాలా- లాలా. తోట, లాలా. పేట
సాహెబ్- సాహెబ్. పాళెం; సైదాపు (సయ్యదాదు)- సైదాదు. పల్లె
సైదా (సయ్యద్)- సైదా. పురం; హబిబుల్లా- హబిబుల్లా. పేట
హసన్- హసనా. పురం; హుసేన్- హుసేన్. నగరం

ఈ వ్యక్తి నామాలన్నీ మహమ్మదీయులవల్ల నెల్లూరు గ్రామనామాల్లో ప్రవేశించినవని చెప్పవచ్చు.

క్రైస్తవమత సూచకాలు: నెల్లూరుజిల్లాలో క్రైస్తవమత సూచక గ్రామనామాలు 6 ఉన్నాయి.

క్రిష్టియన్. పాలెం, క్రీస్తు. పాలెం, క్రైస్తవ. పాలెం (4 ఆరోపాలు)

బ్రిటిషు పరిపాలకుల పేర్లతో ఏర్పడిన గ్రామనామాలు కూడా కొన్ని కన్పిస్తాయి.

ఉదా : ఉడ్ హౌస్. పేట మాక్లీన్. పేట స్టోన్ హౌస్. పేట

పై గ్రామనామాల్లో కన్పించు A.C. Wood House [(1926-29) 1930-31, 1934-37], C.D. Macleane (1887-93), T.V. Stone House (1835-44) ప్రాంతాల్లో ఈ జిల్లా కలెక్టర్లు.

ఆంగ్లేయుల పేర్లతో ఏర్పడిన గ్రామనామాలు :

ఉదా : జేమ్సు. తోట, డేవిడ్. పేట, జోసఫ్. పేట మొదలగునవి.

5.4 వాస్తుసూచకాలు: వాస్తు, దుర్గ సూచకాలైన గ్రామాలు, గ్రామ నామ ద్వితీయావయవాలు ఈ జిల్లాలోని వాస్తు విశేషాల్ని వ్యక్తపరుస్తాయి.

ఉదా : కోట, కోట. అడవి, కొట్టాల. పల్లె, గుడివల్లె. పాడు, గుడి. నరవ మొదలగునవి.

వాస్తుసూచక ద్వితీయావయవమైన - దుర్గం అనుబంధంగా గల గ్రామం ఒకటే కన్పిస్తుంది. ఉదా : ఉదయగిరి. దుర్గం

5.5 దేశవిభాగ సూచకాలు : దేశ విభాగ సూచకాలైన కొన్ని గ్రామ నామాలు అప్పటి మండల విభాగాన్ని సూచిస్తాయి.

ఉదా : వే.నాడు, పేర్నాడు (పేర్. నాడు)

5.6 సంఘటన సూచకాలు : ఒక సంఘటనను ఆధారంగా చేసుకొని ఏర్పడిన గ్రామాలివి.

ఉదా : ఆకలి. వలస, నాటకాల. దిబ్బ, స్వాతంత్ర. పురం మొదలగునవి

5.7 విశేషాలు : గ్రామనామాల్లో సాంస్కృతిక విశేషాల పరిశీలన వల్ల కులవ్యవస్థ, హిందూమతాధిక్యం తెలుస్తాయి. జైన, బౌద్ధ మతాల వ్యాప్తి తెలుస్తుంది. ఈ జిల్లా గ్రామనామాలను 'ఆర్కియాలాజికల్ సర్వే' వాళ్ల ఆధారం చేసుకొని అయాప్రాంతాల్లో త్రవ్వకాలు జరిపితే ఎన్నో జైన, బౌద్ధ స్థావరాలు బయటపడవచ్చు.

పట్టికలు : 1 కులసూచకగ్రామనామాలు. 2 గణసూచకగ్రామనామాలు,

కుల సూచక ప్రథమావయవ గ్రామనామాల పట్టిక

| | గ్రామనామ ప్రథమావయవ | ఉదయ | కావలి | కోవూరు | ఆత్మకూరు | రాపూరు | నెల్లూరు | గూడూరు | సూళ్లూరు | వెంకట | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 1 | ఆచారి | | | | | | | 1 | | | 1 |
| 2 | ఈడిగ | | | | 1 | | 1 | | | | |
| 3 | ఉప్పర | | | | | | 2 | | | 2 | 4 |
| 4 | ఏకరి | | | | | | 1 | | | | 1 |
| 5 | ఏత | | | | | | | | | 1 | 1 |
| 6 | ఒడ్డె | 3 | 5 | 8 | 5 | | 6 | 6 | 5 | 3 | 41 |
| 7 | కంచర | | | 1 | | | | | | | 1 |
| 8 | కంసల | | 1 | | | | | | | | 1 |
| 9 | కపాడి లేక కబాడి | | | | | | 1 | | | | 1 |
| 10 | కమ్మ లేక నాయుడు | 3 | 6 | 4 | 2 | 2 | 1 | 3 | 3 | 4 | 28 |
| 11 | కాపు లేక రెడ్లు | 1 | 2 | 1 | 1 | | | 4 | | | 9 |
| 12 | కుమ్మర | | 2 | 1 | 1 | | 2 | | 1 | 2 | 9 |
| 13 | కూచి | | | | | | | 3 | | | 3 |
| 14 | కైకాల | | | | | | | | 1 | | 1 |
| 15 | కోమటి లేక శెట్టి | 1 | 3 | | | | 1 | | | | 5 |
| 16 | గమండ్ల | 3 | 5 | 3 | | | 19 | 1 | | | 31 |
| 17 | గాజుల | | | | | | 1 | | | 1 | 2 |
| 18 | గొల్ల | 2 | 4 | 3 | 5 | 1 | 6 | 4 | 6 | 3 | 34 |
| 19 | చాకల | 1 | | 1 | 1 | | | | | 3 | 6 |
| 20 | చెంచు | | | | | | | | 1 | | 1 |
| 21 | చెంబడి | | | 2 | | | | 2 | 1 | | 5 |
| 22 | జంగం | 1 | | 2 | 3 | | 2 | | 1 | 1 | 10 |
| 23 | జక్కుల | | | | | | | 1 | | | 1 |

| | | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 24 | జాండ్ర | | | 1 | | | 1 | 1 | | | 3 |
| 25 | జెట్టి | | | | | | | | | 1 | 1 |
| 26 | జోగి | | | | | 1 | | | | | 1 |
| 27 | డక్కల | | | | | | 1 | | | 1 | 2 |
| 28 | తంబళ్ల | | 1 | | | | | | | | 1 |
| 29 | తొగట | | | | | | | | 1 | | 1 |
| 30 | దాసరి | 1 | 1 | 2 | | 1 | | | | | 5 |
| 31 | దూదేకుల | | 1 | | | | | | | | 1 |
| 32 | దొమ్మర | | | 1 | | | | | | | 1 |
| 33 | నాట్టరు | | | | | | | | 1 | | 1 |
| 34 | నేదురు ఌ మేదర | | | | 1 | | | | | | 1 |
| 35 | పంబల | | | | | | 1 | | | | 1 |
| 36 | పట్టపు | | | 2 | | | 7 | 2 | | | 11 |
| 37 | పట్ర | | | | | | | | | 1 | 1 |
| 38 | పల్లి | | 4 | 11 | 2 | | 12 | 2 | 2 | 1 | 34 |
| 39 | పాదర్తి | | | | | | 1 | | 1 | | 2 |
| 40 | పెరిక | | 1 | | | | | | | | 1 |
| 41 | బలిజ | 1 | 3 | 3 | | | 3 | | | 1 | 11 |
| 42 | బెస్త | | | 1 | | | 1 | 1 | | 1 | 4 |
| 43 | బేరి | | | | | | | | 2 | | 2 |
| 44 | బోయ | | 1 | | 1 | | 1 | | | | 3 |
| 45 | బ్రాహ్మణ ఌ అయ్యవార్లు | 1+1 | 1 | 2+1 | | | 1 | 1+1 | | | 9 |
| 46 | భట్రాజులు | | 1 | 1 | 1 | | 1 | | | 1 | 5 |
| 47 | మంగల | | | 1 | | | 2 | 1 | 1 | | 5 |
| 48 | ముత్తరాచ | 1 | | | | | 1 | | | | 2 |
| 49 | రాచ ఌ రాజు | 3 | 1 | 3 | 1 | 2 | 2 | 3 | 5 | | 20 |
| 50 | వడ్ల | 1 | | | 1 | 1 | | 1 | | | 4 |
| 51 | వెలం | | | | | | 1 | | | 4 | 5 |
| 52 | వేటగిరి | | | | | | | | 1 | | 1 |

| | | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 53 | సాతాని | 1 | | | 1 | | | | | | 2 |
| 54 | సాతె | | | 1 | | | 1 | | | | 2 |
| | | | | | | | | | | మొత్తం | 341 |

గణసూచక ప్రథమావయవ గ్రామనామాల పట్టిక

| | | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ఎరుకల | | | | | | 3 | | | | 3 |
| 2 | కురవ | 1 | | | | | | | | | 1 |
| 3 | యానాది | | 16 | 22 | 6 | 2 | 33 | 7 | 8 | 3 | 97 |
| | | | | | | | | | | మొత్తం | 101 |

## 6 చారిత్రక విశేషాలు

6.0 గ్రామనామాల పరిశీలన చరిత్ర నిర్మాణానికి తోడ్పడుతుంది. వివిధ జాతులెంతవరకు దేశంలో పలుకుబడి సంపాదించాయో తెలుసుకోవచ్చు. దేశచరిత్ర పాలకుల జీవితాలను బట్టి రచింపబడుతుంది. కాని గ్రామనామాల్ని బట్టి చూస్తే పాలకులు కాకుండా జనులలో పేరు పెంపులు గల్గిన మహనీయులెందరో ఉండేవారని పాలకుల పేర్లవలె వారి పేర్లుగూడా గ్రామనామాలుగా నిలిచి పోయాయని తెలుస్తుంది. ఈ పరిశీలన వల్ల ప్రఖ్యాతి చెందిన వ్యక్తుల వంశాల చరిత్ర కొంతవరకు తెలుసుకోవచ్చు.

6.1 నెల్లూరు గ్రామనామాల ప్రథమావయవాల్లో కన్పించే వ్యక్తినామ, కుటుంబనామ, బిరుదనామ సూచకాలు పరిశీలించినపుడు స్థానిక చరిత్రలో ఆయా వ్యక్తుల, వంశాల, పరిపాలకుల ప్రభావం కొంత అర్థమవుతుంది. కొంత మంది జమీందార్ల పేర్లతో ఏర్పడిన గ్రామనామాలుకూడా కన్పిస్తాయి. దీని నాధారంగా చేసుకొని గ్రామనామాలను మూడు రకాలుగా విభజించవచ్చు.

(అ) వ్యక్తినామ సూచకాలు (ఆ) కుటుంబనామ సూచకాలు

(ఇ) బిరుదనామ సూచకాలు

6.2 వ్యక్తినామ సూచకాలు : నెల్లూరుజిల్లా గ్రామనామాల్లో వ్యక్తి నామ సూచకాలు గల గ్రామనామాలు 596. వీటిలో పురుషనామ సూచకాలు 525, స్త్రీనామ సూచకాలు 71. వీటిని పరిశీలిస్తే గ్రామ నిర్మాణానికి శ్రీకారం చుట్టిన వ్యక్తుల పేర్లతో కొన్ని కన్పిస్తాయి. కీర్తి కాంక్షగల పాలకులు తటాక, గ్రామనిర్మాణం చేసి తమ పేర్లు పెట్టుకొన్న గ్రామాలు కొన్ని కన్పిస్తాయి. పరిపాలకులనుండి గౌరవసూచకంగా గ్రామాలనుపొంది తమ పేర్లతో వ్యవహ రించుకొన్న కొన్ని గ్రామాలు కూడా కన్పిస్తాయి. ఈ గ్రామాలకు చెందిన స్థానిక చరిత్ర మెకంజీ కైఫియత్తులవల్ల కొంత లభ్యమవుతుంది.

ఉదా : బుచ్చిరెడ్డి పాలెం, మహిమలూరు, అనంత. సాగరం, నాగ మాంబా. పురం, చిట్టయ. పాలెం, ఉరఫ్. మినగల్లు, లక్కరాజు. పాలెం మొదలగునవి. (వివరాలకు చూడు. అకారాది నిఘంటువు)

6.3 కుటుంబనామ సూచకాలు : నెల్లూరుజిల్లా గ్రామనామాల్లో కన్పించే కుటుంబనామాలు 270. వీటిలో గ్రామ నిర్మాణానికి తోడ్పడిన కుటుంబాల పేర్లతో ఏర్పడినవి కొన్ని కన్పిస్తాయి. వ్యక్తినామాలే కుటుంబ నామాలుగా గ్రామనామాల్లో కన్పిస్తాయి. గ్రామనామాల్లో కన్పించే ఇంటిపేర్లు గలవాళ్ల ఇపుడా గ్రామంలో లేకపోయినా వారిపేర్లతో గ్రామాలుండటం వారి యశస్సుకు, కుటుంబాల ప్రాముఖ్యతకు తార్కాణం.

ఉదా : ఉడతావారి. పాలెం, ఉడతావారి. పార్లపల్లె, ధూర్జటివారి. కండ్రిగ, గంగులవారి. అయ్యవారిపల్లె, గంగులవారి. చెర్లోపల్లె, గంగులవారి. చెరువుపల్లె, గంగులవారి. ఏకూరుపల్లె, ఆవులవారి. పల్లె, కందులవారి. పాలెం, చల్లావారి. పాలెం మొదలగునవి.

వీటిలో కొన్ని కుటుంబ నామాల పరిశీలన :

ఉడతావారి పాలెం : "గోల్కొండ నవాబు తలమీదికెక్కిన ఉడుతను హస్త లాఘవంతో పడగొట్టిన నవాబు మన్ననలు పొందిన లింగమనాయుడను మూల పురుషునితో ఈ కుటుంబ చరిత్ర ప్రారంభమగును". (వి. మం. స. పుట-86) ఈ విధంగా వీరికి ఉడతావారని ఇంటిపేరు ఏర్పడి ఉండవచ్చు.

ధూర్జటివారి కండ్రిగ : "ఈ అగ్రహారీకులు ధూర్జటివారు అనే కవీశ్వరులు సాంప్రదాయంవారు". (మెకం. 354, 252) బహుశా ధూర్జటి కవీశ్వరుని కుటుంబీకులవల్ల ఏర్పడిన గ్రామమై ఉండవచ్చు. గంగులవారి. అయ్యావారిపల్లె, గంగులవారి. చెర్లోపల్లె, గంగులవారి. చెరువుపల్లె, గంగులవారి. దేకూరుపల్లె... ఈ నాలుగు గ్రామాల చరిత్రను పరిశీలిస్తే గంగుల గురవయ్య ఈ గ్రామాలకు అచ్చు కావల్‌గారు అనగా దుర్గరక్షణాధికారిగా వుండేవారు. ఇతణ్ణి నియమించిన వాడు మీర్‌జుమ్లా. ఢిల్లీ చక్రవర్తి ఉత్తరువుపైన పైగ్రామాలు ఇతనికి ఇవ్వబడ్డాయి. (వివరాలకు వి. మం. స. పు-88)

6.4 బిరుద సూచికాలు : గొప్ప పరిపాలకులపేర్లతో లేక బిరుద సూచకాలతో ఏర్పడిన కొన్ని గ్రామాలు కనిపిస్తాయి. దీనివల్ల ఈ మండలం పై ఆ పరిపాలకుల ప్రభావం తెలుస్తుంది.

ఉదా : తెలుగురాయ. పురం, దేవరాయ. పల్లె, తిరుమలరాయ. గుంజ, పండ్రంగం మొదలగునవి.

ఇందులో మొదటి మూడు గ్రామాలు క్రిష్ణదేవరాయలు, తిరుమలరాయల వల్ల ఏర్పడి ఉండవచ్చునని చెప్పవచ్చు. పండ్రంగం- గుణగవిజయాదిత్యుని సేనాని పండరంగుడు వల్ల ఏర్పడినట్లు చారిత్రకాధారాలున్నాయి. (చూడు. అకారాది నిఘంటువు)

ఏ రకమైన గ్రంథస్థ సాక్ష్యాలు, శాసనాధారాలు లభించని గ్రామనామాల్లో వ్యక్తులెప్పటివారో, కుటుంబాలెప్పటివో నిర్ణయించడం కష్టం.

ఉదా : పల్లవోలు, పల్లమాల, బల్లవోలు- ఈ గ్రామనామాలను బట్టి స్థూలంగా ఇవి పల్లవ వంశం పేరుతో ఏర్పడ్డాయని చెప్పవచ్చు. క్రీ.శ. 3వ శతాబ్దినుండి 10వ శతాబ్ది వరకు నెల్లూరుజిల్లా పల్లవరాజుల పరిపాలనలో ఉన్నట్లు చరిత్ర (APDGN. 16-18)

6.5 జమీందార్ల పేర్లతో ఏర్పడిన గ్రామనామాలు : నెల్లూరుజిల్లాలో వ్యక్తి నామాలతో ఏర్పడిన గ్రామానామాలు ప్రత్యేక పరిశీలనార్హమైనవి. చారిత్రకాధారాలు లభ్యమైనమేరకు వీటిని వివరించడం జరిగింది. నెల్లూరుజిల్లాలో జమీందార్ల పేర్లతో ఏర్పడిన కొన్ని గ్రామనామాలు కన్పిస్తాయి. ఈ జిల్లాలోని ముఖ్యమైన జమీందారీలు ఉదయగిరి, ముత్యాలపాడు, వెంకటగిరి, సైదాపురం మొదలగునవి. ఈ జమీందారీల చరిత్రను పరిశీలిస్తే ఒక్క వెంకటగిరి సంస్థానకుల పేర్లతో ఏర్పడ్డ గ్రామనామాలు మాత్రమే కన్పిస్తున్నాయి. ఈ జిల్లా జమీందార్లలో అగ్రపీఠం అలంకరించినవారు, రాజ బిరుదాంకితులు వెంకటగిరి సంస్థానాధీశులు. వెంకటగిరి నెల్లూరు నైరుతి దిశగా 50 మైళ్ల దూరంలో ఉంది. వెంకటగిరి పరిపాలకులైన వెలుగోటివారు వెలమలు. వీరి పూర్వులు కాకతీయుల కాలం నుండి ఆయా సామ్రాజ్యాధి పతులను సేవించినట్లు 'వెలుగోటివారి వంశావళి' అనుగ్రంథం పేర్కొంటూఉంది. ఈ వంశీయులు దానధర్మాలకు, శౌర్య పరాక్రమాలకు పేరొందినవారు. వీరి వంశవృక్షం పరిశీలిస్తే గ్రామనామాలకు సంబంధించిన కొత్త విషయాలెన్నో తెలుస్తాయి. ఈ మహనీయుల పేర్లతో ఏర్పడిన గ్రామనామాలు వెంకటగిరి తాలూకాలో వారి యశస్సుకు, దానధర్మాలకు ప్రతీకలుగా ఉన్నాయి.

## వంశవృక్షం



1. చెవిరెడ్డి
2. దామానాయుడు
ప్రసాదిత్యనాయుడు
3. వెన్నమనాయుడు
4. ఎఱ్ఱదాచమనాయుడు
5. సింగమనాయుడు
వెన్నమనాయుడు
యాచమనాయుడు
6. అనపోతనాయుడు
6. మాడానాయుడు
పెద్దసింగమనాయుడు
దామానాయుడు
7. పెద్దవేదగిరినాయుడు
8. ధర్మా నాయుడు
8, చిన్నసింగమ నాయుడు
8. తిమ్మా నాయుడు
8. రామచంద్ర నాయుడు
8. కుమారమాడా నాయుడు
9. అనపోతా నాయుడు
9. ధర్మా నాయుడు
9.చినదాచమ నాయుడు
9.సూరా నాయుడు
కుమారవేదగిరి నాయుడు
సింగమ నాయుడు
10. సర్వజ్ఞసింగమ నాయుడు
అన్నమ నాయుడు
వసంత నాయుడు
10. అనపోతానాయుడు
11. పెద్దమాడానాయుడు
11. చిన్నమాడానాయుడు


Cond.

11. పెద్దమాదానాయుడు     11. చిన్నమాదానాయుడు

12. ఎర్రసూరానాయుడు     12. నల్లసూరానాయుడు

13. యాచమనాయుడు     13. మాధవనాయుడు

14. చిన్న సింగమనాయుడు

15. నెర్వాన్ రాయప్పనాయుడు

16. కుమార తిమ్మానాయుడు

పెద్దకొండప్పనాయుడు     17. గనితిమ్మానాయుడు     దెనకొండప్పనాయుడు

18. నామప్పనాయుడు     18. ఎర్రతిమ్మానాయుడు

యాచమనాయుడు

19. కృష్ణరాయప్పనాయుడు

20. పెద్దయాచమనాయుడు

21. కుమార యాచమనాయుడు

22. బంగారు యాచమనాయుడు

23. సర్వజ్ఞ కుమారయాచమనాయుడు     కుమారనాయుడు

పెదయాచమనాయుడు

24. బాయన యాచమనాయుడు

25. కుమారయాచమనాయుడు

26. బంగారు యాచమనాయుడు

[Histories of the chief families of the District P. 713]
[Manual of the Nellore District 1873]

వెలుగోటివారి వంశవృక్షం పరిశీలిస్తే వెంకటగిరి తాలూకాలో కన్పించే వ్యక్తినామ సూచకాలైన గ్రామనామాలు చెవిరెడ్డి. పల్లె, పెద్దయాచ. సముద్రం, బంగారుయాచ. సముద్రం, యాచవరం. యాచ. సముద్రం, రాజా. నగరం, విద్వత్కుమార యాచ. సముద్రం, వీరకుమార యాచ. సముద్రం, స్వర్ణయాచ. సముద్రం. పై గ్రామ నామాలను పరిశీలిస్తే ఇవన్నీ జమీందారుల వ్యక్తి నామాలతో ఏర్పడినవని తెలుస్తుంది. ఇవిగాక ఈ తాలూకాకు చెందిన మన్నూరు సిద్ధవరం, గ్రామాలను 22వ తరానికి చెందిన బంగారు యాచమ నాయుడు బ్రాహ్మణులకు దానం చేసినట్లు చారిత్రకాధారాలున్నాయి.

వెంకటగిరి జమీందార్లకు మూలపురుషుడు చెవిరెడ్డి (AD. 1350). The members of this family trace their descent from one Chevireddi said to have live about AD. 1350. (APDGN. 39) ఇతని పేరుతో ఏర్పడిన గ్రామం చెవిరెడ్డి. పల్లె. ఈ వంశంలో 20వ తరానికి చెందిన పెద యాచమనాయుడు (16 శ.) పరాక్రమవంతుడు. ఇతడు చరిత్రలో యాచ శూరుడుగా ప్రసిద్ధుడు. ఇతడు వెంకటగిరి దుర్గాధిపతైన గొబ్బూరి జగ్గరాజును ఓడించి వెంకటగిరిని క్రీ.శ. 1599 లో ఆక్రమించెను. అప్పటినుండి వీరు వెంకటగిరి సంస్థానాధిపులైరి. ఈ వంశంలో 22వ తరానికి చెందిన బంగారు యాచమనాయుడు (1660-1696 A D.) పరిపాలనాదక్షుడు. ఇతని తల్లి దండ్రులు కుమార యాచమనాయుడు, వరదమాంబాదేవి. ఇతడు ఉత్తరమల్లూరు, వెంకటగిరి సీమలు పరిపాలించెను. ఇతడు తన తల్లిదండ్రుల పేర్లతో రెండు గ్రామాలను బ్రాహ్మణులకు దానంచేసిన విషయం మెకంజీ కైఫియత్తులో ఇలా ఉంది. "క్రీ.శ. 1679 లో కొండ మండలం చంద్రగిరి రాజ్యంలోకి చెల్లే వెంకటగిరి సీమలోని మన్నూరు గ్రామానికి కుమార యాచ సముద్రమని తండ్రిపేరుపెట్టి సర్వమాన్యంగా బ్రాహ్మణులకు దానము చేసెను. క్రీ.శ. 1682 దుందుభి సంవత్సరాన వెంకటగిరికి పడమట రెండుమైళ్ల మేరలోనున్న సిద్ధవరమను గ్రామానికి వరదమాంబా పురమని తల్లిపేరిడి చక్రవర్తి వెంకటాచార్యులు కోలాచలం వెంకటాచలం పండితులకు దానం చేసెనట". (వెంకటగిరి కైఫియత్తు పు - 29). ఈ వంశంలో 23వ తరానికి చెందిన సర్వజ్ఞ సింగమనాయుడు (1690-1748) పరాక్రమవంతుడు. విద్యావంతుడు. రోసనూరి వెంకటపతి, ముడుంబి అప్పయ దీక్షితులు, మోచర్ల వెంకన్న మున్నగు కవులీతని ఆస్థానం

లో ఉండిరి. ఇతడు గ్రంథకర్తకూడా. ఆ కాలాన ఈయన లోకాన 'విద్వత్కుమార' యాచమ నాయుడని, ఇతని సంస్థానం విద్వత్ సంస్థానమని పేర్కొనబడింది బహుశా ఇతని పేరు మీదనే విద్వత్కుమార యాచసముద్రం అను గ్రామం ఏర్పడి ఉండవచ్చు ఈ వంశంలో 27వ తరానికి చెందిన కుమార యాచమ నాయుడు (1831 - 1892) గొప్ప రాజనీతిజ్ఞుడు. తన పాండిత్య విశేషంవల్ల ఇతడు సర్వజ్ఞ కుమార యాచమ నాయుడుగా ప్రసిద్ధి పొందెను.

వీరి వంశ వృక్షం, చరిత్ర తెలిసినను స్పష్టంగా కొన్ని గ్రామనామాలు తప్ప అన్నీ వీరి వల్లనే ఏర్పడినాయని చెప్పడానికి తగిన ఆధారాలు లేవు. కొన్ని గ్రామనామాల ప్రథమావయవాలైన చెవిరెడ్డి, పెదయాచ, బంగారుయాచ, యాచ, రాజ, విద్వత్కుమారయాచ, వీరకుమారయాచ, స్వర్ణయాచ, అనునవి వ్యక్తినామాలు ఈ వ్యక్తినామాలన్నీ జమీందార్లవే. ఈ పేర్లలో కన్పించే విద్వత్, వీర అనేవి వీళ్ల వ్యక్తిత్వాన్ని, వీరత్వాన్ని తెలిపే విశేషణాలై ఉండవచ్చు. బంగారుయాచమ నాయుడులోని బంగారు తత్సమీకరించబడి స్వర్ణగామారించేమో.

వెంకటగిరి సంస్థానానికి చెందిన కొన్ని విశేషాలు :

వెంకటగిరి సంస్థానం చుట్టు పక్కల కాళహస్తి, కార్వేటినగరం, సైదాపురం మొదలగు సంస్థానాలుండెడివి. ఈ సంస్థానాధీశులతో వెంకటగిరి సంస్థానం వారికి వివాహ సంబంధాలు ఉండేవి. విజయనగర సామ్రాజ్య కాలమునుండి వెంకటగిరి సంస్థానాధీశులు వైష్ణవులు, విద్వత్కుమారయాచమ నాయుడు (23 వ తరం) మొట్టమొదట శివభక్తుడై కాళికామందిరం నిర్మించి నట్లు తెలుస్తుంది. 27 వ తరంవాడైన సర్వజ్ఞకుమార యాచమనాయుడు రాధాకృష్ణ భక్తుడు. అప్పటినుండి వీరి వంశానికి ఇలవేల్పు రాధాకృష్ణస్వామి. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత సంస్థానం రద్దయింది.

ఏమైనా శాసనాధారాలు, మెకంజీ కైఫియత్తులలోని చరిత్ర శాసన సాక్ష్యలకు అనుగుణంగా రూపొందించి నప్పుడే నిర్దిష్టమైన చారిత్రక వివరాలు తెలుస్తాయి. అప్పుడే గ్రామనామ పరిశోధకులు గ్రామనామాలకు చరిత్రకు గల సంబంధాన్ని శాస్త్రీయంగ రుజువు పరచగలరు.

6.6 పునర్నామములు లేదా ఉరఫ్‌లు :

గ్రామనామాలకు ఏర్పడే పునర్నామాలు లేదా మారుపేర్లు (ఉరఫ్‌లు) సాధారణంగా ఒక సంస్కృతి మీద అన్యసంస్కృతి ఆధిక్యతను వెల్లడిస్తాయి లేదా, పాలకజాతి ప్రాధాన్యతను నిరూపిస్తాయి. ఒకే గ్రామానికి రెండు పేర్లు ప్రచారంలో ఉన్నపుడు, లేక అనే అర్థంలో ఉపయోగించే వేరొక పేరును ఉరఫ్ అంటారు. తెలుగు గ్రామనామాల విషయంలో పునర్నామీకరణ పరిశీలన ఆసక్తికరమైనది. నిఘంటువులో వీటిని నామాంతరాలనీ పర్యాయ పదాలనీ వ్యవహరించడమైంది.

దేశీయ ప్రభువుల పునర్నామకరణంలో సంస్కృతభాషా ప్రాబల్యం, కీర్తికాంక్ష; మహమ్మదీయ పాలకుల పునర్నామకరణంలో బంధుప్రీతి, ఉర్దూ భాషా ప్రభావం గమనించదగినవి. స్వాతంత్ర్యానంతరం దేశనాయకుల పేర్లతో పేటలు, గ్రామాలు కూడా ఏర్పడుతున్నాయి.

నెల్లూరుజిల్లా గ్రామనామాల పరిశీలనలో కూడ పైన పేర్కొన్న అంశాల ప్రభావం కన్పడుతుంది.

1. దేశీయ పాలకుల కీర్తికాంక్ష - సంస్కృత భాషా ప్రాబల్యం :-

ఉదా : క్షాత్రాయపాడు; నామా. అగ్రహారం క్షాత్రవావిడైన తిరువెంగడనాథ చతుర్వేది మంగళం [1309.10 NI. 2-35-1-9]
నాగవోలు - నామా. తిరువెంకట చతుర్వేద మంగళం [13 శ NI 3-2-8-9]
నాయుడుపేట - నామా. లక్ష్మి అనంతసాగరం [మెకం.344-26,32]

2. మహమ్మదీయ ప్రభువుల నామాంతరాలు - ఉర్దూ భాషా ప్రభావం :

ఉదా : కూనలమ్మపాడు-నామా. ఆయేషాపూర్ (మహమ్మద్ గురువు భార్య బీబీ ఆయేషా పేరుతో ఉంది)
అసమ సముద్రంపేట - నామా. రహమదాబాదు (మహమ్మద్ గురువగు అలవీబ్రుపేర ఏర్పడింది)
జువ్వల గుంటపల్లె - నామా. అలవీపూర్ (మహమ్మద్ పేర ఏర్పడింది)

(పై ఉదాహరణల వివ. లకు చూడు - వి.మం.స. పు. 177-180)

ఈ జిల్లా గ్రామనామాల్లో కన్పించే ఉరఫ్ పేర్లు :-

| | | |
|---|---|---|
| అక్కమాంబాపురం | ఉరఫ్ | బొప్పి అగ్రహారం |
| అరిగుండం | ,, | పడమటి కండ్రిగ |
| ఉదయగిరి | ,, | కొండాయ పాలెం |
| కొమ్మిపూడి | ,, | మర్లపూడి |
| కోటితీర్థం | ,, | తూర్పు కంభంపాడు |
| జయపురం | ,, | పోకలంగాయపల్లె |
| అమ్మమాంబాపురం | ,, | జోస్యులవారి కండ్రిగ |
| తురిమెర్ల | ,, | ఓరుపల్లె |
| తూర్పుపూండ్ల | ,, | రామసాగరం |
| పోలంగానిపల్లె | ,, | దేవరాజు సూరాయపల్లె |
| మంగుపల్లె | ,, | కన్నెపల్లె |
| మినగల్లు | ,, | చిట్టయపాలెం |
| రామాపురం | ,, | దామంచెర్ల |
| రావిమానుదిన్నె | ,, | వెంపల్లెతోక |
| వెంగమాంబాపురం | ,, | వెంగుపాలెం |
| సున్నంవారి చింతల | ,, | తిరుమలనాయుని పల్లె |
| సూళ్ళూరుపేట | ,, | సూళ్ళూరు |

వీటిని అకారాది నిఘంటువులో ప్రధాన ఆరోపం పక్కనే యివ్వడమైంది, అక్కడ వీటి వ్యుత్పత్తి వివరించబడలేదు. ఉరఫ్ గ్రామనామ ప్రథమావయవాల్లో వ్యక్తినామ సూచకాలు, కుటుంబనామ సూచకాలు, దిక్సూచకాలు కన్పిస్తున్నాయి.

6.7 నెల్లూరు జిల్లాలో చారిత్రకమైన రేవు పట్టణాలు గలవనడానికి, సముద్రం మీద వ్యాపారం సాగిందనడానికి నిదర్శనమైన గ్రామాలు-

ఉదా : దుగరాజ పట్నం, క్రిష్ణాపట్నం, రామాయపట్నం (వివరాలకుచూడు ఆకారాది నిఘంటువు)

6.8 నెల్లూరుజిల్లా గ్రామనామాలు చారిత్రక విశేషాలను నిక్షిప్తంచేసుకొన్న శిలాజాలవి పై పరిశోధన వల్ల తెలుస్తుంది. కాబట్టి ఒక భాషా సమాజంలోని గ్రామనామాల చరిత్ర ఆభాషా చరిత్రలో అంతర్భాగమే, ''The history of the names of places is past of the history of the language of the country in which they accur''[Henry cecil wyld, The place names of Lancan Shire (London–1911) P.2]

# 3

# గ్రామనామ వ్యుత్పత్తి నిఘంటువు

## అ. గ్రామనామ ప్రథమావయవ నిఘంటువు

**అంకిరెడ్డి.** పల్లె ఉదయ 20+, పురుషనామసూచి.

< అంక-ఇ. అంక గు అంకం. యుద్ధం. అంకమ్మ-ద్రావిడుల యుద్ధ దేవత. చూడు. కడూని. వ్యక్తి నామానుబంధమైన రెడ్డి. చేరేపుడు అంకి. బహువచనప్రత్యయం'లు చేరేపుడు అంకు. చూడు. దిగువ ఆరోపాలు.

**అంకు.** పల్లె రాపూరు, 32. స్త్రీనామసూచి

**అంకుల.** పాటూరు గూడూరు. 89. పురుషనామసూచి. పాటూరు. గ్రా.ద్వి. స్థలసూచి.

**అండ.** గుండాల సూళ్ళూరు. 43. అస్పష్టం.

**అందాల.** మాల గూడూరు108. రూ. అందలమాల. [జ.ప్రో] అస్పష్టం.

**అంబటివారి.** పాలెం కావలి. 18+, కుటుంబనామసూచి.

< అంబలి-టి, జావ, గంజి.

**అంబల.** పూడి వెంకట. 112. స్త్రీదేవతాసూచి.

అంబలు-అ. సప్తకన్యకలు, అక్కదేవతలు. స్త్రీనామాల్లో అంబ అనుబంధం కూడా.

**అంబా.** పురం నెల్లూరు. 16; సూళ్ళూరు, 5. స్త్రీదేవతాసూచి. అంబ-పార్వతి

**అక్కం.** పేట నెల్లూరు. 98; సూళ్ళూరు. 5 స్త్రీదేవతాసూచి.

అక్కమీద ఏర్పడే పేర్లు అక్కమ్మ, అక్కమాంబ, అక్కరాజా, అక్కు. చూడు. దిగువ ఆరోపాలు.

అక్క-చెర్వు. పాడు నెల్లూరు. 14. స్థలనామసూచి. అక్క-. చెర్వు స్త్రీనామసూచి.

అక్కమాంబా. పురం ఉరఫ్ బొల్లి. అగ్రహారం. వెంకట. 82 [సగటూరి తాలూకు మౌజెమూర్తిజనాయని పాళ్యానకు ప్రతినామధేయామై; అక్క-మాంబాపురం. మెకం. 344 24; అక్కమాంబాపురం. మెకం. 344, 45] స్త్రీదేవతాసూచి.

< అక్కమ-అంబ, స్త్రీనామానుబంధం అమ్మపై అంబ చేరడం కొన్ని పేర్లలో కన్పిస్తుంది. సాధారణంగా ఈ పేర్లు పూజ్యార్థ బోధకాలు.

అక్క-ర. పాక సూళ్ళూరు. 91. [అక్కరపాక మెకం. 344.89]? సాంస్కృతిక సూచి. అక్కర. పండుగ.

అక్కరాజావారి. కంద్రిడిగ కావలి. 81+. పురుషనామసూచి.

అక్క-. సముద్రం వెంకట. 104 [అక్కసముద్రం. మెకం. 344.101] స్త్రీనామసూచి.

లోకనిరుక్తి - 800 ఏండ్లక్రితం వెంకటగిరి సర్వజ్ఞసింగమ భూపాలుని వంశానికి చెందిన పెదలక్కమ్మ, చిన్నలక్కమ్మ, అక్కమ్మ, వెంగమ్మ, ముత్యాలమ్మ అనే అయిదుగురు స్త్రీలు నీళ్ళలోపడి ఆత్మత్యాగం చేసుకున్నారు. వారి పేరుమీద వెంకటగిరి జమీందారీ వంశానికి చెందిన బంగారుయాచమ నాయుడు ఒక గుడి కట్టించడం వల్ల ఈ ఊరికి అక్క సముద్రం అనే పేరు వచ్చింది [VT. FF. P. 59]

అక్కవారి. పల్లె ఆత్మ. 33+. కుటుంబనామసూచి.

అక్బర్ నివీసువారి. కంద్రిడిగ వెంగట. 66. చూ. అక్బర్ నివాసు కంద్రిగ. (NC'71) పురుషనామసూచి.

నివీసు < పర్షి. నవీస్ - లేఖకుడు. సంపాదకుడు. This word is generally added to the name of the clerk who wrote a Paper.

అక్బరాబాదు ఆత్మ. 27. అక్బర్. ఆబాదు. పురుషనామసూచి.

[ఫకీర్ శ్రేష్ఠుడైన సయ్యద్ హజరత్ హాజీఖాజా రహమతుల్లా అలైహిని నాయాబె రసూల్ అనగా ప్రవక్త మహమ్మదు ప్రతినిధి అనియు చెప్పుట గలదు. అగ్బరాబాద్ నాయబేరసూల్ బావమరిది యగు అగ్బరు సాహెబుపేర వెలయుచున్నది. (వి.మం.స పుట 180)]

అగ్రహారం కావలి. 14+,40+,76+, గూడూరు. 82+. జనపదసూచి
    అసమస్తం. < సం. అగ్రహారః. రాజు బ్రాహ్మణులకు దానమిచ్చిన భూమి లేదా గ్రామం. చూడు కడూని.

అగ్రహారపు. పల్లె వెంకట. 7+ గ్రామనామసూచి అగ్రహారం-పు

అగ్ని. పేట నెల్లూరు. (17+,18+) కులసూచి
    అగ్ని, దోయ, కురబ, గొల్ల కులాల్లో, పల్లి లేక వన్నె ఉపకులాల్లో ఇంటిపేరు. (CTSI.I)

అప్పు. కట్ల సూళ్లూరు. 88. పరిపాలనాసూచి
    అప్పు- ఏర్పరచడం, విభజించడం, చేనికి గనిమలువేయడం. తె.కో.I

అటకాని- తిప్ప సూళ్ళూరు. 154 ? వృత్తిసూచి.
    ఌ ఆటకాని < ఆటకాడు-ఇ

అడపా. మూడి సూళ్ళూరు. 93. [అడపామూండి. మెకం. 344.73; అడపామూడి. మెకం 344.72] కుటుంబనామసూచి. ఌ అడప. రూ. అడపం-తాంబూలం, పక్కాకు సంచి, బ్రాహ్మణుల్లో ఇంటిపేరు.

అడవి. రాజుపాలెం కావలి. 63+ స్థలనామసూచి
    రాజు. పాలెం గ్రా. ద్వి కులసూచి

అత్తల. పాలెం సూళ్ళూరు. 11 వృక్షసూచి
    < అత్తి-లు-అ. అత్తిచెట్టు Ficusglomerata, అత్తిపైన బహువచన ప్రత్యయం చేరేప్పుడు అత్తల, అత్తుల.

అత్తితోట. అగ్రహారం నెల్లూరు. (17+,18+) స్థలనామసూచి
    అత్తి.తోట. వృక్షసూచి

అత్తి. వరం వెంకట. 203. వృక్షసూచి.

అత్తుల. సిద్ధవరం వెంకట. 15 [వెంకటగిరి తాలూకు మౌజె ఆలతూరి పాటిలో అత్తుల శిద్దవరానకు ప్రతినామమైన బంగారు యాచ సముద్రం. మెకం. 344.23] వృక్షసూచి
    సిద్ధ.వరం. గ్రా.ద్వి. పురుషనామసూచి.

అద్దె. పూడి సూళ్ళూరు.2. అస్పష్టం.

అద్దే. పల్లె గూడూరు. 97 [అద్దే పల్లి. మెకం. 349.174] అస్పష్టం.

అధ్వాన్నపునారాయణ. కట్టుబడి రాపూరు, 107, పురుషనామసూచి.
    < అధ్వాన్నం-పు. పాడైన, చెడ్డ.

అనంత. పురం కావలి. 24; నెల్లూరు. 79. పురుషదేవతాసూచి.

< సం. అనంతః-విష్ణువు, అనంతపై ఏర్పడేపేరు- అనంతభట్టు

అనంతబొట్లవారి. కంద్రిగ కావలి. 79+; కోవూరు. 26. పురుషనామసూచి.

బొట్ల < భట్టు -లు- అ. < సం. భట్టః వంది. స్తోత్రాలు చేసేవాడు.

అనంత.మడుగు రాపూరు 106. పురుషనామసూచి.

అనంత. పరం కోవూరు 8 పురుషనామసూచి.

అనంత. సాగరం ఆత్మ. 81 [అనంత సాగరము చెర్వు 1520-21. NI.16. 27-28. అనంతసాగరపు చెరువు. 1612-.3. NI.1,35. 14-15. అనంత సాగర 1628-29 NI. 1-3-55] పురుషనామసూచి.

[ఉదయగిరి రాజ్యమునకు 1509 నుండి 1530 వరకు కార్యకర్త రాయసం తిమ్మరుసయ్య కుమారుడు కొండమురుస్వయ్య. ఇతడు గూడ మంత్రి తిమ్మరుసు కుమారుడు కాదు. క్రీ.శ. 1519 - 20 క్రీ శ. 1520 - 21 లో కలువాయి అనంతసాగరముల చెరువులను త్రవ్వించెను. ఆనాటి ఉదయగిరి రాజ్యములో ప్రస్తుత ఆత్మకూరు, ఉదయగిరి, కందుకూరు, కనిగిరి, పొదిలి, రాపూరు, నెల్లూరు తాలూకాలుండెనని అచ్చటి శాసనములబట్టి చెప్పవచ్చును. ఈ మహా కార్యములను గురించి ఈ కింద వదంతి గలదు. కృష్ణదేవరాయలు కొండ మురుస్వయ్యను పిలిచి యుద్ధమునకు కావలసిన గుఱ్ఱములను తంజ నగరాధీశ్వరుని వద్ద కొని తీసుకొని రమ్మని 10,000 వరహాల నిచ్చెనట. కొండ మురుస్వయ్య సపరివారంగా ఉదయగిరి నుండి బయలుదేరి బ్రహ్మావరం (ఇప్పటి బొమ్మవరం) మంగమ్మపల్లి (మంగుపల్లి), కామిరెడ్డిపాడుల మీదుగా బయలుదేరి వచ్చుచు ప్రస్తుత అనంతసాగరం చెఱువు ప్రాంతములో విడిసి విశ్రాంతి తీసుకొనుచుండగా అకాల వర్షము కురిసి కేతామన్నేరు వెల్లువ వచ్చుటచే తన మజలీని తక్షణమే మార్చుటయే గాక ఏటి ప్రవాహమువలన పండియున్న మెట్టపైరులు పాడగుట చూచెను. ప్రజలు వారి సారవంతమైన భూములు కేతామన్నేరు ప్రవాహమువలన నాశన మగుటను విన్నవించిరట. బ్రాహ్మణపల్లిలో (కలువాయి దగ్గర) మరియొక మకాములో ఒక వృద్ధురాలు మంత్రికి రాగి సంకటి పెట్టెనట. అప్పుడు మురుసయ్య అవ్వా! యీ యూరిలో బియ్యం దొరకవా? అని ప్రశ్నింప, నాయనా? రాజులకు వారి సామ్రాజ్యమును విస్తరించుటకే సరిపోవుచున్నది గాని, ప్రజల కష్టసుఖముల విచారించుటకు తీరిక లేకున్నది. మాకు వేసవిలో నీరుండవు,

వరియన్నమే ఎరుగము. బిడ్డలకు తల్లి ఎటువంటిదో ప్రజలకు రాజులటువంటి వారు. మా పితరులు మమ్ములను చూచినట్లే మీరు మమ్ములను చూడ వలయునని చెప్పగా, అశోకునికి కళింగ యుద్ధములో జ్ఞానోదయము కలిగినట్లు మంత్రికి బ్రాహ్మణపల్లెలో మనఃపరివర్తన గలిగి రాయలు గుఱ్ఱములకై యిచ్చిన ధనముతో బావులు, చెఱువులు త్రవ్వించుటకు నిశ్చయించెను. అనంతసాగరము. వరికుంటపాడు కొండలను రెండు ఫర్లాంగుల దూరము కల్పి కేతామన్నేరు నదికి అడ్డముగా క్రీ. శ. 1520 - 21 లో కట్టపోయించి మెట్టపంటలు నాశనము కాకుండ చూచుటయేగాక వరి పంట పండునట్లు చేసెను. ఇట్లు కొండముర్సయ్య కు చెఱువులు, గుళ్ళు తమ తల్లిదండ్రుల పేరట కట్టించి, గుఱ్ఱముల కొనకయే రాయలవద్దకు తిరిగిరాగా, రాయలు కోపగించి యిరువదినాల్గు గడియలలో గుఱ్ఱములు తేనిచో తల తీయుదునని ఆజ్ఞాపింపగా ముర్సయ్య అధైర్యపడక మల్లమ్మదేవిని ప్రార్థింపగా 2,000 గుఱ్ఱములు తెల్లవారునప్పటికి రాయల ప్రాంగణములో నుండుట గాంచి, అచ్చెరువంది కొండముర్సయ్యను క్షమాభిక్ష వేడెనట! తరువాత కృష్ణరాయలు ఆ చెఱువులు పరిశీలించుటకు తన తమ్ముడు అనంత దేవరాయలతో వచ్చినట్లును, అనంతదేవరాయలు పేరిటనే చెఱువు, గ్రామము అనంతసాగరమని పేరు పెట్టబడినట్లు పెద్దలు చెప్పుదురు. ఈ కథ ఎంతవరకు సత్యమో విచారణీయము. (వి.మం.స. పు - 51-53)

అనమరాజు. పల్లె రాపూరు. 80+ పురుషనామసూచి. < అన్నమరాజు.

అనమ. సముద్రం ఆత్మ. 38. పురుషనామసూచి.

అనమసముద్రం. పేట ఆత్మ. 46 గ్రామనామసూచి.

అనమ. సముద్రం. పురుషనామసూచి.

అనికే. పల్లె నెల్లూరు. 63 అస్పష్టం.

అనుపల్లె. పాడు నెల్లూరు. 94 గ్రామనామసూచి.

అను. పల్లె వృక్షసూచి. అను ౹౹ అనుము. అనపచెట్టు Dolichos lab lab

అనుమ. కొండ కావలి. 76+ పురుషదేవతసూచి.

అనుమ < హనుమ. ఆంజనేయుడు.

అనుమకొండ. పాలెం కావలి 76+ స్థలనామసూచి.

అన్నం. పల్లె ఉదయ 67+ కుటుంబనామసూచి.

అయ్యగారి. పాలెం రాపూరు. 37 పురుషనామసూచి.

అయ్య- గురువు, తండ్రి, పూజారి, బ్రాహ్మణుడు, దాసరి, దేవాంగ, గొల్ల, ఈడిగ, జంగం, కొండదొర, కోమటి, కొప్పులవెలమ, లింగబలిక, మంగల, మూకదొర, పైడి, సాతాని, తంబల మొదలగు కులాల వ్యక్తినామాల్లో అయ్య వ్యక్తినామానుబంధంగా కన్పిస్తుంది. CTSI. I ప్రథమ పుం. స్త్రీ. బహువచన రూపమైన వారు అయ్యతో వచ్చినపుడు కులసూచి అవుతుంది. అయ్యమీద ఏర్పడే పేర్లు. అయ్యన, అయ్యపరెడ్డి, అయ్యా. చూడు దిగువ ఆరోపాలు.

అయ్యన. పల్లె ఉదయ. 95 పురుషనామసూచి.

అయ్యపరెడ్డి. పాలెం కావలి 20+, గూడూరు. 60 పురుషనామసూచి.

అయ్యవారి. పల్లె ఉదయ. 12 కులసూచి.

[అయ్యవార్లకు దానం చెయ్యడం వల్ల దీనికి అయ్యవారి పల్లె అనే పేరు వచ్చింది. (UT. FF· P.84)]

అయ్యవారి. పాలెం గూడూరు. 27 కులసూచి.

[అయ్యవార్లు అనే బ్రాహ్మణులకు ఈ గ్రామాన్ని 200 సంవత్సరాలక్రితం వెంకటగిరి రాజావారు అగ్రహారంగా ఇవ్వటం వల్ల అయ్యవారి పాలెం అనే పేరు వచ్చింది. (GT.FF.P. 28)]

అయ్యవార్ల. కండ్రిగ కోవూరు. 57+, నెల్లూరు. 120+ కులసూచి.

< అయవారు-లు-అ

అయ్యా.పాలెం సూళ్ళూరు. 104 పురుషనామసూచి.

అరవ. పాలెం కోవూరు. 45+; గూడూరు, 69+; నెల్లూరు. 47+. భాషావర్గ సూచి.

అరవ. పెరిమిడి సూళ్ళూరు. 15 భాషావర్గ సూచి.

అరి. గుండం ఉరఫ్ పడమటి. కండ్రిగ సూళ్ళూరు. 67 వృక్షసూచి.

అరి ග ఆరి. ఒకానొక చెట్టు.

అరిగె. పల్లె వెంకట. 130 సస్యసూచి.

అరిగె ග ఆరిగె. ఒకధాన్యం Pasapalum Scrobiculatum.

అలగాని. పాడు కోవూరు. 88 అస్పష్టం

అలి. మెలి వెంకట. 111 [అలిమేలి. వెంకటగిరి కైఫియతు. పు. 40] అస్పష్టం. [కలిమిలిశీమ అనగా కలిమిలమ్మ అనే గ్రామశక్తి వెంకటగిరిలో వుండి వున్నది. వెంకటగిరి దుర్గాం పైననున్నూ శక్తి ఆలయం వున్నది. గన్కు ఆ దుర్గానకున్నూ వెంకటగిరి గ్రామానకున్నూ కలిమిలి అనే పేరు. యిది యెనభైయేండ్ల తత్పూర్వపు దాన పత్రాలలో వ్రాశి వుంటున్నది. మెకం. 350. 47] ప్రస్తుతం ఈ పేరు వ్యవహారంలో లేదు.

అలిడులుగుంట. కండ్రిగ సూళ్ళూరు. 85+ స్థలనామసూచి

అలిమేలు. గుంట. స్త్రీదేవతాసూచి

అలిమేలుమంగా. పురం ఉదయ. 73, వెంకట. 157: రూ. అలివేలు మంగా పురం. (ము.ప) స్త్రీదేవతాసూచి

< త. అలర్ మేల్ మంగై-తామరపూవుమీదనున్న స్త్రీ (DED. 209)

అల్లం. పాడు ఉదయ. 110, గూడూరు. 114 వృక్షసూచి

అల్లం. కారంగల ఒక జాతి దుంప Lingiber offcinate. మాల కులాల్లో ఇంటిపేరు. (CTSI. I)

అల్లిగుంట పాలెం కావలి 62+ స్థలనామసూచి.

అల్లి. గుంట, వృక్షసూచి. అల్లి. తెల్లకలువ, అల్లిచెట్టు, తుప్పగా పెరిగే ఒకరకం కలువ మొక్క. Wymphea alba.

అల్లి. మడుగు కావలి. 71 వృక్షసూచి

అల్లీ. పురం ఆత్మ, 51+, నెల్లూరు. 25 పురుషనామసూచి

< హిం. అలీ- గొప్ప

అల్లూరు కోవూరు. 16 [అల్లూరు 1533-34 NI 2 2 9; అలూరు 1535-36 NI .2.10.4; అల్లూరుచెర్వు 1638-39 NI.2 1.12-13] అల్లి-ఊరు, వృక్షసూచి.

అల్లూరు. పాడు కోవూరు. 77 గ్రామనామసూచి.

అల్లూరు. పేట కోవూరు. 15 గ్రామనామసూచి.

అశ్వనీ. పురం ఆత్మ.52+? దేవతాసూచి.

అష్ట. కావేరి వెంకట. 177 రూ. హస్తకావేరి (ము.ప) సంఖ్యానామ సూచి-కావేరి గ్రా.వ్యా.

ఆకలి. వలస రాపూరు. 14 సంఘటనసూచి.

ఆకు. తోట గూడూరు. 82+ వృక్షసూచి.

ఆవార్ల. పార్లపల్లె గూడూరు. 52 కులసూచి.

< అరి-లు-అ. పూజారి, వైష్ణవుడు, వంటబ్రాహ్మడు, కంసాలి విశేషాలకు చూడు (CESI-I) పార్ల. పల్లె. గ్రా.ద్వి. కుటుంబనామసూచి

ఆత్మకూరు ఆత్మ 51 [ఆతుకూరి? 1279-80 NI. 1. 11.5; (ఆతుకూరు = ఆత్మకూరు); ఆత్మకూరి 1277-78 NI. 1.13 5; ఆత్కూరి 1246-47 NI.I. 7 22-23; ఆతకూరి (మెకం. 354, 272)]? దేవతాసూచి.

శాసనరూపాల్లోని ఆతు-(క్) అస్పష్టం. నేటి ఆత్మ-(క్) లోక నిరుక్తిగా ఉండవచ్చు.

ఆదినాగవ. పురం కోవూరు. 17+ పురుషదేవతాసూచి.

ఆదినాగవ - ఆదిశేషుడు.

ఆదిమూర్తి. పురం కావలి. 9 పురుషదేవతాసూచి.

ఆదిరెడ్డి. పాలెం కావలి 78+ పురుషనామసూచి.

ఆదూరు. పల్లె రాపూరు 55 [అదూరుపలె? 1570-71 NI. 3 12.6] అస్పష్టం.

ఆదూరు. పల్లె రాపూరు. 114+ అస్పష్టం.

ఆదెప్పాలెం కావలి. 68+ పురుషనామసూచి < ఆది-అప్ప

ఆనె. పూడి ఉరఫ్ నడిమి. కండ్రిగ సూళ్ళూరు. 66 రూ. అనెపూడి (ము.ప) జంతుసూచి. ఆనె-ఏనుగు (DED. 4235)

ఆనె. మడుగు కావలి. 58 [ఆనె మడుగు 1642-43 NI.2.1.19] జంతుసూచి

ఆనే. గొట్టం సూళ్ళూరు. 61 జంతుసూచి.

ఆబాక సూళ్ళూరు. 54 < ఆపు-పాక. జంతుసూచి.

ఆమం. చెర్ల నెల్లూరు. 9 అస్పష్టం.

ఆముదాల గుంట. కండ్రిగ గూడూరు. 34+ స్థలనామసూచి.

ఆముదాల. గుంట. వృక్షసూచి, ఆముదాలు-అ. ఒకరకం నూనె గింజలు. Castor oil plant, Ricinus communislnn

ఆముదాల. దిన్నె కావలి. 61+ వృక్షసూచి.

ఆముదాల. పాడు నెల్లూరు. 79+

ఆముదాల. పాడు నెల్లూరు. 84 [ఆమిదాలపాడు మెకం. 349.14] వృక్షసూచి

ఆములూరు కోవూరు. 28, నెల్లూరు. 69 అస్పష్టం.

ఆర. వేడు ఆత్మ. 9 భాషావర్గసూచి

< అరవ-వీడు అని MAMP లో వుంది. ఆరెభూమి అంటే మహారాష్ట్ర దేశము. మహారాష్ట్రులు నివాసమేర్పరచుకొన్న గ్రామం. ఆర ~ ఆరె ~ ఆరియ < సం. ఆర్య.

ఆరవేటి. పల్లె ఆత్మ. 11+ గ్రామనామసూచి. < ఆరవేడు-ఇ.

ఆరిమాని. పాడు వెంకట. 189 వృక్షసూచి.

< ఆరిమాను-ఇ. చంద్రచెట్టు.

ఆరూరు. సూళ్ళూరు. 33 ఆరు- ఊరు. జలసూచి.

< త. ఆఱు- ఏరు, నది (DED. 4233)

ఆరోన. పాలెం కావలి. 81+? భాషావర్గసూచి.

ఆరోన < ఆరవవాని

ఆర్ల. పడియ ఉదయ 26 సస్యసూచి. ఆర్లు- అ. ధాన్యవిశేషం.

ఆర్కాడు. పాలెం నెల్లూరు. 120+ గ్రామనామసూచి.

ఆర్కాడు జలసూచి ఆర్ - కాడు. తమిళదేశంలోని అర్కాటు (షడారణ్య) వంటిది గావచ్చు MAMP.

ఆవులవారి. పల్లె ఉదయ. 73+ కుటుంబనామసూచి.

ఆవుల- బలిజ, బోయ, గొల్ల, కాపు, కొరవ, ముత్తరాచ, ఎరుకల వాళ్లలో ఇంటిపేరు CTSI. I

ఆలేటిపాడు. చిట్టమూరు గూడూరు. 72 గ్రామనామసూచి.

ఆలేటి. పాడు కుటుంబనామసూచి. < ఆవుల- ఏటి. చిట్టమూరు.

గ్రా. ద్వి. పరిమాణసూచి. చిట్ట < త. చిఱ్-చిన్న.

ఆల్తుర్తి రాపూరు. 34 రూ. అల్తుర్తి (జ్రపో) < ఆల్-తుర్తి. జంతుసూచి.

ఆల్- ఆవులు.

ఆల్తూరు. పాడు వెంకట. 17 [ఆలతూరి పాటి మెకం. 344 - 23]

గ్రామనామసూచి. < ఆల్-తూరు. జంతుసూచి.

ఆల్తూరివారి. తోట నెల్లూరు. 46+ కుటుంబనామసూచి.

ఇందుకూరు. పేట నెల్లూరు. 40, 42, (Bit I - 40. Bit II-42)

గ్రామనామసూచి. ఇందుకూరు < ఇందుకు-ఊరు. వృక్షసూచి.

ఈందు, ఈదు-ఈతచెట్టు Date palm. phoenix Sylvestris Roxb.

[Indukūru may have acquired that name on account of country data palm groves which abound there. JAHRS. 12. P. 228]

ఇందుపూరు కోవూరు, 23 వృక్షసూచి.

ఇడిమే.పల్లె నెల్లూరు. 92 అస్పష్టం.

ఇనగలూరు ఆత్మ. 62 సంఖ్యానామసూచి.

<?ఇరు/ఇను-అ. రెండవ

ఇన. మడుగు కోవూరు. 72 సంఖ్యానామసూచి.

ఇను. కుర్తి రాపూరు. 40 సంఖ్యానామసూచి.

ఇను. గుంట వెంకట. 182 [యినుగుంట చెరువు. 1662-63 NI. 3. 247; పాకైనాడులోని ఇలుంగుండై 18 శ. NI. 3. 26; ఇరుంగుండై 18శ. NI. 3. 27:యినకుంట. మెకం. 358.85] సంఖ్యానామసూచి.

ఇప్ప. పూడి గూడూరు. 43 వృక్షసూచి.

ఇప్ప-ఇప్పచెట్టు. Bassialatifolia.

ఇరకం సూళ్ళూరు. 152 కులసూచి. అసమస్తం.

ఇరకం. ఒక కులాన్ని తెలిపేపదం. కాపిరకం, పంటిరకం (మా.ప)

ఇరుక- narrow. Island in Pulicat lake in Gudur taluk, (MAMP)

ఇర్ల.పాడు ఉదయ. 111 కులసూచి. ఇర్ల ග ఇల్ల ఒక కులం,

ఇలుకూరు. పాడు గూడూరు. 102 గ్రామనామసూచి.

ఇలు.కూరు కులసూచి ఇలు ග ఇల్లు - యానాదుల్లో ఇంటి పేరు

ఇలు.పూరు సూళ్ళూరు 109 కుటుంబనామసూచి

ఇసక. దామెర్ల ఉదయ 47 భూసూచి. ఇసక ග ఇసుక

ఇసనాకవారి. పాలెం నెల్లూరు 12+ కుటుంబనామసూచి

ఇసుక. దిబ్బ నెల్లూరు. 17+, 18+ భూసూచి.

ఇసుక. దొరువు నెల్లూరు. 78+ భూసూచి.

ఇసుక. వట్టు గూడూరు. 122 భూసూచి.

ఇసుక. పల్లె ఆత్మ. 83, 88+, 106+; ఉదయ. 38, 111+; కోవూరు. 17
భూసూచి.

ఇసుక. పాలెం కోవూరు. 47; నెల్లూరు 68+, 90 (సర్వేపల్లె Bit III
భూసూచి.

ఈగ. పాలెం ఆత్మ. 59+ కుటుంబనామసూచి.

ఈగ- ముత్రాచ కులంలో ఇంటిపేరు. (CTSI. 2)

ఈడిగ. పాలెం ఆత్మ. 62+ కులసూచి.

ఈడిగ- కల్లుగీచి జీవించే ఒక కులం (CTSI. 1)

ఈడిగ. మిట్ట నెల్లూరు. 17+, 18+ కులసూచి.

ఈద. గాలి నెల్లూరు. 112 వృక్షసూచి. ఈద-ఈతచెట్టు.

ఈదుల. కండ్రిగ రాపూరు. 81 వృక్షసూచి.

< ఈదులు-అ. ఈతచెట్టు.

ఈదుల. పల్లె గూడూరు 1+ వృక్షసూచి

ఈదులవారి. పాలెం గూడూరు. 96+; నెల్లూరు. 87+ కుటుంబనామసూచి.

ఈదూరు నెల్లూరు 77, 78 Bit I 78, (Bit II 77) వృక్షసూచి.

ఈపూరు నెల్లూరు 114, 116, 121 (Bit I A 116, Bit I B 121, Bit II
114) అస్పష్టం.

ఈశ్వరమ్మ. మఠం నెల్లూరు. 87+ స్త్రీనామసూచి.

ఈశ్వర. వాక గూడూరు. 71 పురుషదేవతాసూచి.

ఉగ్గు. మూడి సూళ్ళూరు. 83 కుటుంబనామసూచి.

ఉచ్చలపాటి. దిబ్బ నెల్లూరు. 78+? జైనమతసూచి. < ఉచ్చలపాడు-ఇ

ఉచ్చూరు సూళ్ళూరు. 85 [ఉచ్చియూర్ 17 శ. NI.3.19; వూచూరి మెకం.
354. 255]

ఉడతావారి. పార్లపల్లె గూడూరు. 41 కుటుంబనామసూచి.

పార్ల. పల్లె గ్రా.ద్వి. కుటుంబనామసూచి.

ఉడతావారి. పాలెం గూడూరు. 88 కుటుంబనామసూచి

ఉడతావారి పాలెం. ఇది జమీందారీగ్రామం. గోలకొండ నవాబుగారి తలమీద కెక్కిన ఉడుతను తక్షణమే హస్తలాఘవముతో పడగొట్టి నవాబుగారి మన్నన వడసిన లింగమనాయుడను మూల పురుషునితో ఈ

కుటుంబ చరిత్ర మారంభించును. వీరు సదరు గ్రామము, ఇతర ములగు మన్ననలు, లింగమనాయుడను గౌరవనామధేయము నవాబుగారి కాలములో వడసిరి. (వి.మం స. పుట 86)

ఉడ్ హౌస్. పేట కోవూరు. 40+; నెల్లూరు 17+, 18+ పురుషనామసూచి.

< ఇం. A.C. wood house (1926 - 31, 1934 - 37)

ఈ కాలంలో నెల్లూరుజిల్లా కలెక్టరుగా ఉండెను. (Nellore Gagetter)

ఉత్తమ. నెల్లూరు గూడూరు. 115 విశేషణసూచి.

ఉత్తర. పొలం కావలి. 24+ దిక్సూచి.

ఉత్తర. పాలెం గూడూరు. 138+ దిక్సూచి. చేచరాకు.

ఉదయ. గిరి ఉరఫ్ కొండాయ.పాలెం. ఉదమ 68 [ఉదయగిరి 1516-17 NI. 1.9; వుదయగిరి 1568-69 NI.3.2.9] సాదృశ్యబోధకసూచి.

ఉదయగిరి. దుర్గం ఉదయ. 68+ [వుదయగిరి దుగ౯ం 1442-43, NI. 3.30.5 స్థలనామసూచి.

ఉదయగిరి దుర్గము- సముద్రమట్టమునకు 3079 అడుగుల నెత్తున నున్న నుదయగిరి కొండమీద కళింగరాజగు లాంగూల గజపతిచే తొలుత నిర్మింపబడి, తదనంతరమేలిన భూవరులచే నభివృద్ధి గాంచెను. 'ఉదయగిరి'' భువనేశ్వర సమీప పర్వతములలో నొకదాని పేరు. కనుక యీ ఉదయగిరి కూడ గజపతుల చేతనే స్థాపింపబడినట్లు స్పష్టము. ఉదయగిరి రాజధానిగా లాంగూల గజపతి కడప నెల్లూరు మండలములేలినట్లు బాస్వెల్ పండితుని యభిప్రాయము.

క్రీ.శ. 1350 - 57లో బుక్కరాయల జ్యేష్ఠ సోదరుడగు కంపరాయ లుదయగిరిని రాజధానిగా జేసికొని తూర్పుపరగణా నేలుచుండినట్లు తెలియుచున్నది. కంపరాయల తనయులలో మొదటివాడైన శ్యావన్నయొడయర్ క్రీ.శ. 1356 సం॥ నకే ఉదయగిరి రాజధానిగా నుదయగిరి రాజ్యమును, విక్రమసింహపురి (నెల్లూరు) రాకధానిగా నుదయగిరి రాజ్యములోని ములకనాటిని, పాకనాటిని బాలించినట్లు శాసనములవలన తెలియుచున్నది.

కటక పురాధిపతి కపిలేంద్ర గజపతి జైత్రయాత్ర వెడలి క్రీ. శ. 1460 ప్రాంతమున నుదయగిరిని జయించినట్లు శాసనము గలదు. విజయనగరము నేలిన రాజవంశములలో రెండవ వంశమునకు చెందిన సాళ్వ నరసింహులు

(చంద్రగిరి రాజు) గజపతులనుండి ఉదయగిరిని జయించెను. అయినను కసిగట్టి గజపతులు దానిని తిరిగి సంపాదించుకొనిరి. సాళ్వ నరసింహుడా విచారముతోనే చనిపోయెను.

క్రీ. శ. 1513 ప్రాంతమున నుదయగిరిని ప్రతాపరుద్ర గజపతి పరిపాలించెను. పూర్వము విజయనగర సామ్రాజ్యమునకు చేరిన నుదయగిరిని మరల కైవశము చేసికొనుటకై కృష్ణరాయలు ఉదయగిరి మీదికి దండెత్తెను. అపుడా దుర్గమభేద్యమై యెల్లవేళల బదివేల కాల్బలముతో, నాలుగు వందల గుఱ్ఱపు దళములతో సంరక్షింపబడుటచే, రాయలా దుర్గమును పదునెనిమిది నెలలు భీషణ సంగ్రామ మొనరించి ఆక్రమించి, ఆ దుర్గాధ్యక్షుని పినతండ్రియైన ప్రహరేశ్వర పాత్రుని చెఱబట్టి విజయనగరమునకు గొనిపోయెననియు ఉదయగిరి రాజ్యమునకు రాయసం కొండమర్సయ్యను దండనాథునిగా నియమించెననియు చరిత్ర గలదు.

క్రీ. శ. 1610 ప్రాంతమున మీర్ జుమ్‌లా నాయకత్వమున గోల్కొండ నవాబుచే సైన్యము పంపబడి కంపరాయలోడింపబడెను. గొల్కొండ నవాబుల తరువాత దుర్గమాడ్కాటు నవాబుల వశమై ఆ వంశస్థులలో ఆఖరువాడగు అద్బాస్ అలీఖాన్ నుండి అంగ్లేయులు క్రీ. శ. 1839లో స్వాధీనపరచుకొనిరి. (వి. మం. స. పుట 123)

ఉద్ది. గుంట కోవూరు. 16+ వృక్షసూచి. ఉద్ది- ధాన్య విశేషం.

ఉద్ది. మిట్ట నెల్లూరు. 78+, 83+ వృక్షసూచి.

ఉప్పర. పల్లె వెంకట. 31+, 150 కులసూచి.

ఉప్పర- ఒక కులం. చెరువులు తవ్వడం, ఉప్పుతయారు చేయడం పనిగావుండే కులం. (CTSI. 7)

ఉప్పర. పాలెం నెల్లూరు 17+, 18+, 71+ కులసూచి.

ఉప్పల. పాడు ఆత్మ. 79. కోవూరు. 32+ భూసూచి.

< ఉప్పలు- అ. చవటిపొలం.

ఉప్పల. మర్తి సూళ్ళూరు. 3 భూసూచి.

ఉప్పు. గుంట నెల్లూరు. 78+ భూసూచి.

పోల్చిచూడు. ఉప్పుపట్టు- ఉప్పునేల, చవటనేల

ఉప్పు. చేడు నెల్లూరు. 45+ భూసూచి.

ఉప్పు. టూరు నెల్లూరు. 5 భూసూచి. (కుటుంబనామసూచి)

ఉప్పు- బలిజ, కొరవ శాఖల్లో ఇంటిపేరు (CTSI. 7)

ఉప్పు. ఏరు నెల్లూరు. 32+ భూసూచి

ఉప్పు- ఏరు. సంధిలో టుగాగమం.

ఉమామహేశ్వర. పురం కావలి. 83 పురుషనామసూచి.

ఉమ్మాయ. పల్లె ఉదయ. 104+ పురుషనామసూచి

< ఉమ్మ- అయ < సం. ఉమ- అయ్య.

ఉయ్యాల. కాల్వ నెల్లూరు 17+, 18+ కుటుంబనామసూచి.

ఉయ్యాల- మాల, ముత్రాచ, ఎరుకల వాళ్లలో ఇంటిపేరు. (CTSI. 7)

ఉయ్యాల. పల్లె రాపూరు. 2 కుటుంబనామసూచి.

ఉరపాల రంగనాథం. తోట నెల్లూరు 17+, 18+ పురుషనామసూచి.

ఉలవ. పల్లె ఆత్మ. 99+, 116+; కోవూరు. 9 వృక్షసూచి.

ఉలవలు. పప్పు, ధాన్యం. Horsegram. Dolichos biflor Buch Roxb. ఉలవల- బోయ, జోగి కులాల్లో ఇంటిపేరు. (CTSI. 7)

ఉలవ. పాడు కోవూరు. 85+ వృక్షసూచి.

ఉలవలవారి. పాలెం ఉదయ. 78+ కుటుంబనామసూచి.

ఉల్సావారి. పాలెం గూడూరు. 93+ కుటుంబనామసూచి.

ఊచగుంట. పాలెం కోవూరు. 30 స్థలనామసూచి.

ఊచ గుంట- వృక్షసూచి. ఊచ. ముండ్లదుబ్బు.

ఊచ. పల్లె రాపూరు. 29 వృక్షసూచి.

ఊటు. కూరు ఉదయ. 80: కోవూరు. 89 ? జలసూచి

ఊటు < ఊట-ఉ. భూమినుంచి ఉబికే నీరు, నీటిబుగ్గ.

ఊటు. కూరు రాపూరు. 96 [ఊటుకూరు 1682-83 NI.3.68; ఊట్టకూర్, ఊట్టుక్కూర్, ఊటుకూరు 17 శ. NI.3.66; వూటకూరి 17 శ. NI 3.69]? జలసూచి.

ఊట్ల. పల్లె వెంకట. 136 కుటుంబనామసూచి.

ఊట్ల < ఊటలు-అ. ఊట్ల ~ ఉట్ల, బోయ, పద్మసాలెల్లో ఉంటిపేరు (CTSI. 7)

ఊట్ల. పాలెం    రాపూరు. 60 కుటుంబనామసూచి.

ఊడి. పూడి    సూళ్ళూరు. 76 వృక్షసూచి. ఊడి. ఒకజాతి కూరాకు.

ఊరు. కుర్ర    కోవూరు. 17+ స్థలసూచి.

ఊరుగుంట. పాలెం    గూడూరు 48+ స్థలనామసూచి.

ఊరు. గుంట స్థలసూచి.

ఎగువ. చావలి    సూళ్ళూరు. 22+ దిక్సూచి.

ఎగువ, మీద, పైన, చావలి- గ్రా ద్వి.

ఏగువ. పల్లె    ఆత్మ. 67+; ఉదయ. 108+; రాపూరు. 80+ దిక్సూచి

ఎగువ. పాడు    నెల్లూరు. 37+ దిక్సూచి.

ఎగువ. పాలెం    నెల్లూరు. 119+ దిక్సూచి.

ఎగువ. మిట్ట    నెల్లూరు. 113+ దిక్సూచి.

ఎగువ. రాజుపాలెం గూడూరు. 26+ దిక్సూచి

రాజు పాలెం గ్రా. ద్వి కులసూచి.

ఎడ పాలెం సూళ్ళూరు. 134+ దిక్సూచి. ఎడ - నడిమి, మధ్య.

ఎడ.వల్లి ఆత్మ. 54+ దిక్సూచి

ఎడ్లదిన్నె మిట్ట ఆత్మ. 103+ స్థలనామసూచి.

ఎడ్ల దిన్నె, జంతుసూచి. <ఎద్దులు-అ.

ఎద్దుల. రేవు    నెల్లూరు. 17+, 18+, 74+ జంతుసూచి.

ఎనమదల ఆత్మ. 90 రూ. యనమదల (ము.ప) అస్పష్టం.

ఎనుములు. పాలెం నెల్లూరు, 17+, 18+ జంతుసూచి.

ఎనుముల- బలిజ, బోయ, మాదిగ, ఒడ్డె వాళ్ళలో ఇంటిపేరు (CTSI.7)

ఎన్న. వాడ ఆత్మ. 2+? పురుషనామసూచి. <? వెన్న-క్రిష్ణుడు

ఎరగాటి. పల్లె గూడూరు. 117? పురుషనామసూచి. ఎరగాడు-ఇ

ఎరుకుల. కాల్వ నెల్లూరు. 42+ కులసూచి

ఎరుకల- ద్రావిడభాష మాట్లాడే ఒక సంచారగణం.

ఎరుకల. పాలెం నెల్లూరు. 63+, 72+; వెంకట. 83+ కులసూచి.

ఎరుకల. రెడ్డిపాలెం కావలి. 25+ కులసూచి.

రెడ్డి. పాలెం గ్రా.ద్వి. కులసూచి.

ఎర్రం రెడ్డి. పల్లె ఉదయ. 37 పురుషనామసూచి.

ఎర్రం < ఎర్ర-అం. ఎర్రని. ఎర్రమీద ఏర్పడే పేర్లు-ఎర్రంరెడ్డి. ఎర్రం శెట్టి, ఎర్రప, ఎర్రభట్టు చూడు. దిగువ ఆరోపాలు.

ఎర్రంశెట్టి. పాలెం వెంకట. 208 పురుషనామసూచి.

ఎర్రగుంట. పాలెం రాపూరు. 80+ స్థలనామసూచి.

ఎర్ర. గుంట వర్ణసూచి

ఎర్రప. గుంట కోవూరు. 16+ పురుషనామసూచి.

ఎర్ర. పల్లె ఆత్మ. 52+, 89+, 112+; రాపూరు. 3 కుటుంబనామసూచి.

ఎర్ర. గొల్ల, కాపు శాఖల్లో, దేవాంగుల్లో ఇంటిపేరు. (CTSI. 7)

ఎర్ర. పాలెం కావలి. 41+; నెల్లూరు. 46+ కుటుంబనామసూచి.

ఎర్రబల్లి. పాలెం ఉదయ. 84+ గ్రామనామసూచి

ఎర్ర. బల్లి కుటుంబనామసూచి.

ఎర్రబొట్ల. పల్లె ఉదయ. 44; రాపూరు 21+ పురుషనామసూచి.

ఎలమంచి. పాడు కోవూరు. 34 గ్రామనామసూచి.

ఎల, మంచి. ? దేవతాసూచి. ఎల < ? ఎల్ల - పొలిమేర. పోల్చిచూడు. ఎల్లమ్మ- ఊరి పొలిమేరలో ఉండే గ్రామదేవత. ఎల్లమీద ఏర్పడే పేరు- ఎల్లయ.

ఎల్లయ. పాలెం కోవూరు. 55 పురుషనామసూచి.

ఎల్లవారి. పాలెం కోవూరు. 17+ కుటుంబనామసూచి.

ఎల్ల-శిరి గూడూరు. 69 స్త్రీదేవతాసూచి. ఎల్ల - ఎల్లమ్మ

ఎల్లావజ్జుల. పల్లె వెంకట. 23 పురుషనామసూచి.

వజ్జుల ౖ ఒజ్జల ౖ < ఒజ్జ-ల. గురువు, ఉపాధ్యాయుడు.

ఎల్లూరు. సూళ్ళూరు. 46 > ఎల్ల - ఊరు. దేవతాసూచి.

ఎ.సి. నగర్ నెల్లూరు 17+, 18+ పురుషనామసూచి.

A. C. Nagar. ఆనం చెంచు సుబ్బారెడ్డి నగర్.

ఏక. శిరి సూళ్ళూరు. 5 [యాకశిరి. మెకం. 344. 59] అస్పష్టం.

ఏకాశిరెడ్డి వారి పాలెం ఉదయ. 107+ పురుషనామసూచి.

ఏకొల్లు సూళ్ళూరు. 72 అస్పష్టం.

ఏగర్ల. పాలెం నెల్లూరు. 44+ కులసూచి.

ఏగర్ల ഗ ఏకర్ల < ఏకరి. లు-అ. ఒకకులం, ముత్రాచ కులానికి
చెందినశాఖ, (CTSI-2)

ఏటి. దిబ్బలు కోవూరు 87+ జలసూచి < ఏరు-టి.

ఏటూరు రాపూరు. 22 ఏటి-ఊరు. జలసూచి.

ఏటూరివారి, పాలెం రాపూరు. 25+ కుటుంబనామసూచి.

ఏతలూరు వెంకట. 149 రూ. యాతలూరు (ము.ప) కులసూచి.
ఏత ഗ యాత. కల్లుగీచే కులం. (CTSI-7)

ఏనుగ. వాడ వెంకట. 200 జంతుసూచి.
ఏనుగ- కాపుకులంలో ఇంటిపేరు (CTSI-7)

ఏపి. నాపి కావలి. 14+ వృక్షసూచి.
ఏపి ഗ ఏపె. నల్లమద్ది, సాలవృక్షం.

ఏపిల. గుంట ఉదయ 97+ వృక్షసూచి. < ఏపి-లు-అ

ఏపూరు రాపూరు. 71 [యేపూరు, మెకం. 349. 162] ఏపి-ఊరు
వృక్షసూచి.

ఏరు. కొల్లు ఉదయ. 86 జలసూచి. ఏరు-చిన్ననది.

ఏరూరు గూడూరు-90 ఏరు-ఊరు. జలసూచి.

ఒకందా. పురం ఆత్మ. 87+ అస్పష్టం.

ఒడ్డె. కండ్రిగ గూడూరు. 88+; సూళ్ళూరు. 64+; 72+ కులసూచి.
ఒడ్డె ഗ వడ్డె. చెరువులు తవ్వడం, ఇల్లుకట్టడం వృత్తిగాగల
ఒక కులం (CTSI-5)

ఒడ్డెగుంట. కండ్రిగ వెంకట. 221 స్థలనామసూచి.
ఒడ్డె. గుంట. కులసూచి.

ఒడ్డె. పల్లె ఉదయ. 88+; వెంకట. 5+, 61 కులసూచి.

ఒడ్డె. పాలెం ఆత్మ. 24+, 36+, 67+, 68+, 108+;
ఉదయ. 78+, 99+; కావలి. 12+, 16+, 52+, 62+, 65+,
కోవూరు. 2+, 22+, 29+, 47+, 48+, 51+, 58+, 68+;
గూడూరు. 5+, 19+, 46+, 77+, 137+;
నెల్లూరు. 16+, 18+, 20+, 41+, 63+, 65+:
సూళ్ళూరు, 21+, 35+, 85+. కులసూచి.

ఒరుగువాండ్ల. పల్లె ఉదయ. 6+ కుటుంబనామసూచి.

ఓంకంవారి. పాలెం కావలి. 52+ కుటుంబనామసూచి.

ఓగూరు. పాడు నెల్లూరు. 15 గ్రామనామసూచి.
ఓగూరు - అస్పష్టం.

ఓజిలి. గూడూరు. 57 [వోజిలి మెకం. 344. 68] ? కుటుంబనామసూచి.
కంసలివాళ్లలో ఇంటిపేరు. (CTSI. 6)

ఓడ. పాలెం కావలి. 68+ అస్పష్టం.

ఓడూరు. గూడూరు. 26 అస్పష్టం.

ఓబులాయ. పల్లె ఆత్మ. 102+; రాపూరు. 70+. పురుషనామసూచి.
< ఓబుల - అయ. ఓబుల < సం. అహోబిల

ఓరు. పల్లె రాపూరు. 94 సంఖ్యానామసూచి. ఓరు - ఒక

ఓలేటివారి. పల్లె కావలి. 23+ కుటుంబనామసూచి.

కంచర. పాలెం కోవూరు. 89+ కులసూచి.
కంచర - కంచుపనిచేసి బ్రతికే ఒక జాతి.

కంచే. పల్లె నెల్లూరు. 62 పురుషనామసూచి
< కంట- ఏ < కంట - అయ్య. ఏకార రూపాలు వ్యక్తినామాలై ఉండవచ్చు. పోల్చిచూడు కంచేపల్లె. కాచేపల్లె, కోనేపల్లె, జక్కేపల్లె మొదలగునవి.

కంచేవారి, పాలెం ఉదయ. 82+ కుటుంబనామసూచి

కండ్రిగ. ఆత్మ. 64+, కోవూరు. 40+; నెల్లూరు 90+ రూ. కండ్రిక. జనపదసూచి. అసమస్తం. కండ్రిగ- చిన్నపల్లె, పన్నులేకుండా గుత్తకిచ్చిన భూఖండం.

కందనాల. పాడు వెంకట. 103 వాస్తుసూచి.
< కందనము-లు-అ. ధాన్యము నిలువచేయుటకు ఇంటిలో నేలలోపల కట్టిన కొట్టు.

కందమూరు. నెల్లూరు. 4 [కందమూరి. 16శ, NI. 2. 25-2] ? వృక్షసూచి
కంద - కంద దుంప

కంపప్పమేస్త్రీ. సత్రం నెల్లూరు. 17+, 18+ పురుషనామసూచి

< కంద - అప్ప < త. కందన్. కుమారస్వామి. మేస్త్రీ- A master workman, A head workman, తాపీపనివాడు.

కందలి. గూడూరు. 17 వృక్షసూచి.

అసమస్తం కందలి- అరటి, ఒకవిధమైన పొద.

కందలి. పాడు నెల్లూరు 57 గ్రామనామసూచి.

కందలి. పేట గూడూరు. 17+ గ్రామనామసూచి.

కందులవారి. పల్లె వెంకట. 13 కుటుంబనామసూచి.

< కందులు-అ ఏక. కంది. కందిచెట్టు Morinda bracteata, Roxb. కందుల- ఎరుకలవాళ్లలో ఇంటిపేరు. (CTSI. 3)

కందులవారి. పాలెం కావలి. 23+ కుటుంబనామసూచి.

కంప. సముద్రం ఉదయ. 101 పురుషనామసూచి.

[మానవుడైన కంపడు ఈ గ్రామం కట్టించెను గనుక కంప సముద్రం అనిపేరు వచ్చింది. (UT. FF. P. 96)]

కంబాల. పల్లె రాపూరు. 56 చూ. కంబాలపాడు. (ALV) కుటుంబనామసూచి.

< కంబము-లు-అ ఏక. కంబము < సం. స్తంభ. మాది; కోమటి కులాల్లో ఇంటిపేరు. (CTSI-3)

కంసాలి. పాలెం కావలి. 59+ కులసూచి. చూడు (CTSI-3)

కచ్చివారి. కండ్రిగ నెల్లూరు. 81+ కుటుంబనామసూచి.

కచ్చి- సాలెవాడు కొయ్యలను పడుగు నందు చొప్పించెడు సందు (ఆం.శ.ర)

కచ్చేరి. దేవరాయపల్లె ఆత్మ 60+ పరిపాలనాసూచి

< ఉ. కచ్చేరి- An office, A court, A hall. దేవరాయ. పల్లె గ్రా.ద్వి. వ్యక్తినామసూచి.

కటారి. పాలెం నెల్లూరు, 17+, 18+ కుటుంబనామసూచి.

< కటారు-ఇ, బాకు, కత్తి. గొల్ల, ముత్రాచ, ఎరుకల వాళ్లలో ఇంటి పేరు. (CTSI-3)

కట్టకింద. ఒడ్డెపాలెం నెల్లూరు. 66+ స్థలార్థకసూచి.

కట్ట ఌ కట్టవ. పొలంలో పడ్డ నీళ్లను మట్టి కొట్టుక పోకుండా మధ్య వేసిన మట్టికట్ట. ఒడ్డె. పాలెం గ్రా.ద్వి. కులసూచి.

కట్టకింద కండ్రిగ కోవూరు. 74+ స్థలార్థకసూచి.

కట్టకింద. పల్లె ఉదయ. 88+ స్థలార్థకసూచి.

కట్టకింద. యానాదిపాలెం. నెల్లూరు. 65+ స్థలార్థకసూచి.

యానాది. పాలెం గ్రా.ద్వి. కులసూచి.

కట్టకింది. పాలెం కావలి. 58+ స్థలార్థకసూచి. కట్టకింద-ఇ.

[చెరువు కట్టకింద ఉండే గ్రామం కాబట్టి దీనికి కట్టకిందిపాలెం అనే పేరు వచ్చింది. ఇది ఆనెమడుగు మజరాగ్రామం (KT. FF. P. 153)]

కట్టుబడి. పాలెం కోవూరు. 3+, 46+. పరిపాలనాసూచి.

కట్టుబడి- సేవచేసే భృత్యులు మొదలైన వాళ్లకు శాశ్వతంగా ఇచ్చే మాన్యం (సూని)

కట్టువ. పల్లె నెల్లూరు. 107, సూళ్ళూరు 63 స్థలార్థకసూచి.

కట్టువ. ఌ కట్టవ 

కడ. గుంట వెంకట. 117 దిక్సూచి. కడ-చివర, సరిహద్దు

కడ. నూతల కావలి. 71+ [పోరితినాంటిలోని కడువ నూంతి ?

1217-18 NI.2.31. 3-4; కడ్వనూతుల 1660.NI.2.44.5. (కడ్వనూతుల-కడనూతుల)] దిక్సూచి. 

కడ. పత్ర సూళ్ళూరు. 158 దిక్సూచి. 

కడి. వేడు గూడూరు. 34 అస్పష్టం. 

కదిరినాయుడు. పల్లె ఉదయ. 107+ పురుషనామసూచి.

కదిరి. అనంతపురం జిల్లాలో గ్రామనామం. నాయుడు - కులసూచి. పురుష నామానుబంధం

కదిరినేని. పల్లె ఉదయ. 112 పురుషనామసూచి.

కదిరి- గ్రామనామం. నేని < నాయుని

కనక. పురం నెల్లూరు 17+, 18+ స్త్రీనామసూచి.

కనియం. పాడు ఉదయ. 56? దేవతాసూచి <? కనియ-అం < కన్య-అమ్మ.

కను. పర్తి   రాపూరు. 35 [కానుపర్తిగా చెరువు ? 1629-30 NI. 3 33.7]
? వృక్షసూచి. కను < కనుప < కనుము-ప. కనుముగడ్డి, రెల్లు, Sorghumhalepense, pers. కనుము, కనుపర్తి- దేవాంగుల్లో ఇంటి పేరు.

కనుపర్తి. పాడు   నెల్లూరు. 49 కుటుంబనామసూచి.

కను. పూరు   గూడూరు. 96; నెల్లూరు 59, 95 (Bit I 59, Bit. II 95)
? వృక్షసూచి.

కనుపూరు. పల్లె   ఆత్మ. 96; రాపూరు. 21 గ్రామనామసూచి.

కన్నదరువువారి. పాలెం   ఆత్మ. 36+ కుటుంబనామసూచి.

కపాడి. పాలెం   నెల్లూరు 17+, 18+ రూ. కబాడిపాలెం (ము. ప.)
కులసూచి. కబాడి లేక కపాడివారు. వీరు మాలలైనను గోమాంసం తినరు. వీరి పూర్వులు తెలంగాణాన సైనికులుగానుండి నెల్లూరునకు వచ్చిరి. వీరిని దండువాళ్లు అనికూడా అందురు. (మా. ప.)

కప్పరం. పాడు   గూడూరు. 125 ? గ్రామనామసూచి. డేవరాకు
కప్పరం < ? కాపువరం. కులసూచి.

కప్పరాళ్ల. తిప్ప కావలి. 81+; కోవూరు. 10+ శిలాసూచి.

కమ్మ. కండ్రిగ   సూళ్ళూరు. +90 కులసూచి కమ్మ. ఒకకులం (CTSI 3)

కమ్మ. పల్లె   వెంకట. 7+, 156 కులసూచి.

కమ్మ. పాలెం   కావలి. 12+, 41+, 79+; కోవూరు. 51+;
రాపూరు. 19+; వెంంట. 83+ కులసూచి.

కమ్మవారి. పల్లె   ఆత్మ. 72+: వెంకట. 19+ కులసూచి.

కమ్మవారి.పాలెం ఆత్మ. 18+; ఉదయ. 86+, 88+, 116+; కావలి. 52+. 76+; గూడూరు. 34+. 72+; సూళ్ళూరు. 10+ కులసూచి.

కయ్యూరు   వెంకట. 122 కయ్య - ఊరు. భూసూచి.
కయ్య - మడి, మాగాణిచేను.
కరటం. పాడు   ఆత్మ 5. [కరటంపాడు. మెకం 349. 155]
జంతు సూచి, కరటం - కాకి.

కర. బల్లవోలు  వెంకట. 211 స్థలసూచి.

కర- గట్టు, ఒడ్డు; బల్ల. వోలు. గ్రా. ద్వి. కుటుంబనామసూచి.

కరటా. మూడి  సూళ్ళూరు. 62 ? జంతుసూచి. కరటా ᔕ కరటం

కరిమెన. గుంట  వెంకట. 176  [కరి మెన గుంట. మెకం 344. 19]

పురుషనామసూచి. < కరిమి - అన < త. కరి- నల్లని

కరేటివారి. పాలెం  కావలి. 59+ కుటుంబనామసూచి.

< కరేడు-ఇ ప్రకాశంజిల్లాలో గ్రామనామం.

కర్ల. పూడి  గూడూరు. 100 భూసూచి.

కర-ల < క. కళ. ఉప్పునేల

కర్కోలు. పాలెం  కావలి. 50+ రూ. కారుకోలుపాలెం (TSM) పరిపాలనా సూచి < హిం. కార్కోను. రెవిన్యూఇన్స్పెక్టరు.

కలకుర్తి. పాడు  సూళ్ళూరు. 31 స్థలనామసూచి.

కల. కుర్తి. శిలాసూచి. < కల్లు. కల్లు, రాయి.

కల. పాడు  వెంకట. 46 శిలాసూచి.

కల. వంగు  సూళ్ళూరు. 165 రూ. కలవాంగు (ముప) శిలాసూచి.

కలవ. కొంత  గూడూరు. 44 వృక్షసూచి.

కలవ ᔕ కలువ. Water lily or Lotus.

కలువ. పూడి  వెంకట. 154 [కల్వలపూడి. మెకం344.13] వృక్షసూచి.

< కలువలు-అ

కలి.గిరి  కావలి. 16 వృక్షనామసూచి.

కలి- కలేచెట్టు, కలిమిచెట్టు, చిన్నముండ్ల పండ్లచెట్టు. Carissa Carandas, Linn.

కలిగిరి, కొండూరు  కోవూరు. 37 గ్రామనామసూచి.

కొండూరు. గ్రా.ద్వి. శిలాసూచి

కలిగిరి చెఱువు - దీనికొక గాధ గలదు. బుచ్చిరెడ్డి పాలెమునకు షుమారు మూడుమైళ్ల దూరములో మునులపూడి గ్రామమున్నది. పూర్వము మునులీ ప్రాంతములో నుండబట్టి ఆపేరు వచ్చియుండవచ్చును. ప్రస్తుత కలిగిరి రిజర్వాయర్ ముందు భాగములో చెట్లువేములున్నవి. ఆ ప్రదేశములో వారు తపస్సు చేసుకొనువారట. ఆసమయములో కలిగిరి అను కుమ్మరి వాడుండెను.

అతడు భక్తుడు. అతనికి ఒకరోజు తనపేరు శాశ్వతముగా నుండుటకై గొప్ప చెఱువును త్రవ్వించ వలెనని కోర్కెగల్గెను. అప్పుడతడు అచ్చటనున్న మునులకు తనకోరిక విన్నవించుకొని సాఫల్యము కొరకు భగవంతుని ప్రార్థింపుడని కోరెనట. ఋషులు నీవు చెఱువు నిర్మించవలెనని కోరుకున్న ప్రదేశము వైపు నడచి పొమ్ము. భగవంతుని సహాయమువలన దానికై అదే ఏర్పడును. అనిచెప్పి ఈ షరతులు పెట్టిరి. ప్రాణాపాయము వచ్చినను, నీవు తిరిగి చూడకూడదని. అతడు ఆనందభరితుడై వంగల్లుకొండను వేదగిరి నరసింహ కొండను కలిపి గొప్పతటాకము నేర్పరచవలెనను కోరికతో బయలుదేరి పోవు చుండగా యక్షగంధర్వులు, అతని వెనుకవైపున పెద్దరాళ్లతో పిడుగు శబ్దములతో చెఱువు కట్టను కట్టుకొనుచు వచ్చుచుండిరి. కలిగిరి భయంకర శబ్దమును భరించుచూవచ్చి, ప్రస్తుత వవ్వేరు గ్రామము వద్దకు వచ్చునప్పటికి ఆశబ్దమును భరించలేక వెనుతిరిగి చూసెను. మునులు పెట్టిన షరత్తు భంగమైనందున, కలిగిరికి తక్షణమే కన్ను పోయెను. అతడు మరల స్థిర సంకల్పముతో బయలుదేరి వెళ్లుచుండగా రాళ్లశబ్దము భరింప రానిదై తనను చంపుటకు వచ్చుచున్నవాయని భయము కల్గినను కష్టముమీద మూల కట్టలను ప్రదేశము వద్దకు వచ్చి తిరిగి చూచి మృతి పొందెను. అందుచేత ఆచెరువుకు అతనిపేరు పెట్టబడెనందురు. ఈ గాథయు విచారణీయమే.

1786 - 87లో నిర్మింపబడిన ఈ భూరి తటాకము ఎప్పుడుగాని పూడిక తీయనందున యీనాటి చాలవరకు మిట్టలు ఏర్పడినది. (వి. మం. స. పు. 54)

కలి. చేడు రాపూరు. 49 [కలిచెట్టచెర్వు. 1638-39 NI. 3. 30. 4] వృక్షసూచి

కలు. వాయ ఆత్మ. 77 [కలువాయిచెరువు. 1519-20. NI. 1. 28. 12-13; కలువాయ చెరువు 1612-13. NI. 1. 35-15] శిలాసూచి.

కలు- కల్లు, రాయి.

కల్లి. పేడు గూడూరు. 61 వృక్షసూచి.

కల్లి- The plant called Milk hegde. Euphorbia Tirucalli (TL. 2)

కల్లూరు ఆత్మ. 75; గూడూరు 132; సూళ్ళూరు. 92; కల్లు - ఊరు శిలాసూచి. కల్లు - రాయి- కొండ.

కల్లూరు. కండ్రిగ  సూళ్ళూరు. 60 కుటుంబనామసూచి.

కల్లూరు. బ్రాహ్మల్లో, తెలుగు మాలల్లో, రెడ్లల్లో, దేవాంగుల్లో ఇంటిపేరు.

కల్లూరు. పల్లె  నెల్లూరు 53 కుటుంబనామసూచి.

కళ్యాణ. పురం  రాపూరు. 42+ దేవతాసూచి.

కసుమూరు నెల్లూరు. 58 ? జలసూచి.

<కసుం. - ఊరు  కసుం ల కసెం. ఊటగుంట, చెమ్మనేల

[ఈ గ్రామం కసుపుకు ప్రాముఖ్యత చెందింది కాబట్టి కసుమూరు అని పేరు వచ్చింది. (NT. FF. P. 18)]

కస్తూరిదేవి. నగర్  నెల్లూరు 17+, 18+ స్త్రీనామసూచి.

కస్తూరి నాయుడు. పల్లె  కావలి. 1 పురుషనామసూచి.

కస్బా. రెడ్డిపాలెం  సూళ్ళూరు. 118+ పరిపాలనాసూచి.

<ఉ. కస్బా. ప్రధానగ్రామం. రెడ్డి. పాలెం. గ్రా.ద్వి. కులసూచి

కాండ్ర  గూడూరు. 25 వృక్షసూచి

అసమస్తం. ఒకజాతి గడ్డి.

కాకర. మాల  సూళ్ళూరు. 161 కుటుంబనామసూచి.

కాకర- ఒక తీగచెట్టు Mordica Charantia linn. కాకర, కాకర్ల, కమ్మ, మూకదొర కులాల్లో ఇంటిపేరు. (CTSI. 3)

కాకర్ల. పాడు  ఆత్మ. 22  కుటుంబనామసూచి. <కాకర-లు-అ

కాకర్ల. పాలెం  ఉదయ. 41+ కుటుంబనామసూచి.

కాకి తలుపూరు  నెల్లూరు. 111 రూ. కాగితలపూరు (ముప); కాగితాలపూరు (జ. ప్రో.) ? వృక్షసూచి.

కాకి- కాకివెదురు, కాకిరెల్లు, A common spinous shrub.

కాకి. వాయ  ఆత్మ. 87 రూ. కాకివాయి ? వృక్షసూచి.

కాకుటూరు  నెల్లూరు. 54 జనపదసూచి. చూడు. క్రాకుటూరు

కాకు. పల్లె  నెల్లూరు. 48, 65 (Bit I 48, Bit II 65) జనపదసూచి. చూడు. పైన.

కాకువారి. పల్లె  ఆత్మ. 60+ కుటుంబనామసూచి.

కాకువారి. పాలెం  గూడూరు. 99+ కుటుంబనామసూచి.

కాపే. పల్లె ఉదయ. 82 రూ. కోటేపల్లె (ALV) పురుషనామసూచి.

< కాట-ఏ < కాట-అయ్య

కాపే. పల్లె. నెల్లూరు. 78+ పురుషనామసూచి.

కాపేరి. మిట్ట సూళ్ళూరు. 158+ దేవతాసూచి.

కాపేరి. ఒకానొక క్షుద్రదేవత.

కాట్ర. గుంట వెంకట. 131 ? వృక్షసూచి. <? కాంద్ర

కాట్రాయ. పాడు కావలి. 32 [అగ్రహారము కాట్రవాపియైన తిరువెంగడ నాథ చతుర్వేదిమంగలం 1309-10 NI.2.35.7-9; కాట్రవాపి అగ్రహారము 1309-10. NI.2.35. 16-17: కాట్రావిపాటి ? 1312-13 NI.2.36.4-5; కాట్రావిపాటి? 1228-29 NI.2.38.9] దేవతాసూచి.

< కాట్-రాయ. శివుడు.

కాదలూరు సూళ్ళూరు. 123 అస్పష్టం.

కాదలూరు. కట్టవ సూళ్ళూరు. 123+ గ్రామనామసూచి.

కానూరు సూళ్ళూరు. 24 [కానూరి. మెకం. 354.250] కాన-ఊరు అటవీసూచి

కాపు. పాలెం కావలి. 12+ కులసూచి.

కాపు- ఒక కులం, నెల్లూరు మాండలికంలో కాపులంటే రెడ్లు.

కాపులూరు గూడూరు. 62 కులసూచి.

కామ. కూరు వెంకట. 172 పురుషనామసూచి.

< సం. కామః-మన్మథుడు. కామమీద ఏర్పడే పేర్లు- కామాక్షి; కామినేని, కామిరెడ్డి.

కామాలవారి. పాలెం కావలి. 16+ కుటుంబనామసూచి.

కామాక్షి. నగర్ నెల్లూరు 17+, 18+ స్త్రీనామసూచి.

కామినేని. పాలెం కోవూరు. 6 పురుషనామసూచి.

కామిరెడ్డి పాడు ఆత్మ. 66 పురుషనామసూచి.

కారి. కాడు సూళ్ళూరు. 157 రూ. కారెకాడు. వృక్షసూచి.

కారి లా కారె. ఉప్పుగడ్డి, ఒకానొక జాతిగడ్డి.

కారి. జాత సూళ్ళూరు. 139 వృక్షసూచి.

కారుగోగుల. పాడు ఆత్మ. 15 వృక్షసూచి.

కారు- అడవి. గోగుల < గోగులు-అ. గోగుచెట్టు. Hibiscus Cannabinus Linn.

కారుమంచివారి. కండ్రిగ సూళ్ళూరు. 20 కుటుంబనామ సూచి.

కారూరు వెంకట. 201; సూళ్ళూరు. 148 కారు-ఊరు. అటవీసూచి.

కారూరు. మిట్ట సూళ్ళూరు. 148+ గ్రామనామసూచి.

కార్జ. మేడు వెంకట. 190 ? జలసూచి.

కార్జ ల కార్జి < ఉ. కాదింజా-నీటిబుగ్గ (బ్రౌణ్యం)

కాలంబొట్లవారి. కండ్రిగ కోవూరు. 27 రూ. కాలం భట్ల కండ్రిగ (ALV) కుటుంబనామసూచి.

కాల. గంధ వెంకట. 135 వృక్షసూచి.

అసమస్తం. కాలగంధ- నల్లచందనం చెట్టు.

కాలువ. గట్టు నెల్లూరు. 44+; సూళ్ళూరు. 19+ స్థలసూచి.

కాళయ. కాగొల్లు కోవూరు. 65 పురుషనామసూచి. కాళ-అయ్య-శివుడు

కాళయ. పాలెం ఆత్మ 93 పురుషనామసూచి

కావలి కావలి. 61,62 (Bit I 62, Bit II 61) [ఉదయగిరి శీమలోని కావలిగ్రామాన 1636-37. NI.2 50. 8-9] పరిపాలనాసూచి.

అసమస్తం, కావలి. guard (MAMP) < కావు-వలి. రక్షణ (ఆశర) [పురాతన కాలంలో రాజులు పాలించేటపుడు వారి కావలివారు నివసించే ప్రాంతం కావటంవల్ల దీనికి కావలి అనిపేరు వచ్చింది KT.FF.P. 153]

కావలి. మిట్ట సూళ్ళూరు 149+ గ్రామనామసూచి.

కావలి. ముస్తఫాపురం. ఆత్మ 21 రూ. కావలి ముస్తాపురం (ము.ప) గ్రామనామసూచి. ముస్తఫాపురం పురుషనామసూచి

< అర. ముస్తఫా. to choose, the name or title of Mohammed, a Proper name

కావలి. ఎడవల్లి ఆత్మ. 24 గ్రామనామసూచి. ఎడి. వల్లి గ్రా.ద్వి. దిక్సూచి. ఎడవల్లి సీతారామయ్య అనే బ్రహ్మణుడు ఈ ఊరికి శంఖుస్థాపన చేయడం వల్ల, ఈ గ్రామం ఇతంకు ముందు కావలి తాలూకాకు చెందిన దానివల్ల దీనికి కావలి ఎడవల్లి అనేపేరు వచ్చింది. (AT. FF. P. 70)

కావేటి. పాలెం కోవూరు. 59 ? కుటుంబనామసూచి.

< కావి-ఏటి. కావి-ఎరుపు, ఎర్రని

కాసంగట్టు. కుప్పం  సూళ్ళూరు. 148+ స్థలనామసూచి.

కాసం.గట్టు జలసూచి కాసం <? కసెం. ఊటగుంట. గట్టు-ఒడ్డు, తీరం

కాసులనాటివారి. కండ్రిగ  రాపూరు. 13 కుటుంబనామసూచి.

< కాసులనాడు-ఇ నాడులలో కాసలనాడు ఒకటి.

[కాసలనాడు- అనగా వనపత్తి దీర్ఘాపి శాసనమున పేర్కొనబడిన దక్షిణ కోసల, ఇది ఉత్కళదేశమునకు దక్షిణ-పశ్చిమ ప్రాంతమున నున్నది. తూర్పు సముద్ర తీరమునకు నూరుమైళ్ల దూరముననున్న ప్రదేశము. ఈ ప్రాంతమునుండి వచ్చిన బ్రాహ్మణులను 'కోసలేయులు' లేక 'కాసనాటు' లని యందురు. (సంగ్రహాంధ్రవిజ్ఞాన కోశం సం. 5 పు. 199)]

కాశీ. పురం  గూడూరు. 74 పురుషనామసూచి.

కాశీ. పేట  వెంకట. 83+ పురుషనామసూచి.

కిస్తీ.పురం  ఆత్మ. 11 పరిపాలనాసూచి.

< హిం. కిస్త్. పన్ను, వాయిదాచొప్పున డబ్బుచెల్లించే పద్ధతి.

కుంకుం. పూడి  నెల్లూరు. 55 కుటుంబనామసూచి.

కుంకుంవారి. పల్లె  ఉదయ. 113+ కుటుంబనామసూచి. కుంకు-కుంకుడుచెట్టు

కుంకువారి. పాలెం  కావలి. 44 కుటుంబనామసూచి.

కుంట. నెల్లిపాడు  ఉదయ. 107+ స్థలసూచి.

కుంట ల గుంట. జలాశయము, నీటిదొరువు. నెల్లి. పాడు (గ్రా.ద్వి) వృక్షసూచి.

కుంట్ల. మిట్ట  కోవూరు. 74+. జలసూచి. < కుంట-ఇ-అ

కుందన. పురం  వెంకట. 148+ సావృశ్య బోధకసూచి.

కుందన ల కుందనం. అపరంజి, మేలిబంగారు.

కుందాం.  వెంకట. 199 ? సస్యసూచి.

అసమస్తం. కుందాం ల కుంధం - గుండ్రంగావేసిన గడ్డికుప్ప (ఆశర)

కుందుకూరు  గూడూరు. 23 అస్పష్టం.

కుక్కపల్లె. కండ్రిగ  సూళ్ళూరు. 57+ రూ. కుక్కపల్లెవారికండ్రిగ (TSM) కుటుంబనామసూచి.

కుక్కల. గుంట నెల్లూరు. 17+. 18+ కుటుంబనామసూచి.

కుక్కల - ఓరుగంటి కాపుల్లో, బోయల్లో ఇంటిపేరు. (CTSI. 4)

కుడితి. పాలెం నెల్లూరు. 31 ? కుటుంబనామసూచి.

ఌ కొడితి. రెడ్లకులంలో ఉపశాఖ (బ్రౌణ్యం)

కుడుముల దిన్నె పాడు. కావలి. 14+ స్థలనామసూచి.

కుడుముల. దిన్నె కుటుంబనామసూచి. కుడుములు - అ. ఒకానొక తినుబండారము. రెడ్లలో ఇంటిపేరు.

కుదిరి. సూళ్ళూరు. 138 జనపదసూచి.

అసమస్తం < కుదురు. ఆధారం, స్థానం, నెలవు. ఉనికిపట్టు. పోల్చిచూడు- కొలనుకుదురు.

కుప్పం. సూళ్ళూరు. 141+, 147+, 150+. జనపదసూచి.

అసమస్తం. చిన్నపల్లె, మజరా గ్రామం, నెల్లూరుజిల్లా గ్రామనామాల్లో గ్రామనామ ద్వితీయావయవంగా కూడా కన్పిస్తుంది. చూడు. కొత్తకుప్పం

కుప్పం. పల్లె వెంకట. 98 గ్రామనామసూచి.

కుప్పచ్చివారి. కండ్రిగ నెల్లూరు. 78+ కుటుంబనామసూచి.

కుప్పయ. పాలెం వెంకట. 10 [కుప్పయపాలెం. మెకం. 344. 100]

పురుషనామసూచి < కుప్ప-అయ. నిందార్థకనామం కుప్ప-పెంట, రాశి. చూడు. కడూని. కుప్పంమీద ఏర్పడేపేర్లు - కుప్పయ్య, కుప్పారెడ్డి. చూడు దిగువ ఆరోపాలు.

కుప్పారెడ్డి. పాలెం సూళ్ళూరు. 72+ పురుషనామసూచి.

కుప్పూరు. పాడు ఆత్మ. 47 గ్రామనామసూచి.

కుప్పూరు < కుప్ప-ఊరు. పురుషనామసూచి.

కుమారవెంకటా. పురం కావలి. 45 పురుషనామసూచి.

కుమ్మర. కొండూరు కావలి. 37 కులసూచి.

కుమ్మర. కుండలుచేసే ఒక కులం. కుమ్మరవాండ్లు. కొండూరు గ్రా.ద్వి. శిలాసూచి.

కుమ్మర. గుంట ఆత్మ. 77+; కోవూరు. 84+; వెంకట. 87 కులసూచి.

కుమ్మర. పాలెం కావలి. 59+; నెల్లూరు. 79+; సూళ్ళూరు 49 కులసూచి.

కుమ్మర. పేట వెంకట. 155 కులసూచి.

కుమ్మరూరు నెల్లూరు. 89+ కుమ్మర-ఊరు. కులసూచి.

కురవవాని. పల్లె ఉదయ. 39+ కులసూచి.

కురవ- గొర్రెలకు కాపరులైన ఒక అతిప్రాచీనమైన ద్రావిడగణం. చూడు కురవవాడు- గొల్లవాడు, గొర్రెలకాపరి

కురు. గొండ గూడూరు. 50 పరిమాణసూచి క్కరు-చిన్న, పొట్టి.

కురుచెర్ల. పాడు నెల్లూరు 97 స్థలనామసూచి.

కురు. చెర్ల పరిమాణసూచి.

కుర్ర. పట్టపుపాలెం కోవూరు. 17+ కులసూచి.

కుర్ర- < కురవ. చూడుపైన, పట్టపు. పాలెం గ్రా.ద్వి. కులసూచి.

కుర్ర. పల్లె ఉదయ. 64 కులసూచి. చూడుపైన.

కుర్జా. గుంట వెంకట. 64 ? జలసూచి

<? కార్జ. పోల్చిచూడు. కార్జమేడు.

కూచి. పూడి గూడూరు. 65+ పరిమాణసూచి.

కూచి. 'చిన్న' అనేముద్దుపేరుకు సంబంధించింది. అరవంలో మళయాళంలో 'కుట్టి' లాంటిది-తెలుగులోని ఈ 'కూచి'. అందుకే లింగవివక్ష లేకుండా అది కూచిఅది నాన్నకూచి వ్యవహారంలో ఉంది.

కూచి. వాడ గూడూరు. 65 పరిమాణసూచి.

కూచివాడ. పాలెం గూడూరు. 65+ గ్రామనామసూచి.

కూనలమ్మ. పాడు ఆత్మ. 26 స్త్రీదేవతాసూచి.

కూనలమ్మ- ఒకానొక గ్రామదేవత. సంతానార్థం ఈ దేవతను కొలుస్తారు. వ్యు. కూనలిచ్చు అమ్మ (ఆళర)
[ఆయేషాపూర్ మహమ్మదు (నాయబేరసూల్) భార్య బీబీ ఆయేషా పేరనున్నది. దీనినిపుడు కూనలమ్మ పాళెమని వ్యవహరించుట కలదు. ఇది మసీదుకు తూర్పున నున్నది. (వి. మం. స. పు. 180)]

కేతు. గుంట ఆత్మ. 64+ కుటుంబనామసూచి. కేతు - ధ్వజం, జెండా.

కేశమనేని. పల్లె రాపూరు. 20 పురుషనామసూచి.

కేశమ < సం. కేశవః- విష్ణువు. నేని < నాయుని.

కేశ. వరం కావలి, 48; గూడూరు. 46 పురుషనామసూచి.

కైకాల. పాలెం సూళ్ళూరు. 55+ కులసూచి.

< కైకోల. కైకాలవాండ్లు- బట్టలునేసి బ్రతికెడు ఒకానొక జాతి. సాలెవాండ్లు. త. కైక్కోళన్. చూడు. (CTSI. 3)

కైలాసనాథ. పురం వెంకట. 69 పురుషదేవతాసూచి.

కైలాసనాథ - శివుడు.

కొండ. గుంట గూడూరు. 46+ శిలాసూచి. కొండ - పర్వతం, గుట్ట.

కొండపల్లె. పాడు గూడూరు. 51 గ్రామనామసూచి.

కొండ. పల్లె శిలాసూచి.

కొండ. బిట్రగుంట కావలి. 75+ స్థలసూచి. (శిలాసూచి)

బిట్రగుంట గ్రా. ద్వి.

కొండమీద. కొండూరు ఆత్మ. 48 స్థలార్థకసూచి.

కొండూరు. గ్రా. ద్వి. శిలాసూచి.

కొండలరాయుని. కండ్రిగ ఆత్మ. 102+ దేవతాసూచి.

< కొండలరాయుడు-ఇ ఏడుకొండలవాడు (వేంకటేశ్వరుడు)

కొండ. లేడు సూళ్ళూరు. 162 శిలాసూచి. <? కొండల - వీడు

కొండాంగు. పాలెం కోవూరు. 83+ అస్పష్టం.

కొండా. గుంట గూడూరు. 8 పురుషనామసూచి

వ్యక్తినామ ప్రథమ అవయవాల్లో కొండశబ్దానికి కనిపించే రూపం కొండా. దేవాంగ, మేదర కులాల్లో ఇంటిపేరు. (CTSI. 3) కొండమీద ఏర్పడే పేర్లు - కొండయ ~ కొండాయ. కొండారెడ్డి, కొండ్రాజు, కొండ్రాయ. చూడు దిగువ ఆరోపాలు.

కొండా. పురం గూడూరు. 77 పురుషనామసూచి.

కొండాయ. గుంట కోవూరు. 16+, 23+. పురుషనామసూచి.

కొండాయ. పాలెం ఉదయ. 30; కోవూరు. 17+; నెల్లూరు. 19 పురుషనామసూచి.

కొండారెడ్డి. పల్లె ఉదయ. 41+, 60+ పురుషనామసూచి.

కొండారెడ్డి. పాలెం కావలి. 14+ పురుషనామసూచి.

కొండూరు. కోవూరు 57+; గూడూరు. 124; సూళ్ళూరు. 122 A.

కొండ - ఊరు. శిలాసూచి.

కొండ్ల. పూడి నెల్లూరు. 12+ శిలాసూచి < కొండలు - అ

నల్లచెరువు. కట్ట కోవూరు. 22+ స్థలనామసూచి

నల్ల. చెరువు వర్ణసూచి

నల్లపరెడ్డి. పల్లె ఆత్మ. 97+ పురుషనామసూచి

నల్ల. పాలెం ఆత్మ. 110 కుటుంబనామసూచి

నల్ల - కొప్పుల వెలమల్లో ఇంటిపేరు.

నల్లబోతులవారి. పల్లె ఉదయ. 60+ కుటుంబనామసూచి

నల్లబోతుల - కమ్మల్లో ఇంటిపేరు

నల్లయగారి. పాలెం గూడూరు. 40+ పురుషనామసూచి

నల్లయ. దిబ్బ నెల్లూరు 41+ పురుషనామసూచి

నల్లారెడ్డి. పల్లె ఉదయ. 81+ పురుషనామసూచి

నవలాకుల. తోటలు నెల్లూరు, 25+ వృక్షసూచి

< నవలాకులు-. పత్తిచెట్టు ఆకులు

నాంచారమ్మ. పల్లె ఉదయ. 10+ స్త్రీదేవతాసూచి

నాంచారమ్మ- అమ్మవారు, దేవత < త. నాచ్చియార్

నాంచారమ్మ. పేట గూడూరు. 38+ స్త్రీదేవతాసూచి

నాగంబోటువారి. కండ్రిగ నెల్లూరు. 91+ కుటుంబనామసూచి

నాగమాంబా. పురం కోవూరు. 56 స్త్రీనామసూచి

< నాగపు - అంబ. నాగపు < నాగ-అమ్మ. నాగ - పాము < సం. నాగః అంబ-స్త్రీనామానుబంధం. నాగమీద ఏర్పడే పేర్లు- నాగమాంబ, నాగయ, నాగరాజు, నాగిరెడ్డి, నాగినేని. చూడు దిగువ ఆరోపాలు.

[ఒకసారి గోల్కొండ నవాబు ఈ ప్రాంతాన్ని దర్శించినపుడు నారమాంబ అనే ఆమె గౌరవభావంతో స్వాగతం పలుకగా నవాబు ఈ గ్రామాన్ని బహుమతిగా ఆమెకిచ్చాడు. ఆమె పేరుమీద ఈ గ్రామం ఏర్పడింది. (CO. FF. P. 173)

నాగయ. గుంట కోవూరు. 57+ పురుషనామసూచి

నాగరాజు. తోపు నెల్లూరు. 28+ పురుషనామసూచి

నాగరాజు. పల్లె   ఉదయ. 7+   పురుషనామసూచి.

నాగరాజు. పాడు   ఉదయ. 114+   పురుషనామసూచి

నాగరాజు. పురం   సూళ్ళూరు. 118+   పురుషనామసూచి

నాగ. వోలు   వెంకట. 42   నాగ పుడోల్ ఉరఫ్ రాజమల్ల చతుర్వేదిమంగళం 13౪. Nl. 3. 2,8,9. Note. Nāgapuḍōl is the old name of the Nāgavōlu]   పురుషనామసూచి

నాగ. సముద్రం   కావలి. 18   పురుషనామసూచి

నాగినేని. గుంట   ఉదయ. 105   పురుషనామసూచి

నాగిరెడ్డి. పాలెం   ఆత్మ. 19+; కావలి. 18+. 52+,   పురుషనామసూచి

నాగుల. కట్ట   కోవూరు. 68+   జంతుసూచి

<నాగులు-అ. నాగదేవతలు. ఏక. నాగ - పాము

నాగుల. గుంట   నెల్లూరు. 81+; వెంకట. 83+   జంతుసూచి

నాగుల. పాడు   ఆత్మ. 54; వెంకట. 33   జంతుసూచి

నాగుల. మ్రి   గూడూరు. 121   జంతుసూచి

నాగుల. వరం   కావలి. 81+; నెల్లూరు. 61   జంతుసూచి

నాగుల. వెల్లటూరు   ఆత్మ. 92   జంతుసూచి

వెల్ల. టూరు గ్రా.ద్వి.   కుటుంబనామసూచి

నాటకాల. దిబ్బ   కోవూరు. 47+   సంఘటనసూచి

నాట్టరు. పాలెం   సూళ్ళూరు. 169   రూ. నాటారుపాలెం (N.C. 71) కులసూచి

నాట్టర్ - తమిళల్లో ఒకకులం. పోల్చిచూడు. కామరాజనాడార్.

నావెల్లవారి. కండ్రిగ   సూళ్ళూరు. 101 కుటుంబనామసూచి

నామ. కాడు   గూడూరు. 109, 110 (Bit I 109, Bit II 110) అస్పష్టం

నాయుడుచెర్వు. కట్ట   కోవూరు. 48+ స్థలనామసూచి

నాయుడు. చెర్వు. కులసూచి. నాయుడు - నాయకుడు, బిరుదు (CTSI-5)

నాయుడుచెర్వు. పాలెం   కోవూరు. 24+ స్థలనామసూచి

నాయుడు. పేట ఉరఫ్ లక్ష్మిఅనంతసాగరం సూళ్ళూరు. 19 [సగటూరి తాలూకు లక్ష్మి అనంతసాగరానికి ప్రాచీన నామమైన అగ్రహారపేట. మెకం. 344.26; సగటూరు తాలూకు నాయనిపేట మెకం. 344.31] కులసూచి.

[సగటూరి తాలూకాలో నాయుడుపేట నిర్మాణం వెంకటగిరి జమీందారీలలో 24వ తరానికి చెందిన బంగారు యాచమ నాయుడు (1772-76) చేసిన పనులలో పేర్కొనదగినది. (డా. కాళిదాసు పురుషోత్తంగారి అముద్రిత సిద్ధాంత వ్యాసం. 'గోపీనాథ వెంకటకవి. వెంకటగిరి సంస్థాన కవులు', ఉస్మానియా. 1970)]

[వెంకటగిరి జమీందారైన బి.గారు యాచమనాయుడు ఈ ప్రాంతాన్ని కృతజ్ఞతా చిహ్నంగా వైశ్యుల కివ్వటంవల్ల నాయుడుపేట అని పేరు వచ్చింది. (ST, FF. P. 42)]

నాయుడు. పాలెం కోవూరు. 52; గూడూరు. 16+; నెల్లూరు. 91+; వెంకట. 91 కులసూచి

నాయుని. పల్లె రాపూరు. 85 కులసూచి

నారం. పేట ఆత్మ. 6 స్త్రీనామసూచి

< నార - అం < నార . అమ్మ. నార < సం. నారాయణః

నారాయణ. పురం కావలి. 63+; కోవూరు. 7+, 70+ పురుషనామసూచి

నారాయణ. పేట ఉదయ. 9 పురుషనామసూచి

నారాయణ. రావు పేట నెల్లూరు. 17+, 18+ పురుషనామసూచి

నారాయణరెడ్డి. కండ్రిగ సూళ్ళూరు. 4+ పురుషనామసూచి

నారాయణరెడ్డి. పేట నెల్లూరు. 26+ పురుషనామసూచి

నారికేళ్ల. పల్లె నెల్లూరు. 117 కుటుంబనామసూచి

< నారికేళ్ల-అ. ఏక. నారికేళ - కొబ్బరి చెట్టు, బలిజకులంలో ఇంటి పేరు. (CTSI. 5)

నావూరు ఆత్మ 115 [నావలూరు 11 శ.NI. 1.43] ? సస్యసూచి

< నావ-ఊరు నావ < నావి. ఒకవిధమైనపైరు

నావూరు పల్లె ఆత్మ. 115+ గ్రామనామసూచి

నాళపోలయ్య. తోట నెల్లూరు 17+, 18+ పురుషనామసూచి

నిండలి. వెంకట 111 [నిండలి. మెకం. 358.88] రూ. నిండలి (ALV) అస్పష్టం

నిడి. గల్లు వెంకట. 133 పరిమాణసూచి

నిడి ఌ నిడు- పొడవైన

నిడిగుంట పాలెం నెల్లూరు. 89 నామాం. (సర్వేపల్లె Bit. VI) స్థలనామ సూచి నిడి. గుంట పరిమాణసూచి

నిడి. గుర్తి గూడూరు. 151+ పరిమాణసూచి

నిడి. ముసలి నెల్లూరు. 29 రూ. నిడిముసిలి (ALV) పరిమాణసూచి

నిమ్మవారి. తిప్ప గూడూరు. 151+ కుటుంబనామసూచి

నిమ్మ - నిమ్మచెట్టు Citrus medica

నీరుకట్టు. పాలెం కావలి. 20+ వృత్తిసూచి

నీరుకట్టు - చెరువునీళ్ల ఆపూరి మళ్లకు సమంగా పారగట్టుట. ఈ పని చేసేవాడు మాల కులంవాడై ఉంటాడు.

నీలాయ. పాలెం ఆత్మ 34 పురుషనామసూచి నీల- అయ్య

నీల- నీలిరంగు

నువ్వూరు. పాడు ఆత్మ. 52 గ్రామనామసూచి

నువ్వూరు- నువ్వు-ఊరు. సస్యసూచి. నువ్వు - నువ్వులు. నూగులు నూనెగింజలు. Sesamum Indicum.

నూకన. పల్లె ఆత్మ. 84 పురుషనామసూచి

నూక - అన్న - నేటి తెలుగుపేర్లలో సర్వసాధారణమైన పేరు. పోల్చి చూడు. నూకయ్య, నూకాలయ్య, నూకాలమ్మ - గ్రామదేవత, అమ్మ వారు (Chicken pox) నూక - స్ఫోటకం పోసిన దేహంమీది సన్న (నూకల్లాంటి) బొబ్బలు కావచ్చు.

నూకల పాలెం సూళ్ళూరు. 111 కుటుంబనామసూచి

నూకల , పద్మసాలె కులంలో ఇంటిపేరు (CTSI. 5)

నూతల ఉదయ. 109+ సామాన్యనామసూచి. (జలసూచి)

అనమస్తం. ఏక. నూయి ఌ నుయ్యి

నూతల. చెరువు వెంకట. 16 గ్రామనామసూచి

నెమిలిమిట్ట. అగ్రహారం సూళ్ళూరు. 91+ స్థలనామసూచి

నెమిలి. మిట్ట జంతుసూచి నెమిలి. Peacock

నెమళ్ల. దిన్నె ఉదయ. 15 జంతుసూచి
< నెమళ్ల-అ ఏక. నెమలి. బోయ, బలిజ, కులాల్లో ఇంటిపేరు.

నెమళ్ల. పూడి వెంకట. 212 జంతుసూచి
CTSI-2)

నెరదనం. పాడు ఉదయ. 120 విశేషణసూచి నెరదనం - నిండుదనం.

నెర్నూరు గూడూరు. 20 [నెరియనూరు మెకం. 358. 87] విశేషణసూచి.
< నెర - ఊరు. నెర - నిండు. పూర్తి.

నెర్నూరు రావూరు. 26 [రాపూరు శీమలోని నిజయనిడి. 16శ. NI.3.46. 12 - 14] విశేషణసూచి

నెర్నూరు సంగమేశ్వరస్వామి. కండ్రిగ గూడూరు. 21 రూ. నెర్నూరు సంగ మేశ్వర వారి కండ్రిగ (ము.ప) దేవతాసూచి

నెల. బల్లి గూడూరు. 36; సూళ్ళూరు. 26 జనపదసూచి
నెల- నెలవు, నివాసస్థానం.

నెల్ల. టూరు గూడూరు. 14 [పడనాటి సీమలోని అచ్యుతరాయ పుర ప్రతి నామమైన నెల్లటూరును 1530 - 31 NI.1.108. 13-18] కుటుంబ నామసూచి

నెల్లి. మిట్ట నెల్లూరు. 75+ వృక్షసూచి
నెల్లి - ఉసిరక చెట్టు. Phyllanthus emblica.

నెల్లి. పూడి గూడూరు. 73+, 118 వృక్షసూచి

నెల్లూరు నెల్లూరు. 17, 18 (Bit I 17, Bit II 18) [నెల్లూరి పశి కొండ నాథునికి. 1573 - 74. NI.2.54. 2-3; నెల్లూరు 16శ, NI.2. 49-3; నెల్లూరు చెర్వు 1635 - 36. NI.2.52.8; నెల్లూరు. ఉరఫ్ విక్రమ సింగపుర. 13శ. NI.2.21, 13శ. NI.2.60; శ్రీవీర విక్రమ పింహ పురి ? 1706-07, NI.2.96.3] < నెల్లు - ఊరు. సస్యసూచి

నెల్లు - వడ్లు. పోల్చిచూడు. త. నెల్, మ. నెల్, కన్న. నెల్, నెల్లు - వడ్లు (DED. 3112)

[పెన్నానది తీరమునగల ప్రసిద్ధ పట్టణము నెల్లూరు. ఈ ప్రాంతమును పూర్వము దండకారణ్యమనెడివారు. ఈ ప్రాంతమున సింహములు ఎక్కువగా నుండెడివనియు, ఇచట నిద్రించిన ఏనుగులు మరణించు చుండెననియు చెప్పుదురు. అందువలననే పట్టణమునకు సింహపురి యని గూడ పేరుగల్గినది. దీనికి విక్రమపురి అను నామాంతరమును గలదు తెనుగు భారతము వ్రాసిన తిక్కన సోమయాజి ఈ నదీతీర వాసియే పూర్వము నెల్లూరు ఆంధ్రరాజ్యమున చేరి యుండెను. ముక్కంటిరెడ్డి ఈ ప్రాంతమునకు నాయకుడుగా నుండెను. ఇతని కాలమున ఈశ్వరుడు ప్రత్యక్షమై ఆప్రాంతమునన్ను ఉసిరిక చెట్టు క్రిందగల శివలింగమునకు ఆలయము కట్టించవలసినదిగా ఆదేశించెనట. అటుపై ముక్కంటి రెడ్డి శివలింగమునకు ఆలయము కట్టించి నిత్యోత్సవములు జరుగుటకు ఏర్పాట్లు చేయించెను. అతనిచే నిర్మితమైన మూలస్థానేశ్వరాలయ మిప్పటికిని నెల్లూరు పట్టణమందు కలదు. ఆ యాలయ నిర్మాణాంతరము ఇప్పుడు నెల్లూరు అనబడు పట్టణము ఎక్కువగా వృద్ధిజెందినది. ఉసిరిక చెట్టును తమిళమున 'నెల్లి' చెట్టు అందురు. కావున నెల్లిచెట్టుకింద వెలసిన మూలస్థానేశ్వర ప్రాబల్యమున వృద్ధి జెందిన పట్టణమగుటచే ఈ పట్టణమును నెల్లూరు అని పిలుచుచున్నారు. ఈ పట్టణమునకు నెల్లూరు అని పేరువచ్చుటకు వేరొక కారణముగూడ కలదు. పెన్నానది నీటివలన ఈ ప్రాంతమందలి భూములు సారవంతములై వన్నెకెక్కిన వడ్లనుత్పత్తి చేయుచున్నవి. వడ్లు అనగా 'నెల్లు' అగుటవలన ఈ పట్టణమును నెల్లూరు అని పిలుచు చున్నారు. (వి. మం. స. పు. 22)]

[నెల్లూరు పేరును గురించి పలువురు పలు విధములుగా జెప్పుచున్నారు. నెల్లూరు చాల పురాతనమైనదనియు, రామాయణ కాలమునాటి దండకారణ్యములో నీ ప్రదేశమొక భాగమనియు జెప్పుదురు. ఇప్పుడుదర్గామిట్టయున్నచోట పూర్వమీ పట్టణముండినదనియు, నప్పుడది సింహపురము, విక్రమసింహపురమని పిలువబడు చుండెడిదనియు నూహించు చున్నారు. సింహపురమను నామము కలుగుటకు కొన్ని కారణములను సూచించు చున్నారు. నెల్లూరునకు సమీపమున నున్న యడవులలో సింహము లెక్కువగానుండి యుండవచ్చుననియు, నా సింహముల యునికిని బట్టి నెల్లూరునకు సింహపురమను నామము పూర్వమేర్పడి యుండ వచ్చుననియు భావించు చున్నారు. ఇచ్చట ఏనుగులు నిద్రించునప్పుడు వానికి స్వప్న దశలలో సింహములు కనబడుటచే వానికి నిద్రాభంగము కలుగుటయేగాక

కలతనొంది చనిపోవుననియు ప్రజలు విశ్వసించుచున్నారు. అందుచే నిచ్చట నేనుగులను నిద్ర పోనియ్యరు. విక్రమసింహుడను నాయకు డొకడుండెననియు, నతని చేతగాని, నతని కాలమునగాని నీ పట్టణము నిర్మింపబడినందున దీనికి విక్రమ సింహపురమను నామధేయము కలిగెననియు కొందరి యభిప్రాయము.

నెల్లూరు పేరును గురించి మూలస్థానేశ్వర దేవాలయ స్థలపురాణములో వివరింపబడినది. పూర్వము త్రినేత్రుడు లేక ముక్కంటి రెడ్డియను పేరుగల నాయకునివద్ద పెద్ద పశువుల మంద యుండెను. ఆ మందయందలి యొక గోవు దేహమున మృతినొందిన యొక బ్రాహ్మణస్త్రీ యాత్మ ప్రవేశించెను. ఆ యావు నకు శివుడు లింగాకారముతో భూమిపై నవతరించినట్లు స్ఫురించెను. ఆ లింగ మొక నెల్లి చెట్టుక్రింద నుండెను. ఆ యావు ప్రతిదినమును నచ్చటికి పోయి తన పాలతో నా లింగము నభిషేకించు చుండెను. ఆవు సరిగా పాలియ్యనందున ముక్కంటిరెడ్డి పశువులకాపరిని దండించిన మీదట ఆ కాపరి ఆవును గనిపెట్టి యుండి యావు లింగము యొద్దకుపోయి తన క్షీరముతో నా లింగము నభిషేకించు టనుగమనించి యా లింగమును కత్తితో గొట్టెను. అప్పుడా లింగము నుండి రక్తముకారెను. ఈ సంగతి నా పశువులకాపరి తనయజమానియైన ముక్కంటిరెడ్డి కెరిగించెను. అటుపిమ్మట నతనికొకనాటిరేయి స్వప్నములో నెల్లిచెట్టుక్రింద నున్న శివలింగము కనిపించి యా లింగమున్న చోట నొక దేవాలయ నిర్మాణము గావింపుమన్న వాణి యతనికి వినిపించెను. ఆ ప్రకార మతడు దేవాలయమును నిర్మించి దానికి మూలస్థానేశ్వర దేవాలయమని పేరు పెట్టెను. శివ లింగము పూర్వము నెల్లిచెట్టుక్రింద నుండుటచే నెల్లూరను పేరు వచ్చెను.

నెల్లూరుజిల్లాలో ముఖ్యముగా నెల్లూరు పట్టణము చుట్టుప్రక్కల వరి పంట నెక్కువగా బండించెదరు. 'నెల్' అనగా వడ్లు. వడ్ల నెక్కువగా పండించు ప్రదేశము గాబట్టి యీ నగరమునకు నెల్లూరను పేరు కలిగినదని కొంద అభిప్రాయ పడుచున్నారు. (వి. మం. స. పు. 39-10)]

[పదకొండు పన్నెండు శతాబ్దాలలో తెలుగు చోళులు పాలించిన కాలం వరకు నెల్లూరుకు విక్రమసింహపురమని పేరు. శ్రీనాథుడు విక్రమసింహపుర మని, నెల్లూరు అని రెండు పదములు ప్రయోగించినాడు (1400) క్రీ.శ. మూడవ

శతాబ్దంలో పల్లవులు స్థాపించిన పట్టణములలో నెల్లూరు ఒకటి. పల్లవ రాజులలో ముఖ్యుడు త్రిలోచన పల్లవుడు. ఇతడు నెల్లూరు మొదలు తిరుపతి వరకు అరణ్యమును నరికించి జనపదముల నెలకొల్పినాడు. ఆయనను కాడువెట్టి (అడవిని నరికిన) ముక్కంటి అన్నారు.

పల్లవులకు సింహ బిరుదముండుటచే ఈ పట్టణానికి సింహపురమై విక్రమ చేర్చబడినది.

నెల్లి (ఉసిరిక) చెట్టు క్రింద మూలస్థానేశ్వరస్వామి ఉద్భవించుటచే నెల్లూరైనదని ఒకమాట.

ఇంకొక పాఠము- నెల్లి - వడ్లు పండే చోటు కాన నెల్లూరైనది. ఇది అరవలు ఇచ్చిన పేరు. (మందాకిని, అక్టోబర్ 1956)]

నెల్లూరు. కోడూరు నెల్లూరు. 43+ గ్రామనామసూచి

కోడూరు గ్రా.ద్వి. జలసూచి

నెల్లూరు. పల్లె గూడూరు. 83; సూళ్ళూరు. 27 గ్రామనామసూచి

నెల్లూరు. పాలెం ఆత్మ. 53 గ్రామనామసూచి

నెల్లూరు. మైపాడు నెల్లూరు. 33+ గ్రామనామసూచి

మై. పాడు గ్రా.ద్వి.

నేకునాం. పేట కావలి. 5 పురుషనామసూచి

<ఉ. నేక్‌నామ్ - గొప్పకీర్తివంతుడు, పుణ్యశ్లోకుడు.

నేదూరు. పల్లె ఆత్మ. 112 రూ. నేదురుపల్లె (ము.ప) కులసూచి

నేదురు ω మేదురు < మేదర - మేదరవాండ్లు చూడు. కడూని.

నేరేడు. పల్లె ఉదయ. 84+ వృక్షసూచి

నేరేడు - ఒకరకం పండ్ల చెట్టు. Black palm. Engenia Jombo-lana iamk

నేలటూరు ఉదయ. 68+; నెల్లూరు. 82 కుటుంబనామసూచి

బ్రాహ్మణుల్లో ఇంటిపేరు

నేల. పట్టు సూళ్ళూరు. 69 భూసూచి

పంగిలి రాపూరు. 72 [పంగిరిపల్లె మెకం. 349. 161; పంగిలి. మెకం. 349. 161] ? సంఘటనసూచి

పంగిలి ౧ పంగిడి - ఏనుగలను పట్టునపుడు అవి పడుటకు త్రవ్విన గొయ్యి (ఆశర)

పంచాంగవారి. కండ్రిగ నెల్లూరు. 121+ కుటుంబనామసూచి

పంచాంగం - తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణం అను ఐదింటిని తెలుపు గ్రంధం.

పంచేడు కోవూరు. 60 అస్పష్టం

పంజాం వెంకట. 158 కుటుంబనామసూచి. రెడ్లల్లో ఇంటిపేరు

పంట. కాలువ కావలి. 61+, 62+ భూసూచి

పంట - భూమి, పండినపైరు.

పండ్రంగం గూడూరు. 150+ [పండ్రంగి మెకం. 354. 263] పురుషనామసూచి < పండ్రంగడు

[నెల్లూరుజిల్లా గూడూరు తాలూకాలోని రెడ్డిపాళెమను గ్రామమున పండరంగేశ్వరమని యొకపురాతన దేవాలయమున్నది. ఈ దేవాలయ ముండు ప్రదేశమునకు రెడ్డిపాళెం మజరా పంట్రంగం నిఅపేరు.

పైన చెప్పబడిన పండరంగేశ్వర నామోత్పత్తి కొంత విమర్శ నీయము. తూర్పు చాళుక్య రాజులలో ప్రసిద్ధుడైన గుణగవిజయాదిత్యునికి పండరంగుడను ఒకగొప్ప సేనాని యుండెను. ఇతని శాసనములు నెల్లూరు జిల్లాకందుకూరు ప్రాంతమున లభ్యమగుచున్నవి. గుణగ విజయాదిత్యుడు నెల్లూరు పురమును దహనము చేసినట్లు అతని శాసనములలో కొన్నిటి యందు చెప్పబడి యున్నది. ఈ విజయమున పండరంగుడును పాల్గొని యుండవలెను. బహుశ పండరంగుడు గూడూరు ప్రాంతమువరకును దండయాత్ర సలిపి యీ పురాతన పట్టణమైన కాకన్దిలో (? ఈ కాకన్దిమన నెల్లూరుజిల్లాలోని కాకన్దిగానే యుండనోపును) తనపేర ఒక శివాలయము స్థాపించి యుండవచ్చును. ఆ దేవుని పేరునుబట్టి యా గ్రామమునకు 'పంట్రంగం అను నామము సంక్రమించి యుండవలెను పండురంగమే పంట్రంగం అయినది. (భారతి సెప్టెంబర్ 1946)]

పండ్రంగం సూళ్ళూరు. 159 పురుషనామసూచి

పండ్రంగి ఉదయ. 11 పురుషనామసూచి

పండ్లూరు గూడూరు. 58 కుటుంబనామసూచి. మంగలవాళ్లలో ఇంటిపేరు.

పందల. గుంట సూళ్ళూరు. 107 జంతుసూచి

<పందులు-అ. ఏక. పంది. అసిలి. బోయ, గమండ్లలో ఇంటిపేరు (CTSI. 6)

పందల. మిట్ట నెల్లూరు. 78+ జంతుసూచి

పంది. పాడు ఆత్మ. 35 జంతుసూచి. (కుటుంబనామసూచి)

పంబలి గూడూరు. 149 ? < పంబ - ఇలి కులసూచి

పంబ < పంబల - పంబలోళ్ళు, గ్రామదేవతల పూజలలో పంబజోళ్ళ అను వాయిద్యాన్ని వాయించేవారు (మాప)

పక్కెల. గుంట ఆత్మ. 108+ జంతుసూచి. (కుటుంబనామసూచి)

<పక్కెలు-అ. ఏక. పక్కె - పిట్ట, పక్షి, మత్స్య విశేషం

పగడాల. పల్లె గూడూరు. 1+ కుటుంబనామసూచి

<పగడము-లు-అ. మణి విశేషం. బలిజల్లో ఇంటిపేరు. (CTSI. 5)

పచ్చ. నాడ నెల్లూరు. 37+ <పచ్చన-వాడ వర్ణసూచి

పట్టపు. పాలెం కోవూరు. 17+, 89+; గూడూరు. 94+, 95+; నెల్లూరు. 33+, 34+, 72+, 78+, 81+, 82+, 116+ కులసూచి.

పట్టపు - పట్టపువాళ్ళు. చేపలుపట్టి జీవించువాళ్ళు. (CTSI. 6) వీళ్ళే తర్వాత పల్లెవాళ్ళుగా, జాలర్లుగా పిలవబడ్డారు.

పట్ర. పల్లె వెంకట. 97 [పట్రపల్లె మెకం. 344. 103; పట్రంపల్లె మెకం. 344 104] కులసూచి.

పట్ర - పట్రవాండ్లు. ఏకరివాండ్లు (గ్రాౌణ్యం), ఒకజాతి కిరాతకుడు (ఆశర)

పడ. కండ్ల ఆత్మ. 2 అస్పష్టం.

పడమట. పొలం నెల్లూరు. 17+ దిక్సూచి

పడమట. వూరు కోవూరు. 18+ దిక్సూచి

పడమటి. ఎర్రబల్లె ఉదయ. 64+ దిక్సూచి

ఎర్ర. బల్లె గ్రా. ద్వి. కుటుంబనామసూచి

పడమటి. కంభంపాడు ఆత్మ. 72 దిక్సూచి

కంభం. పాడు గ్రా. ద్వి. కుటుంబనామసూచి

పడమటి. గమండ్లపాలెం కోవూరు. 78+ దిక్సూచి
గమండ్ల. పాలెం గ్రా. ద్వి. కులసూచి

పడమటి. డొంక కోవూరు. 48+ దిక్సూచి

పడమటి. తోటలు కోవూరు. 70+ దిక్సూచి

పడమటి. నాగులదొరువు నెల్లూరు. 116+ దిక్సూచి
నాగుల. దొరువు గ్రా. ద్వి. జంతుసూచి

పడమటి. నాయుడుపల్లె ఉదయ. 107 దిక్సూచి
నాయుడు. పల్లె గ్రా. ద్వి. కులసూచి

పడమటి. పాలెం కోవూరు. 24+, 42 దిక్సూచి

పడమటి. రొంపిదొడ్ల ఉదయ. 22 దిక్సూచి
రొంపి. దొడ్ల గ్రా. ద్వి. భూసూచి

పడారు. పల్లె నెల్లూరు. 50 కుటుంబనామసూచి
పడారు - దళవాయి, గ్రామపెద్ద, సేనాధిపతి.

పడుగు. పాడు కోవూరు. 71 కుటుంబనామసూచి
పడుగు - బట్టయొక్క నిడుపునూలు, వరికుప్ప (బ్రౌణ్యం)

పత్తేఖాన్. పేట నెల్లూరు. 17+, 18+ పురుషనామసూచి
పత్తే ౧ ఫత్తే < అ. ఫతెహ్ - విజయము, ముట్టడి.
ఖాన్ - గ్రామాధికారి

పద్మనాభ. సత్రం కోవూరు. 29+, 82+ పురుషనామసూచి
[కోవూరు. 82+ - వెలమ కులానికి చెందిన జలదంకి పద్మనాభనాయుడు ఈ ప్రాంతములో ఒకసత్రాన్ని, కోనేరును కట్టించెను (CT. FF. P. 179) ]

పన్నం. గాడు సూళ్ళూరు. 151 రూ. పనంగాడు (ALV) వృక్షసూచి
పన్నం < త. పనై - తాటిచెట్టు, Borassus Habelli formis walls.

పన్నెడు. పల్లె ఉదయ. 63+ అస్పష్టం

పప్పులవారి. పల్లి ఉదయ. 27 కుటుంబనామసూచి

పబ్బులేటి. పల్లె ఉదయ. 3 రూ. పబ్బిలేటిపల్లె (ALV) వృక్షసూచి
< పబ్బులు - ఏటి. ఏక. పబ్బు - చెమ్మనేలల్లో ఏపుగాపెరిగే పేము మొక్క. Calamus rotang Linn ఏటి < ఏరు - టి.

పమిడి. పాడు ఆత్మ. 44 వృక్షసూచి
< పమిడి (పత్తి) ఒక పెద్దగింజగలపత్తి, మేలుపత్తి (మా.ప)

పరికోట. అగ్రహారం కావలి. 22 గ్రామనామసూచి
పరి. కోట - వాస్తుసూచి. పరి - చతురంగబలంగలసేన.

పర్ల. పాడు నెల్లూరు. 99 భూసూచి
< పర్రలు - అ. పర్ర ౧౧ పఱ్ఱ - ఉప్పునేల.

పర్వతా. పురం రాపూరు. 27+ పురుషనామసూచి. < సం. పర్వతః -కొండ.

పలు. గోడు వెంకట. 36 ? కుటుంబనామసూచి
పల్లు <? పల్లవ. పల్లవులు - ఒకరాజవంశం

పల్లం. పర్తి గూడూరు. 68 దిక్సూచి
పల్లం - పల్లపునేల

పల్లం. పొలం కోవూరు. 86+ దిక్సూచి
పల్లి. కొండ రాపూరు. 8 ? కుటుంబనామసూచి. పల్లి <? పల్లవ - ఒక రాజవంశం

పల్లి. మాల గూడూరు. 85 ? కుటుంబనామసూచి
పల్లిమాల. కండ్రిగ గూడూరు. 84 గ్రామనామసూచి
పల్లి. వోలు ఉదయ. 109 ? కుటుంబనామసూచి
పల్లి. ఇంగ్లు ఆత్మ. 104+ కులసూచి
పల్లికుల సంబంధ విశేషాలకు చూడు. (CTSI-6)
పల్లి. పాడు ఆత్మ. 64+; కోవూరు. 16+; నెల్లూరు. 27; వెంకట. 125 కులసూచి

పల్లిపాటి. దిన్నె నెల్లూరు. 66+ స్థలనామసూచి
పల్లి.పాటి < పల్లి.పాడు-ఇ కులసూచి

పల్లి. పాలెం కోవూరు. 23+, 29+, 44+, 47+, 67+. 68+, 72+, 74+, 84+, 89+; కావలి. 57+, 59+, 68+. 77+; గూడూరు. 118+; నెల్లూరు. 44+. 45+. 47+. 64+, 65+, 69+, 81+. 113+: సూళ్ళూరు. 130, 145+

రూ. పల్లె పాలెం (ము.ప) కులసూచి

పల్లిపాలెం. కాలువ నెల్లూరు. 32+ గ్రామనామసూచి

పల్లివాండ్ల. దొరువు నెల్లూరు 28+ కులసూచి

పల్లివాళ్ల. దిబ్బ గూడూరు. 94+ కులసూచి

పాక. పూడి వెంకట. 128 గ్రామనామసూచి

పాక. < త. పాక్కమ్ - సముద్రతీర గ్రామం

పాటి. మిట్ట గూడూరు. 69+; సూళ్ళూరు. 5+ స్థలసూచి. (జనపదసూచి)

పాటి < పాడు-ఇ. పాడు - గ్రామసీమ, జనపదం, స్థావరం

పాటిమీద. కాకుపల్లె నెల్లూరు. 65+ స్థలార్థకసూచి

పాటి. చూడుపైన. కాకు. పల్లె గ్రా.ద్వి.

పాటిమీద. తోటలు నెల్లూరు. 28+ స్థలార్థకసూచి

పాటిమీద. పూండ్ల నెల్లూరు. 121+ స్థలార్థకసూచి

పాటిమీద. యానాదిపాలెం కావలి. 31+, 33+ స్థలార్థకసూచి

యానాది. పాలెం గ్రా. ద్వి. కులసూచి

పాటూరు కోవూరు. 67 పాటి - ఊరు. జనపదసూచి

[కొన్ని శతాబ్దాల క్రితం ఈ గ్రామంలో యాదవులకు పాడి సమృద్ధిగా ఉండటం వల్ల దీనికి పాలటూరు అనిపేరువచ్చింది. కాన క్రమముగా పశుసంపద పూర్తిగా తగ్గిపోవటంతో పాలటూరులోని ల పోయి పాటూరు అయింది. (Co. FF. P. 174)]

పాటూరివారి. కండ్రిగ నెల్లూరు. 75+, 118+ కుటుంబనామసూచి

పాడిసన్. పేట కోవూరు. 32+ పురుషనామసూచి

పాడేరు ఆత్మ. 101 అస్పష్టం

పాత. కాదలూరు సూళ్ళూరు. 123+ పౌర్వాపర్యసూచి

కాదలూరు గ్రా.ద్వి

పాత. చేన్లు  నెల్లూరు 34+  పౌర్వాపర్యసూచి
పాత. గొల్లపాలెం  కావలి. 59+  పౌర్వాపర్యసూచి
గొల్ల. పాలెం  గ్రా ద్వి.  కులసూచి
పాత. తుంగపాలెం  గూడూరు. 16+  పౌర్వాపర్యసూచి
తుంగ. పాలెం  గ్రా. ద్వి  వృక్షసూచి
పాత. నక్కావారిపాలెం  నెల్లూరు. 68+  పౌర్వాపర్యసూచి
నక్కావారి. పాలెం  గ్రా. ద్వి.  కుటుంబనామసూచి
పాత. నాలపాడు  వెంకట. 27  పౌర్వాపర్యసూచి
నాల. పాడు  గ్రా. ద్వి. జలసూచి. నాల - పంట కాలువ, ఏటి నుంచి గాని, పెద్దకాలువ నుంచి గాని తీసిన పంట కాలువ.

పాత. పట్టపు పాలెం  కావలి. 59+  పౌర్వాపర్యసూచి
పట్టపు. పాలెం  గ్రా.ద్వి.  కులసూచి
పాత. పడుగుపాడు  కోవూరు. 71+  పౌర్వాపర్యసూచి.
పడుగు. పాడు  గ్రా.ద్వి  కుటుంబనామసూచి

పాత. పాడు  ఆత్మ. 102  పౌర్వాపర్యసూచి
[మొదట ఈ గ్రామం తూర్పున ఉన్న పాడు అన్న ప్రదేశంలో వుండేది. తరువాత ఈ గ్రామం ఇప్పుడున్నచోటికి తరలించటంవల్ల పాతపాడు అనే పేరు వచ్చింది. (AT. FF. P. 79)]

పాత. పాలెం  కావలి. 68+; నెల్లూరు. 30+  పౌర్వాపర్యసూచి
పాత. బిట్రగుంట  కావలి. 75+  పౌర్వాపర్యసూచి
బిట్ర. గుంట  గ్రా. ద్వి.
పాతళ్ల పల్లె  ఆత్మ. 71; రాపూరు. 104  కుటుంబనామసూచి
< పాతర-లు-అ
పాత. వంగల్లు  కోవూరు. 48+  పౌర్వాపర్యసూచి
వంగల్లు  గ్రా. ద్వి.  జలసూచి
పాత. వూరు  ఆత్మ. 92+; ఉదయ. 84+; కావలి. 52+, 63+, 74+; నెల్లూరు. 20+, 21+  పౌర్వాపర్యసూచి
పాత. వల్లం  కోవూరు. 24+  పౌర్వాపర్యసూచి

పాతేటి. పాలెం  గూడూరు. 107  కుటుంబనామసూచి

పాదర్తి. పాలెం  నెల్లూరు. 120+  కుటుంబనామసూచి

పాదర్తి - Title of priests. (CTSI. 5)

పాదర్తివారి. కండ్రిగ  సూళ్ళూరు. 38  కుటుంబనామసూచి

పాపం. పల్లె  ఉదయ. 93  స్త్రీనామసూచి

< పాప - అం < పాప - అమ్మ. పాప - బిడ్డ. పాప-పాము శబ్దానికి విశేషణమైన పాంప కావచ్చు. పాప మీద ఏర్పడే పేర్లు - పాపమ్మ. పాపన్న, పాపమాంబ, పాపిరెడ్డి.

పాపన. ముసలిపాలెం  కావలి. 16+  పురుషనామసూచి.

ముసలి. పాలెం  గ్రా. ద్వి.

పాపన్నగారి. పల్లె  ఉదయ. 35+  పురుషనామసూచి

పాపమాంబా. పురం ఉరఫ్ బొల్లి. అగ్రహారం వెంకట. 100  స్త్రీనామసూచి

పాపిరెడ్డి. కండ్రిగ  వెంకట. 214+  పురుషనామసూచి

పాపిరెడ్డి. తోపు  కోవూరు. 55+  పురుషనామసూచి

పాపిరెడ్డి. పల్లె  వెంకట. 138  పురుషనామసూచి

పామంజి  గూడూరు. 104  పాము-అంజి.  జంతుసూచి

పామి. నేరి  సూళ్ళూరు. 155+  జంతుసూచి  < పాము-ఇ

పాముల. తేరి  గూడూరు. 150+  జంతుసూచి

పాముల- మాల, యానాదుల్లో ఇంటిపేరు. (CTSI. 6)

పాములదొరువు. కండ్రిగ  నెల్లూరు. 74+  స్థలనామసూచి

పాముల. దొరువు  జంతుసూచి

పాముల. మిట్ట  సూళ్ళూరు. 139+  జంతుసూచి

పాములమిట్ట. కండ్రిగ  సూళ్ళూరు. 125+  స్థలనామసూచి

పామూరు. పల్లె  ఉదయ. 33 గ్రామనామసూచి.

పామూరు < పాము-ఊరు.  జంతుసూచి

పార. వోలు  వెంకట. 50  అస్పష్టం

పార్ల. పల్లె  కావలి. 6;  కోవూరు. 79;  రాపూరు. 41 కుటుంబనామసూచి

< పార-లు-అ.  వ్యవసాయపనిముట్టు

పాలకొండ. సత్రం  వెంకట. 58  స్థలనామసూచి

పాలకొండ - సామాన్యనామసూచి. నెల్లూరుజిల్లాలో కొండల పేరు

పాలి. చెర్ల గూడూరు. 9 వృక్షసూచి

పాలి < పాల - తినేపండ్లుగల కంచెమొక్క. క్షీరికావృక్షం. Hexand-ua Roxb

పాలిచెర్ల. పాడు రాపూరు. 46 స్థలనామసూచి

పాలిచెర్ల. రాచపాలెం గూడూరు. 9+ గ్రామనామసూచి

రాచ. పాలెం గ్రా. ద్వి. కులసూచి

పాలిచెర్లవారి. పాలెం గూడూరు. 38+ కుటుంబనామసూచి

పాలూరు రాపూరు. 105 [పాలూరు. మెకం. 344.3] పాల - ఊరు వృక్షసూచి. చూడుపైన.

పాలెం. కోట వెంకట. 54 గ్రామనామసూచి

పాలెం - సైన్యశ్రేణి, దండు విడిచే చోటు, పాలెగానిదేశం.

పాలెం. పాడు వెంకట. 184; సూళ్ళూరు. 72+ గ్రామనామసూచి

పాలె. పోలం వెంకట. 205 గ్రామనామసూచి. పాలె ౧ పాలెం

పిగిలాం వెంకట. 132 రూ. పిగిలం (ALV) ? వృక్షసూచి

పిగిలి ౧ పికిలి - ఒకానొకచెట్టు.

పిచ్చి. గుంట ఉదయ. 104+ పరిమాణసూచి పిచ్చి - చిన్న

పిట్టవాని. పల్లె సూళ్ళూరు. 39 పురుషనామసూచి

< పిట్టవాడు - ఇ - చిన్నవాడు.

పిడతల. పూడి గూడూరు. 40+ కుటుంబనామసూచి

< పిడతలు - అ. ఏక. పిడత - మట్టిపాత్ర, రెడ్లలో ఇంటిపేరు.

పిడతా. పోలూరు నెల్లూరు. 66 కుటుంబనామసూచి. పిడతా ౧ పిడత పోలూరు గ్రా. ద్వి.

పిడూరు నెల్లూరు. 110 < ? పిడి - ఊరు. జంతుసూచి

పిడి - ఆడ ఏనుగు. పోల్చిచూడు. పిడపర్తి

పిడూరు. పాలెం నెల్లూరు. 109 గ్రామనామసూచి

పిన. పెరియపాడు వెంకట. 194 [పినపరియపాడు. మెకం. 344. 53] పరిమాణసూచి. పిన - చిన్న. పెరియ. పాడు గ్రా.ద్వి. విశేషణసూచి

పీర్జాతి, పేట వెంకట. 83+ దేవతాసూచి

< హిం. పీర్జాదా < హిం. పీరుజాదా. పీర్లను పూజించేవాడు. పీరు-మొహరం పండుగలో తురకలు నెలకొల్పి పూజించే విగ్రహం.

పీర్ల. చావిడి   కావలి. 52+;   నెల్లూరు. 34+   మతసూచి

పుంజులూరు. పాడు   నెల్లూరు. 115   గ్రామనామసూచి

పుంజులూరు < పుంజుల - ఊరు.  కుటుంబనామసూచి.  దేవాంగుల్లో ఇంటిపేరు. (CTSI. 6)

పుచ్చల. పల్లె   గూడూరు. 103   వృక్షసూచి

< పుచ్చలు-అ. ఏక. పుచ్చ- పుచ్చచెట్టు, దోసతీగ. Cucumis-colocynthis Linn (మా.వృ. 1)

పుచ్చూరివారి. పాలెం   సూళ్ళూరు. 17+   కుటుంబనామసూచి

పుచ్చూరి < పుచ్చూరు-ఇ < పుచ్చ-ఊరు.  వృక్షసూచి

పుట్టంరాజువారి. కండ్రిగ   గూడూరు. 20+   కుటుంబనామసూచి

< పుట్ట-అం-రాజు.  పురుషనామసూచి

పుట్ట. పల్లె   ఆత్మ. 98+   కుటుంబనామసూచి

పుట్ట - కమ్మ, కురుబ, మాల, మేదర, పద్మసాలె వాళ్ళల్లో ఇంటిపేరు. (CTSI. 6)

పుట్ర. గుంట   గూడూరు.   143   కుటుంబనామసూచి.   < పుట్ట

పుట్లూరు   ఆత్మ. 42+   కుటుంబనామసూచి. <   పుట్ట - లు - ఊరు

పుదు. కుప్పం   సూళ్ళూరు. 147+   పౌర్వాపర్యసూచి

పుదు < త. పుదియ- కొత్త

పుదూరు   సూళ్ళూరు. 16   పుదు - ఊరు   పౌర్వాపర్యసూచి

పుదూరు. అగ్రహారం   సూళ్ళూరు. 16+   గ్రామనామసూచి

పును. గోడు   ఆత్మ. 45   [పొనుంగాటిగ్రామం. 1581-82. NI.1.547-8]

రూ. పొనుగోడు (జ.ప్రో) పరిమాణసూచి.

పును ~ పొను < పున్న - చిన్న

పున్నప్పవారి. పాలెం   గూడూరు. 26+   కుటుంబనామసూచి. < పున్న-అప్ప

పున్నూరు   నెల్లూరు. 38   పున్న - ఊరు   పరిమాణసూచి

పున్నే. పల్లె   వెంకట. 213   పురుషనామసూచి

< పున్న -ఏ < పున్న - అయ్య

పుప్ప. లూరు   కావలి. 12+   < పుప్పలు - ఊరు. వృక్షసూచి.

పుప్పము - పువ్వు

పురందర. పురం కోవ్వూరు. 16+ పురుషనామసూచి

< సం. పురందరః - ఇంద్రుడు

పురిటి. పాలెం గూడూరు. 3+ అస్పష్టం

పురిణి కోవూరు. 22 దేవతాసూచి. అసమస్తం

[ఒకప్పుడు ఈ పల్లెకు దక్షిణాన పురిణమ్మ అనే గ్రామదేవత దుష్ట శక్తుల నుండి పల్లెను కాపాడినందున పురిణి అనే పేరు వచ్చినదట. ఈ ప్రాంతంలో జైన ప్రతిమలు బయల్పడటం వల్ల ఈ ప్రాంతం జైనుల కేంద్రంగా ఉండినదని స్థానిక చరిత్ర. (CT. FF. P. 163) ]

పులస. పడవ సూళ్ళూరు. 134+ అస్పష్టం

పులింజేరి. కుప్పం సూళ్ళూరు. 170 స్థలనామసూచి

పులిం < త. పులి - చింతచెట్టు జేరి < త. చేరి-వీధి, నివాస స్థలం. కుప్పం. గ్రా. ద్వి.

పులి. కొర్రు గూడూరు. 119 జంతుసూచి (కుటుంబనామసూచి)

పులి - మేదర, ముత్రాచ, బలిజల్లో ఇంటిపేరు (CTSI. 6)

పులి, కొల్లు రాపూరు. 27 జంతుసూచి (కుటుంబనామసూచి)

పులిగిలి. పాడు రాపూరు. 67+ ? కుటుంబనామసూచి

పులి. తీగల. పాడు నెల్లూరు. 58+ జంతుసూచి

తీగల. పాడు గ్రా. ద్వి. వృక్షసూచి

పులిమివారి. కండ్రిగ గూడూరు. 7+ కుటుంబనామసూచి

పులివేంద్ర సూళ్ళూరు. 122 జంతుసూచి

పులికొల్లువారి. పాలెం వెంకట. 83+ కుటుంబనామసూచి

పుల్లనీళ్ళ. పల్లె ఆత్మ. 103+ పురుషనామసూచి

పుల్లయ. కండ్రిగ నెల్లూరు. 37+ పురుషనామసూచి

< పుల్ల-అయ్య. నిందార్థకనామం. పులిస్తరాకులో దొర్లించి పెట్టేపేరు.

పుల్లయ. పల్లె ఉదయ. 67 పురుషనామసూచి

పుల్లావారి. పాలెం కావలి. 59+ కుటుంబనామసూచి

పువ్వుల. తోట సూళ్ళూరు 64 రూ. పూలతోట (NC. 71) వృక్షసూచి (పూసూచి)

పువ్వులతోట. మిట్ట సూళ్ళూరు. 64+ గ్రామనామసూచి

పువ్వుల. దొరువు కావలి. 59+ వృక్షసూచి

పుష్పాల. పల్లె ఉదయ. 103+ కుటుంబనామసూచి

పూడి సూళ్ళూరు. 146 జనపదసూచి

అసమస్తం. పూడి - చిన్నపల్లె, కుగ్రామం.

పూడి. కుప్పం సూళ్ళూరు. 146+ గ్రామనామసూచి

కుప్పం గ్రా. ద్వి.

పూడి. పర్తి నెల్లూరు. 113 గ్రామనామసూచి

పూడి. రాయదొరువు గూడూరు 152 గ్రామనామసూచి

రాయ. దొరువు గ్రా. ద్వి. పురుషనామసూచి

పూడేరు సూళ్ళూరు. 14 పూడి - ఏరు. గ్రామనామసూచి

పూనమల్లి. పాలెం నెల్లూరు. 40+ గ్రామనామసూచి

పూన. మల్లి ? వృక్షసూచి. పూన < ?త. పున్నై - పున్నాగచెట్టు

పూనుగుంట. పాలెం గూడూరు. 93+ స్థలనామసూచి

పూను. గుంట ? వృక్షసూచి. < త. పున్నై

పూలరంగడు. పల్లె వెంకట. 68 వ్యక్తినామసూచి

పెంకల. గుంట నెల్లూరు. 79+ కుటుంబనామసూచి. పెంకల ᑌ పెంకుల

పెంట. పాడు గూడూరు. 39 స్థలసూచి. చూడుదిగువ.

పెంట. పాలెం కోవూరు. 45+ స్థలసూచి

పెంట - మురికిదిబ్బ, చెత్తకుప్ప

పెండేకువారి. పల్లె వెంకట. 180 నాపూ. నాయుడు చెరువు. కండ్రిగ

(N.C. 71) కుటుంబనామసూచి

పెగళ్ల. పాడు ఉదయ. 104 అస్పష్టం

పెట్లూరు వెంకట. 90 అస్పష్టం

పెడికలవారి. కండ్రిక సూళ్ళూరు. 10+ కుటుంబనామసూచి

పెద్ద. అన్నలూరు ఆత్మ. 17 పరిమాణసూచి

అన్నలూరు గ్రా. ద్వి. పురుషనామసూచి

పెద్ద. అబ్బీపురం ఆత్మ. 41 పరిమాణసూచి

అబ్బీపురం. గ్రా. ద్వి. పురుషనామసూచి

పెద్ద. కుప్పం సూళ్ళూరు. 144+ పరిమాణసూచి. కుప్పం గ్రా. ద్వి.

పెద్ద. కొండూరు కావలి. 20 పరిమాణసూచి
కొండూరు గ్రా. ద్వి. శిలాసూచి

పెద్ద. చెరుకూరు నెల్లూరు. 21 పరిమాణసూచి
చెరుకూరు గ్రా. ద్వి. కుటుంబనామసూచి

పెద్ద. చెరువు గూడూరు. 131 పరిమాణసూచి

పెద్ద. తోట నెల్లూరు. 17+, 18+ పరిమాణసూచి

పెద్ద. దిన్నెపాలెం కావలి. 62+ పరిమాణసూచి
దిన్నె.పాలెం గ్రా.ద్వి. ఉన్నత భూసూచి

పెద్ద. నాగంపల్లె ఉదయ. 5 పరిమాణసూచి
నాగం. పల్లె గ్రా. ద్వి. స్త్రీనామసూచి
[పెద నాగమ్మ అనే దేవదాసి ఈ గ్రామ నిర్మాణం చేసినందువల్ల పెద్ద నాగంపల్లె అని పేరు వచ్చింది.(UT. FF. P. 82) ]

పెద్ద. పట్టపుపాలెం కావలి. 57+ పరిమాణసూచి
పట్టపు. పాలెం గ్రా. ద్వి. కులసూచి

పెద్ద. పరియ గూడూరు. 30 పరిమాణసూచి

పెద్ద. పాడు కావలి. 20+ పరిమాణసూచి

పెద్ద. పుత్తేడు కోవూరు. 32 పరిమాణసూచి. పుత్తేడు గ్రా. ద్వి. అస్పష్టం

పెద్ద. బండారుపల్లె వెంకట. 147 పరిమాణసూచి
బండారు. పల్లె గ్రా. ద్వి. కుటుంబనామసూచి

పెద్ద. మాంబట్టు సూళ్ళూరు. 125+ పరిమాణసూచి
మాంబట్టు గ్రా. ద్వి. వృక్షసూచి

పెద్ద. మాచనూరు ఉదయ. 113+ పరిమాణసూచి
యాచ. నూరు గ్రా. ద్వి. పురుషనామసూచి

పెద్ద. యాచసముద్రం వెంకట. 37 పరిమాణసూచి
యాచ. సముద్రం గ్రా. ద్వి. పురుషనామసూచి

పెద్ద. వరం కావలి. 55+ పరిమాణసూచి

పెద్ద. పూరు ఆత్మ. 104+ పరిమాణసూచి

పెద్ది. రెడ్డి.పల్లె ఉదయ. 31 పురుషనామసూచి. < పెద్ద - ఇ.

పెను.బర్తి. నెల్లూరు. 64; రాపూరు. 12 పరిమాణసూచి. పెను - పెద్ద.

పెనుబర్తి. గోపసముద్రం రాపూరు. 11 గ్రామనామసూచి

గోప. సముద్రం గ్రా. ద్వి. వృక్షసూచి

పెను. బల్లె కోవూరు. 63 పరిమాణసూచి

పెన్నారు. పొల్లుకట్ట నెల్లూరు. 17+ స్థలనామసూచి

పెన్నారు < పెన్న - ఆరు, పెద్దఏరు, నదిపేరు, పొల్లు. కట్ట గ్రా.ద్వి.

పెన్నే. పల్లె సూళ్ళూరు. 23 రూ. పన్నేపల్లె (N.C. 71) వ్యక్తినామసూచి

పెన్న - ఏ < పెన్న-అయ్య

పెమ్మారెడ్డి పాలెం కోవూరు. 50+ పురుషనామసూచి

పెయ్యల. పాలెం కోవూరు. 50+ జంతుసూచి

< పెయ్యలు-అ. ఏక. పెయ్య - ఆవుదూడ, లేగదూడ.

[యాదవ కులానికి చెందిన పెయ్యల వెంకయ్య మొట్టమొదట నివాసం యేర్పరచుకోవటం వల్ల ఈ ఊరికి పెయ్యలపాలెం అనిపేరు వచ్చింది. ఇది గండవరం మజరా (Co. FF. P. 172) ]

పెరమ. కొండ రాపూరు. 19+ పరిమాణసూచి. పెరమ - పెద్ద.

పెర. మన ఆత్మ. 33 [పెర్మన తుంమ్మలంమ్మ. 1771-72. NI.1.50. 6-7] పరిమాణసూచి. పెర < పెరమ - పెద్ద

పెరిక. పాలెం కావలి. 7+ కులసూచి

పెరిక-పెరికలవాండ్లు. చూడు CTSI. 6

పెరిమిటి. పాడు సూళ్ళూరు. 112+ రూ. పెదిమిటిపాడు (ALV) గ్రామనామసూచి. < పెరిమిడి-ఇ. చూడుదిగువ.

పెరిమిడి వెంకట. 166 [పెరిమేడి మెకం. 358.5; పెరిమిడి మెకం. 358. 84] పరిమాణసూచి <?పెరియ-మేడు < త. పెరియ - పెద్ద

పెరియ. వట్టు సూళ్ళూరు. 149 పరిమాణసూచి

పెరియ. వరం వెంకట. 143 పరిమాణసూచి

పెరుమాళ్ల. పాడు ఆత్మ. 98 పురుషదేవతాసూచి

< పెరుమాళ్ల - అ < త. పెరుమాళ్ - విష్ణువు, వైష్ణవ బిరుదు. చూడు కడూని.

పెరుమాళ్ల. పాడు రాపూరు. 93 [పెనుమాలపాటి 1638-39 NI.3.51.4: పెనుంబాలపాడు 17శ. NI.3.52.2-3; Note పెనుంబాలపాడు = పెరుమాళ్లపాడు] పురుషదేవతాసూచి.

పెల్లేరు    ఆత్మ. 103 [నెల్లూరి శీమలోని పెల్లెర్ల 1621-22. NI.1.48.9] ?
వృక్షసూచి. < పెల్ - ఏరు. పెల్ - పెళ్లమాను

పెళ్ల.కూరు    గూడూరు. 67 [పెళ్లకూరి మెకం. 344. 60] వృక్షసూచి
పెళ్ల - పెళ్లమాను. రెడ్లల్లో ఇంటిపేరు.

పేట    కోవూరు. 89+ జనపదసూచి

పేట. సత్రం    కోవూరు. 16+ గ్రామనామసూచి

పేడూరు    నెల్లూరు. 44 అస్పష్టం

పేపలవారి. పాళెం    కావలి. 55+ కుటుంబనామసూచి

పేరంటాల. తోట    కోవూరు. 16+ (దేవతాసూచి)
< పేరంటాలు-అ. పుణ్యస్త్రీలు, సప్తకన్యకలను పేరంటాండ్రు అనటం కూడా కలదు.

పేరంట్రా.వుల మిట్ట    సూళ్ళూరు 45 రూ. పెరట్రావుల మిట్ట (ALV)
దేవతాసూచి. < పేరంట్ర-ఆవుల-మిట్ట. పేరంట్ర చూడుపైన
ఆవుల. మిట్ట గ్రా.ద్వి. కుటుంబనామసూచి

పేరంరాజు. పల్లె    రాపూరు. 82+ పురుషనామసూచి
< పేర్-అం. పేర్ ఌ పెరు-పెద్ద. పోల్చిచూడు పేరయ్య. పేరమ్మ
పేరిశెట్టి. చూడుదిగువ ఆరోపాలు.

పేరయ. గుంట    కోవూరు. 85+ పురుషనామసూచి

పేరయ పుట్ట.దిబ్బ    నెల్లూరు. 83+ స్థలనామసూచి
పేరయ. పుట్ట పురుషనామసూచి

పేరిశెట్టి. పల్లె    ఉదయ. 3+ పురుషనామసూచి

పేర్నాడు    సూళ్ళూరు. 158+    < ? పేర్-నాడు, పరిమాణసూచి

పైడేరు    కోవూరు. 33+ పైడి-ఏరు వర్ణసూచి. పైడి - బంగారు ఛాయగల

పైనాం. పురం    నెల్లూరు. 81 అస్పష్టం

పొంగూరు    ఆత్మ. 64 [పొంగూరి చెర్వు మెకం. 349. 153] అస్పష్టం

పొక్కుందల    రాపూరు. 113 - అస్పష్టం

పొగడ దొరువు. కండ్రిగ    నెల్లూరు. 35 స్థలనామసూచి
పొగడ. దొరువు వృక్షసూచి. పొగడ - పొగడచెట్టు

పొగ. తోట    నెల్లూరు 17+, 18+ 69+ వృక్షసూచి
పొగ < పొగాకు. Tobacco Plant.

పొట్టేం. పాడు నెల్లూరు. 88 నామా. సర్వేపల్లె Bit. IV N.C. 71
కుటుంబనామసూచి. చూడుదిగువ

పొట్టే. పాలెం నెల్లూరు. 13 కుటుంబనామసూచి. (వ్యక్తినామసూచి)
< పొట్ట - ఏ < పొట్ట - అయ్య బలిజల్లో ఇంటిపేరు

పొదల. కూరు రాపూరు. 38 [పొద్దాలకూరి చెర్వు 1638-39. NI.3.53-]
వృక్షసూచి. < పొదలు-అ. పొద - పెద్దతుప్ప, తీగెలు గుబురుగా
అల్లుకొన్నవానిగుంపు, బోదెలేని చిన్నచెట్లు

పొన్న. పాడు సూళ్ళూరు. 125+ వృక్షసూచి
పొన్న - పొన్నచెట్టు. Calaphyllun inophyllum.

పొన్న. పూడి కోవూరు. 19+ వృక్షసూచి

పొన్నపూడి. పాలెం కోవూరు. 19+ గ్రామనామసూచి

పొన్న. వోలు గూడూరు. 91 వృక్షసూచి

పొళ్ల. కండ్రిగ గూడూరు. 120 ? కుటుంబనామసూచి

పోకలవారి. పల్లె ఉదయ. 17+ కుటుంబనామసూచి
పోకలు-అ, పోక - పోకచెట్టు, వక్కచెట్టు, Betelnut Palm

పోగులవారి. పల్లె వెంకట. 99 కుటుంబనామసూచి

పోటు. పాలెం గూడూరు. 3+ ? కుటుంబనామసూచి

పోట్ల. పూడి నెల్లూరు 70 వృక్షసూచి
పోట్ల ని పొట్ల - పొట్లకాయ. తోటల్లోను, పెరళ్లలోను పెంచే కాయ
గూరల మొక్క Snake ground Tricho Santhus anguinu
Linn

పోతిరెడ్డి. పాలెం కోవూరు 70 పురుషనామసూచి
< పోతు-ఇ. మగపశువు. మేకపోతు. పోతుమీద ఏర్పడే పేర్లు-
పోతిరెడ్డి, పోతునాయుడు, పోతురాజు చూడు దిగువ ఆరోపాలు

పోతునాయుని. పల్లె గూడూరు. 143 పురుషనామసూచి

పోతురాజు. మిట్ట సూళ్ళూరు. 43+ పురుషనామసూచి (దేవతాసూచి)

పోతే. గుంట రాపూరు. 80 [పోతేగుంట 1638-39. NI.3 54 5] పురుషనామ
సూచి. < పోత-ఏ < పోత-అయ్య

పోలంగాని. పల్లె ఉరఫ్ దేవరాజు సూరాయ. పల్లె ఉదయ. 16 పురుషనామ సూచి. పోలం < పోల-అం. పోల < పొలి- గ్రామాచారాల్లో దేవతల పేరపెట్టే నైవేద్యం. పోల్చిచూడు, పొలిమేరమ్మ పోలేటమ్మ-ఊరి సరిహద్దుల్లో ఉండే గ్రామదేవత. పోలతో ఏర్పడే పేర్లు. పోలమ్మ, పోలినాయుడు, పోలిరెడ్డి. చూడుడిగువ ఆపోపాలు.

పోలం. పాడు కావలి. 20+ స్త్రీ నామసూచి. < పోల - అమ్మ

పోలినాయుడు. చెరువు కోవూరు. 47+ పురుషనామసూచి

పోలి. పాడు గూడూరు. 29 రూ. పొలిపాడు (ALV) దేవతాసూచి

[ప్రస్తుతం గూడూరు తాలూకాలో పొలిపాడుగ్రామం కలదు. ఈ గ్రామాన్ని క్రీ.శ. 1510 సం॥ న ఎఱ్ఱమరాజు పుత్రుడైన చంద్రమౌళి అనే బ్రాహ్మణునికి శ్రీకృష్ణదేవరాయలు దానం చేసినట్లు శాసనముంది] (భారతి 1936)

పోలిరెడ్డి. పాలెం సూళ్ళూరు. 91+ పురుషనామసూచి

పోసినవారి. పాలెం గూడూరు. 96+ కుటుంబనామసూచి

ప్రభగిరి. పట్నం ఆత్మ. 116 [వుదయగిరి రాజ్యాన్ను చెల్లె ప్రభాకరపట్నం. 1602-03. NI.1.53. 9-10] పురుషనామసూచి

ప్రభగిరి < ప్రభాకర

బంగళా. తోట ఆత్మ. 108+ స్థలనామసూచి

బంగళా < హిం. బంగళా - ఒంటరిగా నున్న పెద్దఇల్లు

బంగాళా. తోపు నెల్లూరు. 17+, 18+ స్థలసూచి

బంగారమ్మ. తోపు నెల్లూరు. 69+ స్త్రీనామసూచి

బంగారమ్మ. పేట సూళ్ళూరు. 74 స్త్రీనామసూచి

బంగారు. పాలెం కావలి. 68+ సాదృశ్యబోధకసూచి

బంగారు. పేట వెంకట. 84 సాదృశ్యబోధకసూచి

బండకింద. పల్లె ఉదయ. 78+ స్థలార్థకసూచి. బండ - పెద్దరాయి.

బండగాని. పల్లె ఉదయ. 8 పురుషనామసూచి

< బండగాడు-ఇ పోల్చిచూడు. బండోడు

బండారు. గుంట వెంకట. 185 కుటుంబనామసూచి

< బండారం - బొక్కసం, కోశాగారం.

బండారు. పల్లె ఆత్మ. 95 కుటుంబనామసూచి

బండేరు. పల్లె నెల్లూరు. 101; రాపూరు. 75 పురుషనామసూచి

బండ - ఏ < బండ - అయ్య

బండ్ల. ఎద్దులవారి పాలెం ఆత్మ. 106+ కుటుంబనామసూచి

బండ్ల < బండి - లు-అ. దేవాంగుల్లో ఇంటిపేరు. ఎద్దులవారి. పాలెం గ్రా.ద్వి. కుటుంబనామసూచి

బండ్ల. పల్లె ఆత్మ. 57+ కుటుంబనామసూచి

బండ్ల పాలెం నెల్లూరు. 86+ కుటుంబనామసూచి

బందెల. దొడ్డి నెల్లూరు. 63+ సామాన్యనామసూచి

< బందెలు-అ. ఏక. బందె ౧ బంది - పశువులచెర

బట్వాడి. పాలెం నెల్లూరు. 17+, 18+ సంఘటనసూచి

< హిం. బాట్వాడా రూ. బట్టువాడా. Distribution, disbursement

బత్తుల. పల్లె ఆత్మ. 113 కుటుంబనామసూచి

< బత్తులు - అ. ఏక, బత్తు < బత్తుడు - వ్రడంగి, కంసాలి, కమ్మరి మొదలగువారి బిరుదు. కమ్మవాళ్లలో ఇంటిపేరు.

బత్తులపల్లె. పాడు ఆత్మ. 109 గ్రామనామసూచి

బత్తులా. పురం గూడూరు. 33 కుటుంబనామసూచి

బద్దె. వోలు ఆత్మ. 78; నెల్లూరు. 106 పురుషనామసూచి

బద్దె < ? సం. భద్ర

బలిజ. పాడు కోవూరు. 2+ కులసూచి.

బలిజ - ఒక కులం. చూడు (CTSI. 1)

బలిజ. పాలెం ఉదయ. 117+; కావలి. 59+, 59+, 67+; కోవూరు. 16+, 45+; నెల్లూరు. 18+, 119+, 121+; వెంకట. 83+ కులసూచి

బలిజ. వాడ సూళ్ళూరు. 118+ కులసూచి

బల్ల. వోలు గూడూరు. 98 ? కుటుంబనామసూచి

బల్ల < ? పల్లవ - ఒకరాజవంశం

బల్లెవాని. పట్టెడ సూళ్ళూరు. 156+ పురుషనామసూచి

బసవ. పాలెం కోవూరు. 19+ పురుషనామసూచి

బుజబుజ. నెల్లూరు నెల్లూరు. 52 [భుజబల్లిరాయ నెల్లూరి 1625-26. NI.2. 6.9-10] పురుషనామసూచి

బుజబుజ < భుజబల్లిరాయ < భుజబలరాయ

బుడమ. గుంట కావలి. 65 కుటుంబనామసూచి

బురద. గాలి సూళ్ళూరు. 48+ అస్పష్టం

బురదగాలి. కొత్తపాలెం సూళ్ళూరు. 48 గ్రామనామసూచి

కొత్త. పాలెం గ్రా.ద్వి. పౌర్వాపర్యసూచి

బురద. మడుగు సూళ్ళూరు. 98 భూసూచి, బురద - అడుసు.

బురాన్. పూరు నెల్లూరు. 54+ పురుషనామసూచి

< పర్షి. బుర్రాన్ - పదునైన, (sharp)

బురావారి. పాలెం గూడూరు, 117+ కుటుంబనామసూచి. ౧ బుర్రా బ్రాహ్మణుల్లో ఇంటిపేరు,

బుస. పాలెం వెంకట. 146 రూ. బుసుపాలెం (ALV) కుటుంబనామసూచి

< బుసి < ?బూచి < సం. భూతమ్

బూడిదల. నాగు గూడూరు. 123 వర్ణసూచి

బూదం. పాలెం నెల్లూరు. 17+, 18+ స్త్రీనామసూచి

< బూద - అం < బూద -అమ్మ, బూద < ? సం. బుద్ధ

బూదనం గూడూరు. 35 ? మతసూచి. చూడుపైన

బూద. వాడ ఉదయ. 98 ? మతసూచి. చూడుపైన

బూదూరు సూళ్ళూరు. 89 బూద-ఊరు కుటుంబనామసూచి. చూడుపైన

బృందావనం నెల్లూరు. 17+, 18+ సాదృశ్యబోధకసూచి

బెడుసు. పల్లె ఆత్మ. 82; ఉదయ. 17+, 98+ కుటుంబనామసూచి

బెడుసు - జాలిలేని, క్రౌర్యం

బెస్త. పాలెం కోవూరు, 46A+; గూడూరు. 44+; నెల్లూరు. 17+, 18+; వెంకట. 83+ కులసూచి. బెస్త. బెస్తవాళ్లు, వేటాడడం, చేపలు పట్టడం వృత్తిగాగల ఒక కులం. (CTSI. 1)

బేరి. పాలెం సూళ్ళూరు. 55+ కులసూచి

బేరి-బేరిశెట్టి, వ్యాపారం చేసే తమిళ కులం. కోమట్లలో శాఖా భేదం (CTSI. 1)

బేరి. పేట  సూళ్ళూరు. 19+, 166  కులసూచి

బొంగరా.వులపాడు  ఉదయ. 45 ?  కుటుంబనామసూచి

బొంగర - అవులపాడు. అవుల. పాడు గ్రా.ద్వి. కుటుంబనామజంతుసూచి

బొంతల. పాలెం  కోవూరు. 48+; సూళ్ళూరు. 55+ ?  కుటుంబనామసూచి

< బొంతలు -అ.  బొంత - గుడ్డలబొంత

బొక్క. రేగడ  నెల్లూరు. 69+  భూసూచి.  < బొగ్గు

బొగ్గులవారి. కండ్రిగ  ఆత్మ. 101+  కుటుంబనామసూచి

బొగ్గుల - బోయ, దేవాంగుల్లో ఇంటిపేరు. (CTS1. 1)

బొజ్జన. పల్లె  రాపూరు. 67  పురుషనామసూచి

< బొజ్జ - అన  < బొజ్జ - అన్న.  బొజ్జ- బొజ్జకడుపు. బొజ్జ బుద్ధ శబ్దభవం కావచ్చు.

బొటికర్ల. పాడు  ఆత్మ. 1; ఉదయ. 93+  వృక్షసూచి

బొటికర్ల - బొటికర్ల చెట్టు, బొటిక చెట్టు. ? Zizyphus Xylopyrs Linn

బొడి. పాడు  ఆత్మ. 94+ ?  కుటుంబనామసూచి  < బోడి - సన్యాసి

బొడ్డువారి. పాలెం  కావలి. 59+; కోవూరు. 51 కుటుంబనామసూచి

ఈడిగల్లో ఇంటిపేరు.

బొద్దుల. పాడు  గూడూరు. 26+ ?  కుటుంబనామసూచి

< బొద్దులు - అ.  బొద్దు - శిశువుల హస్త ఆభరణ విశేషం

బొద్దూరి. పేట  కావలి. 81+  గ్రామనామసూచి

బొద్దూరి < బొద్దూరు-ఇ,  చూడుపైన

బొన్నల. రెడ్డిపాలెం  కోవూరు. 29+ ?  కుటుంబనామసూచి

రెడ్డి. పాలెం  గ్రా. ద్వి.  కులసూచి

బొప్పా. పురం  వెంకట. 85 రూ, బొబ్బాపురం (ALV)  పురుషనామసూచి

బొప్ప ∽ బొబ్బ - అమాయకుడు, మూఢుడు

బొమ్మ. గుంట  వెంకట. 91  పురుషనామసూచి. (దేవతాసూచి)

బొమ్మ < సం. బ్రహ్మ.  బొమ్మ - పద్మసాలె, మాలకులాల్లో ఇంటి పేరు.  బొమ్మమీద ఏర్పడేపేరు.  బొమ్మరాజు

బొమ్మరాజు. చెరువు  ఉదయ. 81+  పురుషనామసూచి

బొమ్మ. వరం ఆత్మ. 68 [ఉదయగిరి సీమలోను బొమ్మవరం గ్రామం 16శ.
NI.1.20.4-6] పురుషనామసూచి

బొమ్మ. వరం ఆత్మ. 70+ పురుషనామసూచి

బొమ్మవరం. అగ్రహారం ఆత్మ. 68+ గ్రామనామసూచి
అగ్రహారం గ్రా.ద్వి.

బొల్లావారి. పాలెం వెంకట. 166+ కుటుంబనామసూచి
బొల్లా <? బొల్లి - తెలుపు

బోగోలు కావలి, 81 రూ. బోగ. వోలు (ALV) సాదృశ్యబోధకసూచి
భోగ - ప్రోలు

బోడ. గుడిపాడు కావలి. 33 కుటుంబనామసూచి
బోడ < బోడి - సన్యాసి. గుడి. పాడు గ్రా.ద్వి.

బోడ. బండ ఉదయ. 65+ కుటుంబనామసూచి

బోడవారి. పల్లె ఉదయ. 89+ కుటుంబనామసూచి

బోడసిద్దాయ. పల్లె ఉదయ 6+ రూ. బోడయ సిద్దయపల్లె (ALV)
పురుషనామసూచి
[ఈ గ్రామానికి మరోపేరు ఉప్పరవారిపల్లె. ఈ గ్రామంలో బలిజ కులానికి చెందిన ఉప్పర ఇంటిపేరు గలవారు మొట్టమొదట ఈ ప్రాంతం లో స్థిరపడటం వల్ల ఈ పేరొచ్చింది. (UT. FF. P. 83) ]

బోడివారి దిబ్బ సూళ్ళూరు. 134+ కుటుంబనామసూచి
బోడి - నింద్వార్థకనామం, నున్నగా గొరిగిన, సన్యాసి.

బోడి. లింగాలపాడు సూళ్ళూరు. 144+ [బోడిలింగంపాడు మెకం 344.64]
కుటుంబనామసూచి. లింగాలపాడు గ్రా.ద్వి

బోయన. గుంట వెంకట. 134 పురుషనామసూచి (కులసూచి)
< బోయ - అన. బోయ - ఒకకులం. చేపలుపట్టడం, సున్నంగాల్చడం పల్లకీ మోయడం వృత్తిగాగల కులం (CTSI-1) చూడు కడూని

బోయ. పాలెం నెల్లూరు. 28+ కులసూచి

బోయళ్ల. చిరువెళ్ల ఆత్మ. 8 రూ. బోయిల చిరువెళ్ల (ALV) కులసూచి
బోయళ్ల ಌ బోయిళ్ల < బోయళ్లు - అ. ఏక. బోయ. చూడుపైన.
చిరువెళ్ల గ్రా.ద్వి.

బోయళ్లవారి. పాలెం కావలి 4+ కులసూచి

బ్రహ్మ. దేవం  నెల్లూరు. 87 దేవతాసూచి
బ్రహ్మరెడ్డి. పాలెం  కోవూరు. 48+ పురుషనామసూచి
బ్రహ్మేశ్వరం  ఉదయ. 87 దేవతాసూచి

[విశ్వబ్రాహ్మణుడైన బ్రహ్మయ్య ఈ గ్రామ నిర్మాణం చేసెను గనుక బ్రహ్మేశ్వరం అని పేరు వచ్చింది. (UT. FF. P. 96)]

బ్రాహ్మణ. క్రాక  కావలి 76 [బ్రాంహణకాక 14శ.NI.2. 5.1-2] కులసూచి

[నెల్లూరుజిల్లా కావలి తాలూకా కావలి గ్రామమునకు నైరుతి భాగాన బ్రాహ్మణక్రాక అనునొక అగ్రహారము కలదు. తన తండ్రికి ముక్తి కలుగు నుద్దేశముతో హరిహరరాయలు దీనిని క్రీ.శ. 1376లో కొందరు బ్రాహ్మణులకు దానము చేసినట్లు శాసనమ కలదు. దానమియ్యబడిన గ్రామమునకు తొలిపేరు క్రాకు అయినట్లు దీనికి బుక్కరాయపురం అనిపేరుబెట్టి దానము చేసినట్లు గలదు.

క్రాక లేక క్రాకు అననేమి యర్థమో తెలియలేదు. కొండతిప్పలోనగు ఉన్నత ప్రదేశముల క్రింది యూరికి క్రాకు అనుపేరు గలదని యొకరు చెప్పిరిగాని దీనికాధారము మృగ్యము. ఈ పేరుతగులు గ్రామనామములు ఇంకను కొన్ని గలవు. ఈ బ్రాహ్మణక్రాక సమీపమున చిన్నక్రాక, క్రాకుటూరు, తిరువళ్లూరు సమీపమున 'క్రాకవాక' ఇత్యాదులు బహుశః కాకినాడ 'క్రాకనాడ' యొక్క వికారమైయుండునా?.... శ్రోత్రియాగారముల యందలి త్రేతాగ్నులచే క్రాగుచుండు నిండ్లు కలిగి యుండుటచే క్రాక యనిపేరు గలిగియుండునా? 'క్రాగు' ధాతువు ననుసరించి క్రాక యేర్పడినట్లు శబ్దరత్నాకరము తెలుపుచున్నది. (భారతి. మార్చి, 1926) (కాకమ్మదేవతను బట్టి క్రాక అని గ్రామనామమేర్పడియుండ వచ్చునని స్థానికులు చెప్పుటగలదు. జనుల వ్యవహారమునుబట్టి చూచినచో క్రాక అను పదమునుండి కాక అను పదమేర్పడుట సహజము గాని కాక నుండి క్రాక యేర్పడుట పొసగదు. కాబట్టి కాకతీయుల దేవతయైన కాకమ్మ వలన క్రాక అను వ్యవహారము కలుగుట కుదరదు. క్రాక అను శబ్దమేర్పడుట క్రాఁగు అను క్రియనుండి అని శబ్దరత్నాకరములో కలదు. క్రాఁగు అనగా తపించుట అని యర్థము. త్రేతాగ్నులచే (ఆహవనీయ, దక్షిణాగ్ని. గార్హపత్యము) క్రాఁగు గృహములు కలదగుటచే క్రాక అని వ్యవహారము కలిగి యుండవచ్చునని కొందరు వ్యాఖ్యానించుటగలదు. అనగా నిరతాగ్నిహోత్రులగు భూసురులకావాస భూమియని వారి భావము, అనగా తొలుతనుండియు పండితుల కావాస యోగ్యముగానుండిన గ్రామమునే రాయలు దానమిచ్చెననవచ్చును........

కాలక్రమమున జనుల వాడుకలో క్రాకు, క్రాక, కాక అయినది (వి. మం. స. పు. 461) ఓరుగల్లు కాకతీయులు ఆరాధించు దేవతయైన 'కాకతి' వల్ల మొదట్లో ఆ యూరిని 'క్రాకపురి' అని పిలిచేవారు. ఈ ప్రాంతములో కాకమ్మ పేరుతో కాకమ్మగుడి, కాకమ్మచెరువు మరియు కాకమ్మగుంట ఉన్నవి........ 650 సంవత్సరాలక్రితం ఈ గ్రామంతో సహా 15,000 ఎకరాల భూమిని 64 గోత్రాలకు చెందిన బ్రాహ్మణులకు హరిహరరాయలు మరియు బుక్కరాయలు దానమొసంగిరి. అందువల్ల ఈ గ్రామానికి బ్రాహ్మణక్రాక అని పేరు వచ్చినది (KT. FF. P. 156)

బ్రాహ్మణపల్లె ఆత్మ. 76 : ఉదయ 31+, 103 ; రాపూరు 42+ కులసూచి

భగవతిపాలెం నెల్లూరు (17+, 18+) స్త్రీ నామసూచి

భగవతి - పార్వతి, దుర్గ

భట్టువారి. పాలెం కావలి 14+ కులసూచి

భట్టు - స్తోత్రపాఠకుడు, వందిమాగధుడు (CTSI. 1)

భట్టే. పాడు ఆత్మ 97 (వుదయగిరి రాజ్యంలోని బట్టెపాటి 1548-49-NI. 1.17 11-12) పురుషనామసూచి

< భట్టు-ఏ < భట్టు-అయ్య

భట్ర. కాగొల్లు కోవూరు 13 (కాగొల్లు 1653-54 NI. 2. 5. 6.)

కాంగొల్లు చెర్వ 1638-39 NI.2 4.5) రూ బట్టరుకాగొల్లు (ALV)

కులసూచి భట్ర < భట్టు కాగొల్లు గ్రా. ద్వి. అస్పష్టం

[భట్రాజులు ఈ ప్రాంతాన్ని పరిపాలించిరి గాబట్టి ఈ ఊరికి భట్ర కాగొల్లు అనే పేరు వచ్చింది. (CO. FF. P. 159)]

భట్లు. కనుపూరు వెంకట. 195 కులసూచి

< భట్టు-లు-అ. కను. పూరు గ్రా.ద్వి.

భట్లు. దిన్నె కావలి. 67+ కులసూచి

భట్లు. పాలెం నెల్లూరు. 37+ కులసూచి

భద్రా. చలం కోవూరు. 87+ సాదృశ్యబోధకసూచి. భద్రా < భద్ర

భాస్కరవారి. కండ్రిగ కావలి. 12+ కుటుంబనామసూచి

బ్రాహ్మణుల్లో ఇంటిపేరు.

భాస్కర. పురం  ఉదయ. 57 పురుషనామసూచి

భీమ. వరం  ఉదయ. 121; వెంకట 29, 207  పురుషనామసూచి

< సం భీమః - భీముడు.

భీమవరప్పాడు  కావలి 42 భీమవరం - పాడు  గ్రామనామసూచి

భీమాలవారి పాలెం  సూళ్ళూరు 147 రూ. బీమాలవారిపాలెం (ALV)

కుటుంబనామసూచి

భువనగిరి. పాలెం  గూడూరు 28 స్థలనామసూచి

భువన. గిరి  సామాన్యనామసూచి

భోగ సముద్రం  ఆత్మ. 114  సాదృశ్యబోధకసూచి

భైర. వరం  ఉదయ 116; వెంకట. 168  దేవతాసూచి

భైర < సం. భైరవః - శివుడు

మంగల. కండ్రిగ  సూళ్ళూరు. 5+  కులసూచి

మంగల - ఒక కులం. చూడు (CTSI. 4)

మంగల. గుంట  నెల్లూరు. 58+  కులసూచి

మంగల. దొరువు నెల్లూరు 43 కులసూచి

మంగల. పాలెం కోవూరు 46A + కులసూచి

మంగలవారి. పల్లె  గూడూరు 144 కులసూచి

మంగళం. పాడు  సూళ్ళూరు 84 రూ. మంగలంపాడు (ALV) గ్రామనామ సూచి. మంగళం - అసమస్తం. వ్యవసాయసంబంధమైన గ్రామం. తమిళంలో అగ్రహారాన్ని మంగళం అందురు.

మంగళ. పూరు  గూడూరు 13 రూ. మంగలపూరు (ALV) గ్రామనామసూచి

మంగళ ల మంగళం

మంగా. నెల్లూరు సూళ్ళూరు 86 స్త్రీ నామసూచి

మంగా. < త. మంగై - పన్నెండు, పదమూడు సంవత్సరాల మధ్య గల అమ్మాయి

మంగు. పల్లె ఉరఫ్ కన్నె. పల్లె  ఆత్మ. 67 స్త్రీ నామసూచి < త. మంగై

మంచాల. పల్లె  ఆత్మ 81+ కుటుంబనామసూచి

< మంచాలు - అ. ఒడ్డె, పంటరెడ్ల కులాల్లో ఇంటిపేరు

మండపం నెల్లూరు 77+ వాస్తుసూచి

అసమస్తం. వివాహాది కార్యాల్లో తాత్కాలిక ఉపయోగానికి వేసిన

పందిరి. < సం. మండపః

మంతలవారి. కండ్రిగ నెల్లూరు 81+ కుటుంబనామసూచి

మంద. బయలు కోవూరు.68+ ; నెల్లూరు 28+, 46+, 78+ జంతుసూచి

మంద. ఆవులు మున్నగు పశువుల గుంపు

మందాళ్లనాయుడు. పల్లె ఉదయ. 89 పురుషనామసూచి

< మంచాళ్ల-అ· < మందల. కర్ణసాలె, మాదిగెల్లో ఇంటిపేరు. (CTSI. 4)

మందాళ్ల. పల్లె ఉదయ. 90 కుటుంబనామసూచి

మక్కినవారి. పాలెం కావలి. 41+ కుటుంబనామసూచి

మక్తా. పురం కోవూరు. 43 పరిపాలనాసూచి

< హిం. మక్తా - గవర్నమెంటు గుత్తకిచ్చిన పొలం, భూకామందుకు రైతు ఇచ్చే డబ్బు లేదా పంట.

మజరా. మిట్ట సూళ్ళూరు. 72+ పరిపాలనాసూచి

< హిం. మజరా - రెవిన్యూగ్రామం కింది గ్రామం, చిన్నపల్లె

మజరా. రావితోపు సూళ్ళూరు. 72+ పరిపాలనాసూచి

రావి. తోపు గ్రా.ద్వి. వృక్షసూచి

మజరా. ముత్త సూళ్ళూరు. 91+ పరిపాలనాసూచి

మఠం నెల్లూరు. 63+ సామాన్యనామసూచి

అసమస్తం < సం. మఠమ్ - సన్యాసులుండే చోటు

మట్టెం. పాడు నెల్లూరు. 8 స్త్రీనామసూచి

< మట్టె - అమ్మ. మట్టె < మట్టియ - స్త్రీలు కాలివ్రేలికి ధరించు ఆభరణ విశేషం

మడ. పల్లె ఆత్మ. 94+ భూసూచి

మడ - మడనేల (ఒండుమట్టి కలసిన రేగడి-నేల)

[ఒక శతాబ్దం క్రితం పెన్నానదీ తీరాన పది గుడిసెలు నిర్మించబడినాయి. ఈ ప్రాంతాన్ని మడ అంటారు. వరదల ధాటికి తట్టుకోలేని ప్రజలు దక్షిణానికి వెళ్లి, అక్కడ స్థిరపడినారు. మడ ప్రాంతానికి చెందిన ప్రజలు నిర్మించిన పల్లె గాబట్టి దీనికి మడపల్లె అని పేరు వచ్చింది. ఇది చేజెర్ల మజరా. (AT. FF. P. 77)

మడమ. నూరు నెల్లూరు. 102 అస్పష్టం

ఇది మడవనూరా ? మడమనూరు అనుటకు అంతగా అర్థం పొసగకపోయినా అది మడవ వేస్తుండిన (నీటి పారుదల గట్టు) ప్రదేశమందున్న ఊరుగా తోస్తున్నది. ఎందుకంటె మనుబోలు చెరువు వరవకాలువ కండ్లేరు దుండి ఈ గ్రామ పొలిమేరలో చీలి పోతున్నది. బహుశః పూర్వ మిక్కడ ఏటికి కట్టు కొమ్మ కట్టి పారింపుకొను వారేమో ! (మందాకిని, ఆగష్టు, 1955)]

మడిచేను. కండ్రిగ వెంకట. 71 స్థలనామసూచి

మడి, చేను భూసూచి. మడి - పరిపంటకు ఉపయోగించే నేల, జావి నీటిలో సాగుచేసే నేలను ఒక ప్రాంతంలో మడి అంటారు. (మా.వృ1)

మడుగు. మిట్ట ఆత్మ. 106+ జలసూచి. మడుగు - కొలను

మతకా. పూడి సూళ్ళూరు. 82 రూ. మతకంపూండి (ALV) కుటుంబనామసూచి

మదరాజాదు ఆత్మ, 36+ < మదర్. ఆజాడు. పురుషనామసూచి

మదర్ - Proper-name.

మద్దాల. కండ్రిగ గూడూరు. 13+ కుటుంబనామసూచి

< మద్దెల - ఒకవాద్యం. మద్దిల ౧ మద్దిలి - కాపుల్లో, మాలల్లో ఇంటిపేరు. (CTS1. 4)

మద్దాలి గూడూరు. 49 ? మద్ది - అలి వృక్షసూచి

[సర్వజ్ఞ కుమార యాచమనాయుడు (1831-92) (27వ తరంవాడు) గూడూరు తాలూకాలోని మద్దాలి అను గ్రామాన్ని 30 వేలకు కొని శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధిలో రామానుజకూటం జరుజుటకై సమర్పించెను (గోపీనాధ వెంకటకవి. వెంకటగిరి సంస్థాన కవులు. పు. 61)]

మద్ది. పాలెం కోవూరు. 16+ వృక్షసూచి

మద్ది - మద్ది చెట్టు. Morinda tinctoria Roxb.

మద్దూరు. పాడు కావలి. 63 కుటుంబనామసూచి. మద్ది - ఊరు. వృక్షసూచి రెడ్లలో ఇంటిపేరు.

మధ్వపతివారి. అగ్రహారం నెల్లూరు. 17+, 18+ కుటుంబనామసూచి

మన. వాలి వెంకట. 210 అస్పష్టం

మను. బోలు నెల్లూరు. 104 ? ఘూసూచి. < మన్న

[ఈ గ్రామంలో వుండే మనుబోలమ్మ గ్రామదేవతపల్ల మనుబోలు అని పేరువచ్చింది. (NT. FF. P. 21)]

మనుబోలు. పాడు కావలి 30 గ్రామనామసూచి

మనులాలా. పేట వెంకట. 141 పురుషనామసూచి

మనె. పాడు కోవ్వూరు. 19+ కుటుంబనామసూచి

మనె < ?మన్నెం - పర్వతప్రాంత ప్రదేశం, ఇనాం, దుర్గమప్రదేశం, మాన్యం, మన్నెం - కమ్మవాళ్ల ఇంటిపేరు. (CTSI. 4)

మన్నంగి. దిన్నె కావలి. 60 అస్పష్టం

మన్న. మాల నెల్లూరు. 28+ కుటుంబనామసూచి మన్న < మన్నె

పోల్చిచూడు మన్నెమాల. చూడు. మనెపాడు

మన్నవరప్పాడు నెల్లూరు. 10 మన్నవరం - పాడు గ్రామనామసూచి

మన్న. వరం కుటుంబనామసూచి

మన్నారు, పోలూరు సూళ్ళూరు. 113 దేవతాసూచి

మన్నారు < త. మన్న - అవర్. వైష్ణవదేవునిపేరు

మన్నూరు వెంకట. 115 అస్పష్టం

[క్రీ. శ. 1679 లో 22వ తరంవాడైన బంగారు యాచమ నాయుడు "ఆలంపనాహా కుతుబశాహావారు" తమకు అమర నాయకంగ యిచ్చిన తొండమండలం చంద్రగిరి రాజ్యంలోకి చెల్లే వెంకటగిరి శీమలోని మన్నూరుగ్రామానికి కుమార యాచ సముద్రమని తండ్రి పేరుబెట్టి నాలుగు వృత్తులుగా విభజించి సర్వమాన్యంగా బ్రాహ్మణులకు దాన మొసర్చెను. (ఇతడు కుమార యాచమనాయునికి వరదమాంబ గర్భమందు జన్మించెను) (గోపీనాథ వెంకటకవి - వెంకటగిరి సంస్థాన కవులు. పు. 24)]

మన్నెంవారి. పల్లె ఉదయ. 81+ కుటుంబనామసూచి

మన్నెం - కమ్మవాళ్లలో ఇంటిపేరు. చూడు. మనెపాడు.

మన్నె. గుంట గూడూరు. 93+; వెంకట. 65 కుటుంబనామసూచి

<మన్నెం

మన్నె. మాల గూడూరు. 70 కుటుంబనామసూచి

మన్నే. ముత్తేరి సూళ్ళూరు. 134 కుటుంబనామసూచి
ముత్తేరి. గ్రా. ద్వి.

మన్నేరి. అగ్రహారం సూళ్ళూరు. 58+ గ్రామనామసూచి
< మన్నేరు - ఇ. తిరునల్వేలి తాలూకాలో ఒకగ్రామం. అగ్రహారం
గ్రా. ద్వి

మరాటి. పాలెం వెంకట. 8?+ భాషావర్గసూచి
మరాటి - మరాటివాళ్లు, మరాఠీప్రాంత బ్రాహ్మణేతర కులాలు.

మరుపూరు రాపూరు. 45 మరుపూరిచెర్వు 1638-39.NI 3 10.6-7]
కుటుంబనామసూచి. రెడ్లలో ఇంటిపేరు.

మర్రి. గుంట కావలి. 3 వృక్షసూచి.
మర్రి - మర్రిచెట్టు Ficusbengalensis Linn.

మర్రి. పల్లె ఆత్మ. 42+ వృక్షసూచి.

మర్రిపల్లె. గోవసముద్రం రాపూరు. 39 గ్రామనామసూచి
గోవ. సముద్రం గ్రా.ద్వి. పురుషనామసూచి

మర్రి. పాడు కోవూరు. 2 [మరిపాడిగ్రామం ? 1591-92 NI. 2 46.18-9]
వృక్షసూచి.

మర్రి.పాడు ఉదయ. 110+ వృక్షసూచి

మర్ల. పల్లె సూళ్ళూరు. 8 వృక్షసూచి
< మర్లు-అ < మర్రులు-అ. ఏక. మర్రి

మర్ల. పూడి రాపూరు. 82+ వృక్షసూచి

మర్ల. మిట్ట గూడూరు. 26+ వృక్షసూచి

మర్లమూడి. జంగాలపల్లె సూళ్ళూరు. 1 గ్రామనామసూచి
మర్ల. మూడి వృక్షసూచి. జంగాలపల్లె గ్రా.ద్వి. కులసూచి

మలి. చేడు రాపూరు. 50 ? వృక్షసూచి
మలి < మల్లి-మల్లిచెట్టు Jasminum Sambac Ait

మలి మిట్ట నెల్లూరు. 38+ ? వృక్షసూచి

మల్లవరప్పాడు. కావలి. 46 మల్లవరం-పాడు గ్రామనామసూచి
మల్ల < మల-కొండ. మల, మల్ల, మల్లి రూపాంతరాలే. పైగా
శిలాసూచి వ్యక్తినామాలు తెలుగు వాళ్లలో మామూలే. పోల్చిచూడు.

మల్లయ్య, మల్లమ్మ, మల్లమీద ఏర్పడే పేర్లు. మల్లయ్య >మల్లాయ, మల్లారెడ్డి. చూడు దిగువ ఆరోపాలు.

మల్లయ్యవాని. మిట్ట కోవూరు. 4+ పురుషనామసూచి.

మల్లాం సూళ్ళూరు. 40 అస్పష్టం.

[గూడూరు తాలూకాలోని మల్లాం యొక్క ప్రాచీనమైన పేరు తిరువాం బూరుగా ఉండవచ్చును. (వి.మం.స.పు. 130]

మల్లాం చెరువు మూడు నాలుగు వందల సంవత్సరాల క్రిందట వెంకటగిరి జమీందారులచే నిర్మించబడెను. స్వర్ణముఖి ఆధారం. స్వర్ణముఖి కాలువ మల్లాం గ్రామమందు రెండుగా చీలి గ్రామాన్ని చుట్టి చెరువులో కలియును. అనగా ఒకవైపు కాలువ, మరిరెండువైపుల చీలు కాలువలు, నాలుగవవైపున చెరువుండుటచే ఎటు తిరిగినా నీరుండుటచేత కాటోలు తిరుగుడుమల్లాం పేరున పిలువ బడుచున్నది. (వి.మం.స.పు. 56)]

మల్లాయ. పాలెం కావలి. 69: సూళ్ళూరు. 53 పురుషనామసూచి

మల్లారెడ్డి. పల్లె ఉదయ. 91 పురుషనామసూచి

మల్లిపువారి. కండ్రిగ గూడూరు. 34+ కుటుంబనామసూచి

మల్లె. మాల వెంకట. 169 వృక్షసూచి

మల్లె - మల్లెచెట్టు. మల్లెమాల - రెడ్లలో ఇంటిపేరుగా కూడా ఉన్నది.

మసిగాని. తోట కోవూరు. 68+ పురుషనామసూచి. < మసిగాడు-ఇ.

మసీదు. పల్లె ఉదయ. 91+ మతసూచి

< ఉ. మసీద్ - మహమ్మదీయుల ప్రార్థనా మందిరం,

మస్తా. పురం ఆత్మ. 81+ పురుషనామసూచి

మస్తా < హిం. మస్తాన్ - A Mohammadan title meaning Saint

మహమ్మదా. పురం ఆత్మ. 107; ఉదయ. 39 పురుషనామసూచి

< అర. మహమ్మద్ - ప్రవక్త పేరు, స్తుతింపబడినవాడు

మహమ్మదీయ. పాలెం ఉదయ. 100+; కావలి. 60+ భాషావర్గసూచి

మహాలక్ష్మమ్మ. పేట కావలి. 66+ స్త్రీనామసూచి

మహాలక్ష్మి. పురం నెల్లూరు. 74+ స్త్రీనామసూచి

మహా. సముద్రం వెంకట 40 పురుషనామసూచి. (దేవతాసూచి)

మహిమ. లూరు ఆత్మ 57 [మహిమలూర ? 1217_18. NI.1.38.38]
పురుషనామసూచి. మహిమలు < మహిమల్లు

[మహిమలూరి గ్రామ కైఫియ్యత్తు: పూర్వం 1300 సంవత్సరముల కిందట యీ మహిమలూరిశీమ యావత్తు అరణ్యాక్రాంతముగా వుండెను. ఆ సమయములో శాలివాహనశక వరుషంబులు 424 అగునేటి చిత్రభాను సంవత్సరములో కందళూరు శీమలో చేరిన గుంపులు మానుదిన్నె అనే గ్రామములో యిమ్మయమల్లు అనే పాకనాటి కాపున్నూ కొమ్మరాజు వెంగన్న అనే బ్రాహ్మణుడున్నూ వీరు యిద్దరు కాపు కరణాలు గనుక గ్రామవ్యవహారం విచారించుకుంటూ వుండగా ఆ శీమ అమలుదారుడు వెంకాజీ భాస్కరరావు అనే దేశస్తుడు నిష్కారణముగా దండగలు తీసుకొనేటందుకు విచారిస్తే ఆ వుపద్రవములు తప్పించుకొనే ........కుటుంబసమేతముగా లేచి యీ రెండు యిండ్లవాండ్లు యీ దేశములోకి వచ్చి వెలుగొంటి యీవలనున్న పొంగూరు వద్దకు వచ్చి అక్కడనున్న బోయలను. ముతరాచులను కలుసుకొని యీ ప్రకారముగాను దేశ విపర్యాయము చాతను యిక్కడికి వచ్చినాము మమ్మున మీరు చేపట్టి సంరక్షణ చెయ్యవలెనని మనవి చేసుకొని వారి సమ్మతిమీద అక్కడ ఆరునెలలు నిలిచిరి. ఆ శమయములో యీ కాపరికెం అంతా వేరె ఒక పల్లె కట్టుకుని యీ సీమలో వుండుమని నిశ్చేయించేవర్కు యీ వూరివారు తమ గ్రామముకు తూర్పున వున్న తిప్ప అవతల వున్న అరణ్యము ఛేదించి అక్కడ చిన్న పల్లె వకటి కట్టుకొని వుండండి మీకు మేము వుపద్రవములు వచ్చినామేము భరిస్తున్నామని చెప్పగా వారువాండ్ల మాట మీదను వెళ్లి అరణ్య ఛేదనం చెశి అక్కడను చిన్నగుడిశెవేసుకొని వక చవటగుంట మంచినీళ్లకుంటగా యేర్పరచుకుని అక్కడ కాపురంవుండిరి. ఆ పల్లె మహిమల్లు అనే కాపు కట్టించినదిగన్కు మహిమల్లూరు అనే పేరు పెట్టినారు. ఆ శబ్దం యీ జనులకు స్వచ్ఛముగారాక మహిమలూరు అని అంటారు.
(మెకం 349. పు. 131_134)]

మాం. బట్టు సూళ్ళూరు. 125 వృక్షసూచి
< త మాం - మామిడి చెట్టు Mangifera Indica, Linn

మాక్లీన్. పేట కోవూరు. 55+ పురుషనామసూచి
మాక్లీన్ < ఇం. C. D. Macleane ఇతడు 1887_1893 ప్రాంతములో నెల్లూరుజిల్లా కలెక్టర్‌గా ఉండెను (Nellore DT. Gazetteer)

మాగాణి. తోట నెల్లూరు. 24+ భూసూచి

మాగాణి - పరిమడి, కాలువ చెరువు మొదలగు వాటితో సాగుచేసే నేల

మాచ. వరం వెంకట. 192 పురుషనామసూచి

మాచ < మాచి - పెండ్లిగాని పడతి, కొండజాతి స్త్రీనామం. (MAMP) పోల్చిచూడు - మాచన, మాచకమ్మ (రజస్వల కానిస్త్రీ) మాచపీద ఏర్పడేపేర్లు. మాచిరెడ్డి, మాచినాయుడు (మాచిసేని) చూడు దిగువ ఆరోపాలు

మాచవోలు. కండ్రిగ నెల్లూరు. 78+ గ్రామనామసూచి

మాచ. వోలు పురుషనామసూచి

మాచినేని. పాలెం కావలి 62+ పురుషనామసూచి

మాచిరెడ్డివారి. తోపు నెల్లూరు. 75+ పురుషనామసూచి

మాచెర్లవారి. పాలెం నెల్లూరు. 68+ కుటుంబనామసూచి

మాచెర్ల - గుంటూరు జిల్లాలో గ్రామనామం

మాటు. మడుగు వెంకట. 45 జలసూచి

మాటు - పొలంలో తవ్విన చిన్నకుంట. (మా వృ 1)

మాదన్నగారి. పల్లె ఆత్మ. 74 పురుషనామసూచి

< మాద - అన్న మాద < సం. మాధవః - కృష్ణుడు.

మాధవయ్య. పాలెం వెంకట. 1 పురుషనామసూచి

మాధ. వరం గూడూరు. 90+ పురుషనామసూచి

మాన. మాల గూడూరు. 63 రూ. మనమాల (ALV) అస్పష్టం

మానిగదారు. కండ్రిగ వెంకట. 152 [మాణికదారి ఖండిగె. మెకం. 354. 252) రూ, మాణిగదారి కండ్రిగ (ALV) వృత్తిసూచి

మానిగదారు ౧ మాణికదారి < మానికదారి - భోగమువి. (శ చ)

మానేగుంట.పాడు కోవూరు. 75 స్థలనామసూచి

మానే. గుంట వృక్షసూచి. < మాను

మానేరి సూళ్ళూరు. 59 రూ. మానెడి (ALV) అస్పష్టం

మాన్యాల. నట్టు గూడూరు. 127 పరిపాలనాసూచి

< మాన్యం - శిస్తులు పన్నులేకుండా గౌరవార్థం పూజ్యులకు యిచ్చిన భూమి (శ.ర.) ఇనాం, కొలువు తమకుచేసిన సేవకు పారితోషకంగా జమీందారులు, నవాబులు మొదలగువారు యిచ్చిన భూమి (మా.వృ.1)

